Ammanudi
Telugu Monthly
Volume-1
Issue-6
Rs.20/-
August 2015
Tenali, A.P

1993-2013 నడుస్తున్న చరిత్ర

తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

ఆగస్టు 2015



భాషా విధానం ఉంటేనే తెలుగు రాష్ట్రాలకు మనుగడ
తెలుగు భాషా దినోత్సవం - గిడుగు జయంతి (ఆగస్టు 29) సందేశమిదే



కీ.శే. చలసాని ప్రసాద్

తెలుగు ఎన్నటికీ చావదు
సంస్కృతాన్నీ, ఆంగ్లాన్నీ
తట్టుకొని నిలిచింది.
ఇంకా ఎన్ని
ఆటుపోట్లయినా తట్టుకొనే
శక్తి తెలుగుకుంది.
సెంటిమెంటును
పక్కనపెట్టి శాస్త్రీయంగా
మనం ముందుకు సాగితే
తెలుగు భవిష్యత్తుకు
ఢోకా లేదు.

## నాయకులారా!....మీ భాషను మార్చుకోండి...

# అందుకా! నువ్వు పైకి వెళ్ళావ్!!



అనుపమానమైన
ఒక చైతన్యవేదికను
దేశం పతాకమై
ఆలింగనం చేసుకుంటోంది
దయచేసి
అది శవపేటిక కాదని ప్రకటించండి

దేశహృదయం
రాకెట్టు వేగంతో
రామేశ్వరం చేరింది
ఏడుస్తూ వీడుకోలుపు పలకడానికి

ఆత్మగౌరవాలు
నింగికి దూసుకెడుతున్న కాలంలో
జాతీయత కాలరెత్తుకుని
గ్లోబుపై తిరుగాడే వేళ
నీవే నింగికి...

నీ చెలువ దీవెనలు
నెత్తిమీద పెట్టుకునే
చిరుహాసాల్ని యువ దరహాసాల్ని
వదిలి వెళ్ళడానికి
ఎలా మనసొప్పింది

నిజాయితీ
నిస్వార్థం
నిర్మలత్వం
గుణత్రయ సమ్మేళన చిద్విలాసా!
ఎందుకు నీ విలాసాన్ని మార్చుకున్నావు?
దగుల్బాజీ దుష్ట భ్రష్ట స్వార్థ రాజకీయాల
రొంపిలోపడి శలభాల్లా ఈదుల్లాడే మమ్మల్ని
కలల కార్యాచరణల మహామహోపాధ్యాయా!
కలాంజీ నేతాజీ
ఎందుకు మమ్మల్ని వదలివెళ్ళావు?

చుక్కల్లో కలిసినా మా చుక్కానివి నీవే
ఇప్పుడు తెలిసింది
మేం నీమార్గంలో
వదలే ఉపగ్రహాల పనితీరును
పరీక్షించడానికేగా
పైకి వెళ్ళావు!



– సన్నిధానం నరసింహ శర్మ
ఫోన్: 9292055531



# ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు భాష రక్షణ-అభివృద్ధికై ప్రభుత్వానికి ప్రతిపాదనలను ఇచ్చేందుకు మహాసభ

## తెలుగు భాషాదినోత్సవం - గిడుగు రామ్మూర్తి జయంతి 29-ఆగస్టు-2015

## ఆహ్వానం

తెలుగు రక్షణ - అభివృద్ధికై ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న చట్టాలు ఎన్నడూ సరిగా అమలు కాలేదు. నాటి ప్రభుత్వాల పట్టనితనం వల్ల అన్ని రంగాల్లో తెలుగు వినియోగం అట్టడుగు స్థాయికి చేరింది. ఈ నేపథ్యంలో 2012 ఆగస్టు 29 - తెలుగు భాషాదినోత్సవంనాడు మొదలుపెట్టి డిసెంబరు నెలాఖరు వరకు - నాలుగవ ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా తెలుగు భాషోద్యమ సమాఖ్య పెద్ద ఎత్తున ఉద్యమం నడిపింది. ప్రభుత్వం ముందు 9 డిమాండ్లను పెట్టింది. వాటిలో మొదటిదైన 'తెలుగు భాష రక్షణ, అభివృద్ధికోసం ప్రత్యేక మంత్రిత్వ శాఖ'ను ఏర్పాటు చేస్తామని ప్రభుత్వం హామీ ఇచ్చింది. 2013 డిసెంబరు 31న జీ.ఓ. ఎం.ఎస్. నెం.909 ప్రకారం సాంస్కృతిక మంత్రిత్వ శాఖతో జతచేసి 'భాషా సాంస్కృతిక మంత్రిత్వ శాఖ'ను ఏర్పాటు చేసింది. రాష్ట్రం విభజింపబడిన తరువాత రెండు తెలుగు రాష్ట్రాల్లోనూ భాషా సాంస్కృతిక మంత్రిత్వశాఖలేర్పడ్డాయి. అయితే ఏడాదికి పైగా గడచినా భాషా విధాన రూపకల్పన గానీ, కార్యక్రమ యోజన గానీ జరగలేదు.

తెలంగాణ విడిపోగా మిగిలిన ఆంధ్రప్రదేశ్‌లో గౌ॥ శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారి చైతన్యవంతమైన నాయకత్వంలో ఏర్పడిన కొత్త ప్రభుత్వం రాజధాని నిర్మాణం తదితర అత్యవసర విషయాల్లో తలమునకలుగా ఉన్నందున - ఈ శాఖ నిర్వహణకు అవసరమైన భాషావిధాన రూపకల్పన జరగలేదు. అందువల్ల తెలుగు రక్షణ, అభివృద్ధి విషయమై ప్రత్యేకించి ఎటువంటి నిర్మాణాత్మక చర్యలను ప్రభుత్వం చేపట్టలేకపోయింది.

నిజానికి, 2012 ఫిబ్రవరి 21న అంతర్జాతీయ మాతృభాషాదినోత్సవం నాడు తెలుగు భాషోద్యమ సమాఖ్య దీక్షా శిబిరానికి గౌ॥ శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారు స్వయంగా విచ్చేసి అన్ని డిమాండ్లకు పూర్తి మద్దతు పలికి, ఎన్నికల తరువాత ఏర్పడబోయే తమ ప్రభుత్వంలో వీటన్నింటిని అమలు చేస్తామని, తమ పార్టీ తెలుగుభాష, జాతి సర్వతోముఖాభివృద్ధికి కట్టుబడి ఉందని ప్రకటించారు. ఇప్పుడు వారి ముఖ్యమంత్రిత్వంలో అన్ని రంగాల్లో వేగవంతమైన అభివృద్ధికోసం ఎన్నో చర్యలు తీసుకుంటున్న సంగతి మనకు తెలిసిందే. అయితే పైన చెప్పినట్లు తెలుగుకోసం దృష్టి సారించవలసిన పని ఇంకా మొదలు కాలేదు. అందువల్ల ఇప్పుడు మరల ప్రధానమైన సమస్యలను, అంశాలను గౌ॥ ముఖ్యమంత్రిగారికి, సంబంధిత మంత్రివర్యులకూ తక్కిన పెద్దలందరికీ మరొకసారి విన్నవించదలచుకొన్నాము. ఆంధ్రప్రదేశ్‌ను అన్నివిధాలా నిజమైన తెలుగు రాష్ట్రంగా తీర్చిదిద్దడంకోసం భాషను అభివృద్ధి చేసుకొనే విషయమై తగు ప్రతిపాదనలను మళ్లీ ప్రభుత్వం ముందు పెట్టాలని సమాఖ్య భావిస్తున్నది. ఇందుకోసం తెలుగు భాషోద్ధారకుడు గిడుగు రామ్మూర్తి గారి జయంతి - తెలుగు భాషాదినోత్సవం సందర్భంగా - ఆగస్టు 29న గుంటూరులో ఒక మహాసభను ఏర్పాటు చేస్తున్నాము.

**ఈ మహాసభలో పాల్గొనగోరుతూ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ నారా చంద్రబాబునాయుడు గారిని, శాసనసభాపతి గౌ॥ డాక్టర్ కోడెల శివప్రసాద్‌గారిని, ఉప సభాపతి గౌ॥ శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారిని, భాషా సాంస్కృతిక శాఖ మంత్రి గౌ॥ శ్రీ పల్లె రఘునాథరెడ్డిగారిని, వ్యవసాయ శాఖ మంత్రి గౌ॥ శ్రీ పత్తిపాటి పుల్లారావుగారిని, సాంఘిక సంక్షేమ శాఖ మంత్రి గౌ॥ శ్రీ రావెల కిశోర్ బాబుగారిని మరికొందరు ప్రముఖులను ఆహ్వానిస్తున్నాము.**

మహాసభలో - విద్యారంగంలో, పరిపాలనారంగంలో తెలుగును పూర్తిగా అమలు చేయడంతోపాటు అన్ని రంగాల్లో తెలుగును వినియోగించేందుకు ఆధునిక భాషగా తెలుగును అభివృద్ధి చేయడం వంటి ప్రధానమైన అంశాలను పెద్దల దృష్టికి తెచ్చి వారి స్పందనను తెలుసుకొందాము. తగిన తీర్మానాలు చేసి ప్రభుత్వానికి సమగ్రమైన ప్రతిపాదనలను సమర్పిద్దాము.

**వేదిక: శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థానం - పద్మావతీ కళ్యాణవేదిక, బృందావన్‌గార్డెన్స్, 5వ లైను, గుంటూరు-6.**

**29 ఆగస్టు 2015 ఉ.10గం. నుండి సా.6 గం.వరకు**

ఈ మహాసభ నేటి తెలుగు భాషోద్యమ చరిత్రలో కీలకమైన మలుపు కానున్నది. కనుక రాష్ట్ర వ్యాప్తంగా ఉన్న భాషోద్యమకారులు, రచయితలు, కళాకారులు, ఉపాధ్యాయులు ఈ సభలో పాల్గొనాలని కోరుతున్నాము. మన ప్రాణప్రదమైన మాతృభాషకోసం చేస్తున్న పోరాటంలో ఆసక్తి గల తెలుగు ప్రజలందరూ పాల్గొనాలని కోరుతున్నాము.

**అందరికీ ఆహ్వానం : తెలుగు భాషోద్యమ సమాఖ్య, గుంటూరు-522 006.**

**డాక్టర్ వెన్నిసెట్టి సింగారావు (కన్వీనర్. ఫోన్: 9393015584), డాక్టర్ కందిమళ్ళ సాంబశివరావు, డాక్టర్ నాగభైరవ ఆదినారాయణ, డాక్టర్ చిట్టినేని శివకోటేశ్వరరావు, మోదుగుల రవికృష్ణ - (కార్యనిర్వాహక మండలి).**

తెలుగుజాతి పత్రిక
# అమ్మనుడి
మాసపత్రిక
• నుడి • నాడు • నెనరు

సంపాదకుడు డా॥ సామల రమేష్‌బాబు

శాలివాహన శకం 1937 మన్మథ నామ సంవత్సర నిజ ఆషాఢమాసము *(కట్లాపి) బహుళ పాడ్యమి శనివారము నుండి శ్రావణ *(సెవ్వాపి) బహుళ విదియ సోమవారము వరకు
* కట్లాపి, సెవ్వాపి = తెలుగు నెలలు

### చందా వివరాలు

| | | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|---|
| శాశ్వత చందా | : | రూ.5000 | రూ.7500 | -- |
| 6 సం॥ | : | రూ.1000 | రూ.1500 | 150 డాలర్లు |
| 3 సం॥ | : | రూ. 600 | రూ.1000 | 75 డాలర్లు |
| 1 సం॥ | : | రూ. 240 | రూ. 400 | 25 డాలర్లు |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు

**'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.
**AMMA NUDI - AXIS BANK, TENALI**
అక్కౌంట్ నెం. **915020010550189**
**IFSC Code : UTIB0000556**

ఆన్‌లైన్‌లో చందాను పంపినవారు, ఆవెంటనే దయతో - చిరునామా, ఫోన్ నెం. తదితర వివరాలను, జాబుద్వారాగాని, ఫోన్ మెసేజి ద్వారాగాని తెలుపగలరు.

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా

**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, **తెనాలి**
గుంటూరు జిల్లా - 522 211. ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com

**చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంపగలము. ఇందుకోసం మీ మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

### చందాదారులకు తప్పనిసరి సూచనలు

1. చందా కాలం ముగింపు తేదీ - పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. మీ చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరు, పోస్టాపీసు పిన్‌కోడ్ నెంబరు తదితర పూర్తివివరాలు మీ చిరునామాలో తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి. మీ చిరునామా మారినట్లయితే వెంటనే తెలియజేయండి.

# 'నడుస్తున్నచరిత్ర' చందా ఉన్నవారికి సూచన

**'అమ్మనుడి'** పత్రిక ఇంతకు ముందున్న నడుస్తున్నచరిత్ర ఆశయాదర్శాలతో వస్తున్నదే. కానీ పత్రికను **'తెలుగుజాతి'** ట్రస్టు ప్రచురిస్తున్నది. అయినా, కొందరి విజ్ఞప్తి మేరకు నడుస్తున్నచరిత్రకు చందాలు మిగిలివున్న వారికి కూడా వారి చందా సొమ్ముకు సరిపడా **'అమ్మనుడి'** పత్రికను పంపించాలని తెలుగుజాతి ట్రస్టు నిర్ణయించింది. కనుక ప్రతివారికి వారి చందా సొమ్ము ఇప్పుడు **'అమ్మనుడి'** చందా వివరాల ప్రకారం ఎప్పటివరకూ సరిపోతుందో - పత్రికను పెట్టి పంపే కవరుపై చిరునామా పైన ముద్రించి వుంటుంది. దానిని చూచుకొని, దయచేసి సకాలంలో **'అమ్మనుడి'** చందాను పంపించి పత్రికకు మీ మద్దతును కొనసాగించ గోరుతున్నాము.

### వెంటనే చందాలు పంపండి

అమ్మనుడి తొలి నాలుగు సంచికలను (మార్చి, ఏప్రిల్, మే, జూన్) నడుస్తున్న చరిత్ర చందా మిగిలి ఉన్నవారికి, అయిపోయిన వారికీ కూడా పంపించాము. ఇకపై చందా మిగిలిఉన్నవారికి, కొత్త చందాదారులకు మాత్రమే పంపగలము. పైన ఇచ్చిన సూచనను కొందరు గమనించి ఉండకపోవచ్చు. చూసినప్పటికీ పనుల వత్తిడిలో చందాసొమ్మును పంపించకపోయి ఉండవచ్చు. అటువంటివారు దయచేసి వెంటనే పత్రిక చందా పంపమని మనవి.

### శాశ్వత చందాదారులకు మనవి

'నడుస్తున్నచరిత్ర'కు రు. 1000 లు చెల్లించి, శాశ్వత చందాదారులుగా చేరినవారు 'అమ్మనుడి' పత్రికకు శాశ్వతచందా రు.5000 లకు గాను రు.4000 లు మాత్రం పంపి కొత్తగా రశీదు పొంద ప్రార్థన. అలా చేయలేనివారికి ఏడాదిపాటు **'అమ్మనుడి'** పత్రికను పంపించగలం. అప్పటికీ చందాను కొనసాగించలేని వారికి పత్రికను పంపజాలమని మనవి చేస్తున్నాము. దయచేసి సహకరించగోరుతున్నాము.

### విన్నపం

'నడుస్తున్నచరిత్ర' పత్రికను అనేకమందికి ఉచితంగా పంపిస్తుండేవారము. ఇకపై ఉచితప్రతులు పంపడం వీలుపడదు. పత్రిక కావలెనని కోరుకొనే వారందరూ చందాదారులుగా చేరవలసిందిగా కోరుతున్నాము. మీ మిత్రులను కూడా ప్రోత్సహించి, చందాదారులుగా చేర్చి పత్రికను శక్తివంతం చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము. ఇంతవరకు పత్రిక పరిచయం లేనివారు మాదిరిప్రతి (శాంపుల్‌కాపి) ని కోరినచో వారికి ఉచితంగా పంపగలము.

**- ప్రచురణకర్త**

## '**అమ్మనుడి**' పత్రిక మీకు నచ్చితే, దయచేసి వెంటనే చందాదారులుగా చేరండి.

చందా సొమ్మును

- మనియార్డర్ ద్వారా పంపవచ్చు.
- ఆన్‌లైన్‌లో పంపవచ్చు.
- బ్యాంకు డి.డి. / చెక్ పంపవచ్చు.

*మీకు ఎలా వీలయితే అలా పంపించవచ్చు.*
*వివరాలు 4వపుటలో చూడండి.*
*ప్రతినెలా పోస్టులో పత్రికను పంపగలము.*

## రచయితలకు సూచనలు

1. విభిన్న అంశాలపై వ్యాసాలను పంపవచ్చు. ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకుండా ఉండాలి. అన్నిరంగాలలో తెలుగువారి శ్రేయస్సుకు సంబంధించిన రచనలను పంపండి. విమర్శలు విషయం పైనే ఉండాలి గాని వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. అప్రజాస్వామిక రచనలను తీసుకోలేము. సరళమైన తెలుగులో వ్రాయాలి. 2. రచనలను యూనికోడ్‌లో గాని, అను ఫాంట్స్ లో గాని టైప్ చేసి లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్ చేసి ammanudi@gmail.com కు పంపాలి. లేదా కొరియర్ / రిజిష్టర్డ్ / సాధారణ పోస్టులో పంపవచ్చు. 3. రచనతోపాటు రచన స్వంతమేనని, ఇతర పత్రికలకు గాని, ఇంటర్నెట్ పత్రికలకు గాని పంపలేదని, పరిశీలనలో లేదని, ఇంతవరకు ఎక్కడా ప్రచురణ కాలేదని హామీపత్రం విధిగా, స్పష్టంగా వ్రాసి పంపాలి. పోస్టల్ చిరునామా, ఫోన్ నెం., ఇ-మెయిల్ కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము. 4. మాకు పంపే రచన నకలును మీ వద్ద ఉంచుకోండి. ప్రచురణకు ఎంపిక చేయని రచనలను తిప్పి పంపడం వీలుకాదు.

## కథారచయితలకు, కవులకు విన్నపం

1. మాట్లాడుకొనే తెలుగులో వ్రాసిన కథల్ని '**నడుస్తున్న చరిత్ర**' ప్రచురించిన సంగతి చదువరులకు, రచయితలకు తెలిసిందే. ఈ సంప్రదాయాన్ని '**అమ్మనుడి**' పత్రిక కొనసాగిస్తుంది. పాత్రల సంభాషణలు తప్పనిసరిగా మీ ప్రాంతంలో మాట్లాడుకొనే తెలుగు తీరులో ఉండాలి. కథాచిత్రణ కూడా మీ తెలుగు తీరులోనే ఉంటే మంచిది. కఠినమైన సమాసాలను ఉపయోగించవద్దు. తేలికైన తెలుగు మాటలు కుదరకపోతే జనం వాడుకలోని ఇతర ప్రాంతాల తెలుగు మాటల్ని వ్రాయవచ్చు. తప్పనిసరి అయితే తప్ప ఏ ఇతర భాషల మాటలను ఉపయోగించవద్దు. ఈ సూచనలే కవితలకూ వర్తిస్తాయి.

2. '**అమ్మనుడి**'లో ప్రచురణకు తీసుకొనే కథలు, కవితలు తెలుగువారి సామాజిక, భాషాసంస్కృతుల వికాసానికి తోడ్పడేవిగా ఉండాలి.

3. ప్రతినెలా ఒకటి లేక రెండు కథలను మాత్రమే ప్రచురించగలం. ముద్రణలో 2 లేక 3 పుటలకు మించకుండా ఉండేవాటినే తొలి ఎంపికకు తీసుకుంటాము. కవితలు 20 నుంచి 30 వరుస (లైన్ల)లకు మించకూడదు. ప్రతినెలా 4 లేక 5 కవితలకు మించి పత్రికలో చోటుండదు.

'ప్రజలకు సులభముగా తెలిసేట్లు మాతృభాషలో సమస్త శాస్త్రములు బోధించవలెను... భావము స్పష్టముగా తెలియవలెనంటే భాష సుపరిచితముగా ఉగ్గుపాలతో అలవడ్డ మాతృభాష అయి ఉండాలి.'' – ఇవీ గిడుగు రామమూర్తిగారు వందేళ్ల క్రిందట స్పష్టంగా చెప్పిన మాటలు....7




## లోపలి పుటలలో....



కైసేత: **అ. రాజ్యలక్ష్మి, శంకర్**, రేఖాచిత్రాలు: బాలి, జావేద్
పకపకలు: **సరసి** ఫొటోలు: తమ్మా శ్రీనివాసరెడ్డి

**పత్రికలో రచయితలు వ్యక్తం చేసే అభిప్రాయాలు వారి స్వంతం. వారితో పత్రిక యాజమాన్యం, సంపాదకుడు ఏకీభవించవలసిన అవసరం లేదు.**


**రచనలు, ఉత్తరప్రత్యుత్తరాలకు : డాక్టర్ సామల రమేష్‌బాబు**, సంపాదకుడు, **అమ్మనుడి**,
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520004. e-mail : ammanudi@gmail.com
దూరవాణి: కార్యాలయం : *0866-2439466* సంపాదకుడు : *9848016136*

## రు.పదివేల చొప్పున విరాళమిచ్చిన తెలుగుజాతి ట్రస్టు 'ప్రోత్సాహకులకు' మప్పిదాలు.



**శ్రీ జి.పి.ఎన్. గుప్తా**

**చెన్నై**

చెన్నైలో పారిశ్రామికవేత్త. చాలాకాలంగా 'నడుస్తున్న చరిత్ర' చదువరులు. జంబో బ్యాగ్ లిమిటెడ్ మేనేజింగ్ డైరెక్టర్‌గా, భారత వికాస పరిషత్ అన్నానగర్ శాఖకు అధ్యక్షులుగా, చెన్నైలోని డా॥ నల్లి కుప్పుస్వామి వివేకానంద విద్యాలయానికి, జూనియర్ కాలేజికి, శ్రీ గోరంట్ల రామలింగయ్య వివేకానంద విద్యాలయకు, శ్రీ కృష్ణా వివేకానంద విద్యాలయానికి ఉపాధ్యక్షులుగా వున్నారు.



**శ్రీ ఎ.కె. జయచంద్రారెడ్డి**

**బెంగళూరు**

చాలాకాలంగా 'నడుస్తున్న చరిత్ర' చదువరిగా వున్న ఎ.కె. జయచంద్రారెడ్డిగారు బెంగుళూరులోని తెలుగు విజ్ఞాన సమితి ప్రధాన కార్యదర్శిగా వుంటున్నారు. స్థానిక తెలుగు భాషా సాంస్కృతిక కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొంటూ వుంటారు. ఇప్పుడు **అమ్మనుడి** పత్రికను ఇష్టపడి చదువుతున్నారు. వృత్తిరీత్యా వీరు బెంగుళూరులో ప్రముఖ ఆడిటర్.



**కీ.శే. బి.స. బంగారయ్య గారి**

**కుమార్తె బి.ఎ. శారామణి**

నడుస్తున్న చరిత్రలో బి.స. బంగారయ్యగారి 'తెలుగా ఆంధ్రమా', 'నుడి-నానుడి' పుస్తకాలు ధారావాహికంగా ప్రచురించబడి సంచలనం కలిగించిన సంగతి చదువరులకు తెలిసిందే.

వారి కుమార్తె శారామణిగారు చిత్తూరుజిల్లా నాయుడుపేటలో ఎల్.ఐ.సి. ఉద్యోగిగా ఉన్నారు. ఆమె నడుస్తున్న చరిత్ర/అమ్మనుడి పత్రికాభిమాని.

# తెలుగుజాతి (ట్రస్టు) విన్నపం

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, పొరుగు రాష్ట్రాల్లోనూ నివశిస్తున్న తెలుగువారి శ్రేయస్సుకు, తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరుగుతున్నది. దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేకాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని, భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు ఈ దిశగా పనిచేస్తున్నారు. ఇందుకు తగ్గవిధంగా ఇంకా సమగ్రంగా, బలంగా ఒక పత్రికను, దానితోపాటు కొన్ని పుస్తకాలను ప్రచురించవలసిన అవసరం ఏర్పడింది. కొన్ని కార్యక్రమాల్ని కూడా చేపట్టవలసివుంది. ఇందుకోసం ఇప్పుడు 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును రిజిస్ట్రేషన్ చేయించాము. (92/2014).

తెలుగువారు అన్ని రంగాల్లో ముందడుగు వేసేందుకు తోడ్పడటమే ఈ ట్రస్టు లక్ష్యం. తెలుగు 'అమ్మనుడి"గా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది. ఆంధ్రప్రదేశ్, తెలంగాణాలలోనే కాక ఇతర రాష్ట్రాల్లోనూ, ఇతర దేశాల్లోనూ వున్న తెలుగు ప్రజలకోసం ట్రస్టు పనిచేస్తుంది.

'నడుస్తున్న చరిత్ర' 2013 అక్టోబర్‌తో నిలిచింది. దానిని మరింత సమగ్రంగా **'అమ్మనుడి'** పేరుతో పత్రిక ప్రచురణను మొదలుపెట్టాము. **2015** మార్చి నుండి ప్రతినెలా పత్రికను ప్రచురించుచున్నాము. పుస్తకాల ప్రచురణ కార్యక్రమంలో తొలుతగా స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'** విడుదల చేశాము. తక్కిన కార్యక్రమాలను కూడా కాలక్రమంలో చేపడతాము. ఈ ట్రస్టును బలమైన పునాదులతో, వనరులతో ఏర్పరచటానికి మీ అందరి చేయూత కావాలి. ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.

| | | |
|---|---|---|
| **ప్రోత్సాహకులు** | **రు.** | **10,000/-లు** |
| **పోషకులు** | **రు.** | **25,000/-లు** |
| **విశిష్ట పోషకులు** | **రు.** | **50,000/-లు** |
| **రాజ పోషకులు** | **రు.** | **1,00,000/-లు** |

వీరి ఫొటోతో క్లుప్తంగా పరిచయాన్ని **'అమ్మనుడి'** పత్రికలో ప్రచురిస్తాము. వీరికి ప్రతినెలా పత్రికను, ట్రస్టు ప్రచురించే పుస్తకాలను ఉచితంగా పంపిస్తాము.

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి.

యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.

అక్కౌంట్ నెం. 914020020387880

I.F.C.Code : UTIB0000068

**డా॥ సామల రమేష్‌బాబు,** మేనేజింగ్ ట్రస్టీ, 9848016136

**పొరుపల్లి కోదండరామయ్య,** ట్రస్టీ, 9505298565

**డా॥వెన్నిసెట్టి సింగారావు,** ట్రస్టీ, 9393015584

**స.వెం.రమేశ్** ట్రస్టీ, 8500548142

**సామల లక్ష్మణబాబు,** ట్రస్టీ, 9440448244

సంపుటి : 1 సంచిక : 6
**అమ్మనుడి**
ఆగస్టు 2015

సంపాదకీయం

# 'భాషావిధానం' ఉంటేనే తెలుగు రాష్ట్రాలకు మనుగడ

"ప్రజలకు సులభముగా తెలిసేట్లు మాతృభాషలో సమస్త శాస్త్రములు బోధించవలెను... భావము స్పష్టముగా తెలియవలెనంటే భాష సుపరిచితముగా ఉగ్గుపాలతో అలవడ్డ మాతృభాష అయి ఉండాలి." – ఇవీ గిడుగు రామమూర్తిగారు వందేళ్ల క్రిందట స్పష్టంగా చెప్పిన మాటలు. ఇవే మాటల్ని చాలామంది నేతలు, మేధావులు చెప్పారు. మరి ఆవిధంగా మన మాతృభాష తెలుగును పెంపొందించుకోవటానికి అడ్డుపడుతున్నదేమిటి? రాజ్యం మనది. పాలనాధికారమూ మనదే. కావలసిన రాజ్యాంగ రక్షణలన్నీ ఉన్నాయి. మరి మనం ఎందుకు ఎదగలేకపోతున్నాము?

తెలుగు భాషకు ఆ శక్తి లేదా? జన సంఖ్యాపరంగా ప్రపంచంలో తొలి పది పెద్ద భాషల్లో ఒకటిగా, భారతదేశంలో మొదటి మూడు స్థానాల్లో ఉన్న తెలుగుకు ఆ శక్తి ఉందా? లేదా? శాస్త్రసాంకేతిక అంశాలతో సహా అన్ని విషయాలకూ సంబంధించిన జ్ఞానాన్ని నోటితోనూ, వ్రాతలోనూ వ్యక్తం చెయ్యగల సమర్థత మన భాషకుందని, అన్నివిధాలా అత్యంత సమర్థమైన భాష అనీ నాటి హాల్డేన్ నుంచి ఎందరో చెప్పారు. అక్కడక్కడా ఇటీవల జరుగుతున్న పరిశోధనా ఫలితాలు కూడా ఆమాటే చెప్తున్నాయి. తొలుత సంస్కృతాన్నీ తర్వాత ఇంగ్లీషునీ తట్టుకొని ఒక జీవద్భాషగా ప్రజల్లో ఉన్న తెలుగుకు (చలసాని ప్రసాద్ గారన్నట్లు) ఢోకా లేదు. నిజమే. ఇదే మాటను అక్కడక్కడా కొందరు పెద్దలు, మేధావులు అంటుంటారు. కీ.శే. చేకూరి రామారావుగారు ఇలాగే అనేవారు.

ఇక్కడ మనం గమనించవలసినదేమంటే– రాజులకాలంలో పండితుల ప్రతిభను తెలిపే సాహిత్య సృష్టికీ కొద్దిపాటి పాలనావసరాలకీ భాష పరిమితమైంది. కాని, అందరికీ విద్య అందవలసిన రోజులివి. విద్యకు పరిమితులు లేకుండా, వెయ్యి విధాలా వికసిస్తున్న కాలమిది. అన్ని రంగాల్లో అభివృద్ధికీ, విద్యకూ లంకె. కార్మికులు, కర్షకులనుండి శాస్త్రజ్ఞుల వరకు సమస్త విజ్ఞానాన్ని అందించేది విద్యే. ఈ విద్య ఏ భాషలో అందాలి అనేదే ఇక్కడ కీలకాంశం. వ్యాకరణమూ అర్థతాత్పర్యాలు విలక్షణాంశాలూ ప్రత్యేకంగా నేర్చుకోకుండా అతి సహజంగా ఒంటబట్టించుకోగల నుడి–అమ్మనుడి (మాతృభాష) మాత్రమే.

తెలిసిన భాషద్వారా తెలియని జ్ఞానాన్ని నేర్చుకోవాలి. ఇది శాస్త్రీయ, సహజ పద్ధతి. ఇందువల్ల విద్యార్థికి గల సహజ మేధోశక్తి వృథా కాకుండా ఉంటుంది. పరాయిభాష నేర్చుకోవడానికే తన శక్తిని వినియోగించవలసిన అక్కరను నివారించి తన అమ్మనుడి లోనే విద్యనభ్యసించడం మాత్రమే జ్ఞానార్జన సాధనం కావాలి.

కాని, ఇప్పుడు జరుగుతున్నదేమిటి! విద్యారంగాన్ని ఏలుతున్న ప్రయివేటు విద్యాసంస్థల్లో తెలుగు పిల్లవాడు మూడో ఏడునుండే ఇంగ్లీష్ నేర్చుకొనే పని ప్రారంభమవుతోంది. ఆ భాషతోపాటు తన సాంస్కృతిక వారసత్వానికి దూరమవుతున్నాడు. ఇంటిదగ్గర, ఇరుగుపొరుగుల్లో తను ఆడుకొనేది, పాడుకొనేది, ఊపిరి పీల్చేదీ అంతా తెలుగులోనే. బడికి వెళ్లి నేర్చుకోవలసింది పరాయిభాష. ఆ మీడియంలోనే చదువు సాగించేందుకు తప్ప ఇక ఎందుకూ పనికిరాని రీతిలో అతడి చదువు సాగుతుంది. జి.ఒ. నెం.86(2003) పేరుకు ఉన్నా, తెలుగును 4వ తరగతినుండి మాత్రమేకొందరు నేర్పుతున్నారు. (ఉదా: మిషనరీస్కూళ్లు, సెంట్రల్ సిలబస్ స్కూళ్లు). ఈ విధంగా అతడికి జీవితంలో ఇంట్లో మాట్లాడుకోవడానికే తప్ప తన అమ్మనుడితో అక్కర ఏమీ లేకుండా పోతోంది.

తెలుగుభాష ఎంత గట్టిదైనా, శక్తిగలదే అయినా ఇక దాన్ని అన్ని రంగాల్లో వినియోగించడం ఎలా వీలు

అవుతుంది? క్రమక్రమంగా అన్నిచోట్లా దాని అవసరం తీరిపోతుంది. ఇప్పటికే ఆ లక్షణాలు బాగా కన్పిస్తున్నాయి. అక్కరలేని భాషను ఆధునికభాషగా రూపొందించే ప్రసక్తి రాదు కదా!

ఇదీ అసలు సమస్య. అందుకే ప్రభుత్వానికి ఒక భాషా విధానం కావాలి. 'భాషావిధానం' ఎందుకూ? అలాంటిది ప్రభుత్వాలకు ఉండాలా?' అని ప్రశ్నించిన వారు ఉన్నారు. అసలు భాషను రక్షించి పెంచే పని ప్రభుత్వాలదెలా అవుతుందని అంటున్న నేతలూ వున్నారు.

ఇప్పుడు కావలసినదేమిటంటే– తొలిదశలో తెలుగు రాష్ట్రాల్లో ప్రాథమిక విద్యామాధ్యమంగా మాతృభాషే ఉండాలని కట్టడి చెయ్యాలి. తెలుగు మాతృభాష కాని విద్యార్థులకు తెలుగును రెండవభాషగా తప్పనిసరి చెయ్యాలి. 3వతరగతి నుండి, కాదంటే మొదటినుండీ ఆంగ్లభాషను కొద్దికొద్దిగా నేర్పవచ్చు. 6వ తరగతినుండి తెలుగు, ఆంగ్ల మాధ్యమాలను కొనసాగిస్తూ తెలుగు బోధనను పటిష్టం చెయ్యాలి. తర్వాత కళాశాల విద్యలో ఆపైన ఎంతవరకు చదువుకున్నా తెలుగు మాధ్యమంగాక ఆంగ్లమాధ్యమంలో ఉంటే తెలుగును ఒక సబ్జెక్టుగా కొనసాగించాలి.

ఇదే సమయంలో క్రమక్రమంగా ఉన్నత విద్యాబోధనకూ శాస్త్రసాంకేతిక విద్యాబోధనకూ తెలుగును సన్నద్ధం చెయ్యాలి. అందుకు తగ్గవిధంగా తెలుగు మూలాలపై ఆధారపడి పరిశోధన సాగించాలి. సంస్కృతం నుంచీ ఆంగ్లంనుంచీ ఇప్పటికే ఇమిడివున్న మాటలను కొనసాగిస్తూనే తేటతెలుగు మాటల కూర్పుతో భాషను సమగ్రంగా అభివృద్ధి పరిచే కృషి కావాలి. ఇదీ తెలుగు అభివృద్ధికి కావలసిన మౌలిక కృషి.

ఇక పరిపాలనలో అన్ని స్థాయిల్లో తెలుగుకు తొలిస్థానం ఉండాలి. చట్టాల నిర్మాణంలో కానివ్వండి, అమలుకు సంబంధించిన అన్ని దశల్లోనూ తెలుగే రాజ్యమేలాలి. అక్కర వున్న చోట రెండవస్థానంలో అది ఇంగ్లీషైనా, ఉర్దూ ఐనా, మరొకటైనా. న్యాయస్థానాల్లోగాని, ఇతరత్రా ప్రజలకు సంబంధించిన అన్ని సందర్భాల్లోనూ తెలుగుకు తొలి స్థానం ఉంటుందని స్పష్టంగా ప్రకటించాలి. ఇందుకు ఆదర్శంగా ముఖ్యమంత్రి కార్యాలయం చురుకుగా పని చేపట్టాలి.

తెలుగు భాషా పరిశోధన – అది ఏ అవసరాలకు తగినట్లయినా (కంప్యూటర్లతో సహా) అభివృద్ధి చేసుకోడానికి– పైన చెప్పినట్లు – తెలుగు మూలాలమీద– తెలుగు క్రియా పదాలు, తత్త్వశాస్త్రం మీద ఆధారపడాలి. అది కొత్తలో వింతగా ఉండవచ్చుగాని కాలక్రమంలో ప్రజలనోళ్లలో, పత్రికల్లోపడి ఆ మాటలు అనతికాలంలోనే తేలిగ్గా ప్రచారమౌతాయి.

ఇలాంటి మౌలికాంశాలపై స్పష్టతతో భాషా విధానాన్ని రెండు తెలుగు రాష్ట్రాలూ రూపొందించుకోవాలి. వాటిలో ఆ ప్రాంతాల, సామాజికవర్గాల ప్రత్యేకతలు స్పష్టంగా ప్రతిబింబించేటట్లు శ్రద్ధ వహించాలి. అదే ప్రజాస్వామ్య పద్ధతి. తెలుగును జీవద్భాషగా కాపాడుకోవాలంటే అన్ని వైవిధ్యాలను కలుపుకుంటూ ఎదగాలి. అందరూ చెప్పే 'ఇంక్లూజివ్ గ్రోత్' సూత్రం ఇదే.

భాషా విధానం లేకుండా భాషా రాష్ట్రాలెలా ఉంటాయి! ఏ ప్రాతిపదికన అవి భాషా రాష్ట్రాలుగా చెప్పుకొంటాయి? తమ రాష్ట్ర భాషను, తమ ప్రజల సాంస్కృతిక సంపదను మోసుకొచ్చే సాధనాన్ని తమ ప్రజలకు దూరంచేసి, బాధ్యతారహితంగా వ్యవహరిస్తే అవి భాషా రాష్ట్రాలు ఎలా అవుతాయి?. భాషావిధానాన్ని స్పష్టంగా ప్రకటించాలని ప్రభుత్వంపై న్యాయపరమైన వత్తిడి కూడా తెచ్చేందుకు అవకాశం ఉందేమో పెద్దలు పరిశీలించాలి. ఇదే సమయంలో రాజ్యాంగం గుర్తించిన భాషల రక్షణకు కేంద్ర ప్రభుత్వం చేసేదేమిటో, వారి భాషావిధానమేమిటోకూడా స్పష్టం కావాలి.

మళ్లీ హిందీని మననెత్తిన రుద్దడానికి, భారత సాంస్కృతిక ఏకత పేరుతో అవసరంలేని భాషాపదాలను దేశీయ భాషలనెత్తినరుద్దే ప్రయత్నాల్ని అడ్డుకొనే బాధ్యతకూడా రాష్ట్ర ప్రభుత్వాలపై ఉంది.

తెలుగువారమంతా ఒకే రాష్ట్రంలో ఉండాలని కొందరు త్యాగాలతో కొందరు స్వార్థంతో విశాలరాష్ట్ర నిర్మాణం చేసారేగాని, తెలుగు భాషనేమాత్రం పట్టించుకోలేదు. ఆ తెలుగు ప్రజల సాంస్కృతిక ఐక్యతకూ ఎన్నడూ కృషి చెయ్యలేదు. ఇందువల్లే సోదరులు విడిపోవల్సివచ్చింది. కనుక తమ భాషా సంస్కృతుల ప్రత్యేకతలను కాపాడుకొంటూ ఎదగడానికైనా రెండు రాష్ట్రాల ప్రభుత్వాలు తమ భాషావిధానాలను స్పష్టంగా ప్రకటించాలి.

**30-7-2015**

సామల రమేష్‌బాబు

సంపాదకీయం

పలుకు తీరు

– ప్రొ. పులికొండ సుబ్బాచారి

# నాయకులారా, మీ భాషను మార్చండి

గతంలో మహానాయకులు మహా వక్తలుగా ఉన్న సందర్భాలను గుర్తుకు తెచ్చుకుంటే. నెహ్రూగారి ప్రసంగం వస్తుందంటే జాతి మొత్తం రేడియో దగ్గర ఎదురు చూసేదట. పుచ్చలపల్లి సుందరయ్యగారి ఉపన్యాసం ఉంది అంటే ప్రజలు బండ్లు కట్టుకొని దగ్గరి ఊళ్లకు వెళ్ళి ఆయన ఉపన్యాసాలు వినేవారు. అలాంటి వారిని నేటి నాయకులు స్ఫూర్తిగా భావించాలి. నాయకులు మాట్లాడేభాష, వారి సంస్కారాన్ని విద్వత్తుని తెలుపుతుంది. వారి భాష వారికి శక్తినిస్తుంది అని గమనిస్తే... నాయకులూ, మీ భాషను మార్చండి. అది మీకు సహాయం చేస్తుంది. మిమ్మల్ని పెంచుతుంది.

**భాష** వినియోగం అనేది వ్యక్తికీ, వ్యక్తికీ మారుతుంటుంది.ఒకే ఇంట్లో ఒకే కుటుంబసభ్యులు మాట్లాడే భాషలో కూడా మార్పులు ఉండవచ్చు. ఇది శాస్త్రీయంగా అంగీకరించిందే. పదజాలం మారకపోయినా ఉచ్చారణ కాకువుల వినియోగం మారవచ్చు. ఒకే గ్రామంలో ఉన్నా వ్యక్తుల మధ్య వారి వృత్తి, కులం నేపథ్యాలను బట్టి భాష వినియోగంలో మార్పు ఉంటుంది. ప్రస్తుత సమాజంలో సాంప్రదాయికంగా వస్తున్న వృత్తులు కొన్ని అంతరించాయి. కొత్త వృత్తులు వచ్చాయి. వాటి నేపథ్యంలో భాషలో కూడా మార్పులు చోటుచేసుకున్నాయి. ఆరుద్రగారు ఒకసారి మాట్లాడుతూ ఒక లాయర్ గుమాస్తాకి ప్రేమగీతం రాస్తే 'నువ్వంటేనే నాకు మోజు అందుకు రాసిస్తానే దస్తావేజు' అని రాయవలసి ఉంటుందని చెప్పారు. అంటే సినిమాలో పాత్రోచిత భాష వాడాలని ఇక్కడి సూచన. వ్యక్తులు మాట్లాడే భాష వారి వారి వృత్తి నేపథ్యాలతోనే ఉంటుందని చెప్పక చెప్పారు. ఇక సమాజంలో ఆయా వ్యక్తులు వారి వృత్తి నేపథ్యాలనుండే ఈ ఆధునిక యుగంలో కూడా మాట్లాడుతున్నారన్నది సత్యం. మన సమాజంలో రాజకీయ నాయకులు అనేవారు ప్రజాస్వామ్య యుగంలో ఏర్పడిన ఒక సామాజిక వర్గం. దీనికై ఇది ప్రత్యేక వర్గంగా ఏర్పడింది. రాజకీయాలలో ఉండడం. పార్టీ రాజకీయాలలో వివిధ స్థాయిలలో పనిచేయడం అన్నది నేటికి ఒక వృత్తి ధర్మంగా మారింది. కొందరు నాయకులు నాకు రాజకీయ విద్య నేర్పిన గురువు ఫలానా నాయకుడు అని కంఠోక్తిగా చెప్పడం మనం చూస్తున్నాము. ఇది నేడు ఒక వృత్తి రూపాన్ని పొందింది అని చెప్పడానికి చాలా సాక్ష్యాలు చూపవచ్చు. పార్టీలు వేరైనా వారి ప్రకార్యాలు ఒకటే. వారు మాట్లాడే భాషలో పార్టీలకతీతంగా సామ్యం ఉంది. వారు మాట్లాడే భాషలోని స్థితిగతులు, ఎత్తుపల్లాలు, గతుకుల గురించి ఉద్దేశించిందీ వ్యాసం.

మిగతా వృత్తుల వారికి లాగే రాజకీయ నాయకులకు ఒక భాష వినియోగంలో ప్రాచుర్యంలో ఉంది అని చెప్పుకున్నాము. వక్తృత్వం అనే ఒక ప్రత్యేకమైన కళ. ఈ కళ అవసరం రాజకీయనాయకులకు ఉన్నంతగా మరొకరికి ఉండదు. అమెరికాలో అధ్యక్షుని ఎంపిక చాలా అంశాలమీద ఆధారపడి ఉంటుంది నిజమే, కాని అక్కడ వక్తృత్వం అనే అంశం కూడా చాలా ప్రాధాన్యం వహిస్తుంది. ఎంత మంచి పరిపాలకుడు అయినా, అక్కడ అతను మంచి వక్త కాకపోతే, ప్రజల మధ్య తన ప్రత్యర్థికి పక్కన నిలబడి అతను చేసే ప్రతిపాదనలను ప్రతిభావంతంగా తిప్పికొట్టి తన ప్రతిపాదనలు చాలా మంచివి అని పటిష్ఠమైన భాషతో ప్రజలని మెప్పించవలసి ఉంటుంది. అలా కాని పక్షంలో అమెరికా అధ్యక్ష పదవికి ఎంపిక కావడం కష్టం. దాదాపు 99 శాతం అమెరికా అధ్యక్షులు మంచి వక్తలుగా ఉండడం జగమెరిగిన సత్యం. మన దేశంలో కూడా రాజకీయ నాయకులు మంచి వక్తలు అయినవారు బాగా రాణిస్తూ ఉండడాన్ని గమనించవచ్చు. వక్తలు కానివారు కూడా ఎన్నికలలో పరిపాలనలో బాగా రాణించారు అనేది కూడా సత్యమే. కాని మంచి ప్రతిభావంతుడైన నాయకుడికి మంచి వక్తృత్వం ఉండడం అనేది అదనపు ఆకర్షణ గుణం కూడా. నా చిన్నతనంలో ఒక పెద్దాయన చెప్పగా విన్నాను. ఎన్టీఆర్ ఇంకా రాజకీయాలలోకి రాకముందు, అదీ నీలం సంజీవరెడ్డిగారు పదవిలో ఉన్న కాలంలో ఒకసారి తుఫాను బాధితులకోసం విరాళాలు సేకరించే కార్యక్రమంలో ఒక వేదిక మీద ఎన్టీఆర్ ఉపన్యాసం చేశారట. అది విన్న సంజీవరెడ్డిగారు ఆయన వక్తృత్వానికి ఆశ్చర్యపడి ఈయన రాజకీయాలలోకి వస్తే మేం ఎవరం ఇతనికి పోటీగా నిలవలేం అని అన్నారట. పెద్దవారి మాట నిజంగానే నిజం అయింది. ఎన్టీఆర్ రాజకీయ పార్టీ పెట్టిన తర్వాత ఆయనకు అఖండ విజయం అత్యంత ప్రజాదరణ కలగడానికి కారణం ఆయనకున్న సినిమా ఆకర్షణ ఒక్కటే కాదు దానికి ఆయనకున్న వక్తృత్వ పటిమ కూడా అని కచ్చితంగా చెప్పవచ్చు. ఆనాటి రాజకీయ వృత్తిలో ప్రాచుర్యంలో ఉన్న పడికట్టు ఉపన్యాసాలకు అది పూర్తిగా భిన్నంగా ఉండేది. తెలుగు రాజకీయాలలో ఆనాటి నుండి నేటి వరకు చాలా మంచి వక్తలున్నారు. అంతేకాదు మంచి వక్తలు కానివారు కూడా చాలా మంచి విజయాలు సాధించారు. అది నిజమే దానికి వేరే కారణాలు ఉంటాయి.

నాయకుల భాషలో కొన్ని నిర్మాణాలను విధానాలను గమనించవచ్చు. కొన్ని అనాదిగా వస్తున్నాయి. కొన్ని ఇటీవలి కాలంలో అంటే దృశ్యమాధ్యమాలు బాగా ప్రబలిన తర్వాత వ్యాప్తిలోకి వచ్చినవి ఉన్నాయి. నాయకుల భాషలో నాటికి నేటికి విరివిగా వినియోగించే మాట – 'యొక్క' అనే మాట. ఇది వాడి వాడి అరిగి అరిగి ఉన్న పదం. ఆ యొక్క ఈ యొక్క అనే ప్రయోగాలు చేయని నాయకుడు ఉన్నాడా అనేది చూడాలి. అంతేకాదు మీడియా రిపోర్టర్లకు కూడా ఇది పాకింది. అసలు వాక్యంలో మరొక భాగం లేకుండానే 'ఆయొక్క ఆc ఆc...' అని అని తర్వాత అర్థోక్తిలో వాక్యాన్ని ముగించడం చేస్తున్నవారు కూడా ఉన్నారు. 'ఆయొక్క సందర్భంలో' ఇలా కొన్ని వందల ఉదాహరణలని చూపవచ్చు. ఈ పదాన్ని ఒక మోతాదులో వినియోగించేవారు ఉన్నారు. అంతేకాదు. ప్రతి వాక్యానికి ఒక పడికట్టులాగా లేదా రాజకీయ నాయకులు ఇలా మాట్లాడాలి అనే స్థిరమైన భావంతో దీన్ని

చాలా విరివిగా వినియోగించిన నాయకులు అప్పుడూ ఇప్పుడూ చాలామంది ఉన్నారు. నిజానికి 'యొక్క' అనే షష్ఠీ విభక్తి ప్రత్యయం ఉపన్యాస భాషలోనే కాదు. అంటే మౌఖికంగానే సంప్రదాయంలోనే కాక లేఖన విధానంలో కూడా వ్యర్థపదం. దీని అవసరం లేకుండా దాని అర్థం వచ్చిన తర్వాత కూడా అధికంగా ప్రయోగంలో మిగిలిపోతున్న మాట. ఈ పదాన్నితీసి వేసి వాక్యాన్ని పలికినా కూడా అర్థంలో ఏమాత్రం మార్పు రాదు. ఛందో నిర్మాణాలలో కూడా ఇది వ్యర్థ పదంగా మిగిలింది. ఒక ప్రత్యయానికి బదులు మరొక ప్రత్యయాన్ని ఎలా వాడవచ్చో కూడా వ్యాకరణాలు చాలా వివరంగా ప్రస్తావించాయి. నాయకులు తమ భాషలో మార్పు తెచ్చుకొని పటిష్ఠంగా ప్రామాణికంగా చేయదలచుకుంటే ఈ 'యొక్క' ని వదిలివేయవచ్చు. దీనివల్ల వారికి ఏ ఇబ్బందీ లేదు.

**అవసరం లేని 'గత' :**

నాయకుల భాషలో నేటికాలంలో బాగా వినియోగంలో ఉన్న మాట 'గత' అనేది. ***గతము*** అనే పదంలో ప్రత్యయం పోగా మిగిలిపోయిన సంస్కృత పదం ఇది. చాలా సందర్భాలలో ఇది ఇతర పదాలతో కలిసి సమాసంగా వినియోగంలో ఉంటుంది. గత సంవత్సరం, గతకాలం అనే సమాసాలలో సరిగ్గా ఇది వినియుక్తం అయింది. ఇది ఎక్కువగా లిఖిత భాషలో వినియోగించే పదం. ఇది వ్యక్తుల్లో ఇండ్లలో సాధారణంగా వినియోగంలో ఉండదు. కొంతమంది దానిపైనశ్రద్ధతో చెబితే తప్ప దీనికి ఉనికి లేదు. 'గత సంవత్సరం' అనే మాటకన్నా 'పోయిన ఏడాది' అనే తెలుగు అభివ్యక్తినే తెలుగు వారు బాగా వినియోగిస్తారు. నేను నా జానపద పరిశోధనలలో భాగంగా గడచిన ఇరవై పాతిక సంవత్సరాలుగా వేరు వేరు జిల్లాలో వందల గ్రామాలలో పర్యటించాను. నేటికీ 'సంవత్సరం' అనే పదం కన్నా 'ఏడాది' అనే తెలుగు పదమే ఇంకా ఎక్కువగా ప్రజల వినియోగంలో ఉంది. 'పోయిన ఏడాది', 'ఏడాది కింద', 'చాలా ఏళ్ళక్రితం' అనే విధమైన అభివ్యక్తులు ఎక్కువగా ఉన్నాయి. నాయకుల వినియోగంలో కూడ ఈ పదం చాలా విస్తృతంగానే వినియోగంలో ఉంది. సమస్య దీనితో కాదు. కాని దీన్ని తెలుగు పదాలతో కలిపి సమాసంగా చేసి వినియోగిస్తున్నారు. సంస్కృత పదాలతో తెలుగు పదాలు కలిపి సమాజం చేయడం గురించి వ్యాకరణంలో చాలా చర్చ జరిగింది. వైరి సమాజాలు దుష్ట సమాసాల గురించి చాలా చర్చ ఉంది. తిరిగి అది ఇక్కడ అవసరం లేదు. కాని నాయకుల భాషలో మీడియా ప్రతినిధుల భాషలో ఎంత విరివిగా ఉందో చూడండి. 'గత సంవత్సరం', 'గత నెల్లో ఇది జరిగింది'. 'గత కొన్నిరోజులుగా' 'గత కొన్ని నెలలుగా జరుగుతున్న ఈ అన్యాయాన్ని దీన్ని ఖండిస్తున్నాము'. 'గత మూడు రోజులుగా' 'గత రెండు రోజులుగా', 'గత కొంతకాలంగా' ఇలా చాలా ప్రయోగాలు నాయకుల భాషలో బాగా వినపడుతున్నాయి. ఒకరిని చూసి ఒకరు కొత్తగా ఈ రంగంలోనికి వచ్చేవారు కూడా రాజకీయంలో ఉంటే ఇలాగే మాట్లాడాలి కావచ్చు అని ఇలాంటి ప్రయోగాలు చేస్తున్నారు. మీడియా ప్రతినిధులు వార్తలను దూరంనుండి అందించేవారు చాలా విరివిగా ఈ ప్రయోగాలను చేస్తున్నారు. కాని ఈ ప్రయోగాలు గ్రామాలలో సాధారణ ప్రజలు చేయడంలేదు. తెలుగు వారి వినియోగంలో సాధారణ వ్యవహారంలో ఇవి లేవు. వీటిలో ఉన్న సమస్య ఏమంటే గత అనే సంస్కృత పదంతో తెలుగు పదాలను కలిపి చేసిన దుష్టసమాసాలుగా వీటిని సాంప్రదాయికంగా పరిగణిస్తారు. సంస్కృత పదాలు తెలుగు పదాలు కలిపి వైరిసమాసాలు చేయకూడదని నియమం ఇక్కడ చెప్పడంకాదు కాని వైరిసమాసాలు అంటే అన్యభాషా పదాలు కలిపి సమాసాలు చేయడం కూడా చాలా విరివిగా ప్రజల వ్యవహారంలో జరుగుతూ ఉంది. ఇది ఒక సహజమైన పద్ధతిలో జరుగుతూ ఉంది. చాలా వైరి సమాసాలు వినడానికి చాలా సొంపుగా ఉంటాయి. బోరుబావి అనే మాట చూడండి. ఇంగ్లీషు తెలుగు మాటలతో కూడిన సమాసమైనా వినడానికి బాగా ఉంది. బోర్‌వెల్ అనేమాట చదువుకున్న వారిలో వినియోగంలో ఉన్నాకూడా సాధారణ వ్యవహారంలో బోరుబావి అనే మాట బాగా వినియోగంలో ఉంది. కాని పైన చెప్పిన ప్రయోగాలన్నీ వినసొంపుగా ఉండేవికావు. ఇక్కడ నాయకులు తమ భాష పట్ల కొంత శ్రద్ధ చూపితే వీటిని మరింత బాగా చెప్పవచ్చు. 'గత మూడు రోజులుగా', 'గత కొంతకాలంగా' 'గత రెండు నెలలుగా జరుగుతూ ఉంది'. ఈ ప్రయోగాలు అన్నింటిని చూడండి. వీటిలో 'గత' అనే మాటను తీసివేసినా ఇవి చాలా అర్థవంతంగానే ఉంటాయి. 'గత కొంతకాలంగా' అని అనకుండా 'కొంతకాలంగా' అన్నా అదే అర్థం వస్తుంది. గత రెండు నెలలుగా, గత మూడు రోజులుగా, గత రెండు నెలలుగా ఈ అన్ని ప్రయోగాలలో గత అన్న మాటను తీసివేసినా ఆ వాక్యాలు అదే అర్థాన్ని ఇస్తాయి. ఇలా కాకుండా ఇక్కడ అన్ని వాక్యాలలో గత అనే పదానికి బదులు పోయిన అనే తెలుగు పదాన్ని వినియోగించి మాట్లాడవచ్చు. సాధారణంగా ప్రజల వ్యవహారంలో పోయిన ఏడాది, పోయిన నెలలో అని చెప్పవచ్చు. అలాగే గడచిన అనే మాటని కూడా వీటికి బదులుగా వాడవచ్చు. గడచిన రెండురోజుల్లో, గడచిన రెండు నెలలుగా, – గడచిన ఏడాది ఇలాంటి ప్రయోగాలు చేయవచ్చు. ఇలాంటి అన్ని సందర్భాలలో **గత అనే సంస్కృత పదం బదులు గడచిన అనే ప్రయోగం చాలా బాగుంటుంది**. తమ భాష పట్ల శ్రద్ధ చూపదలుచుకున్న నాయకులు దీన్ని గమనించవచ్చు.

**ఎందుకీ జరుగుడు:**

నాయకుల భాషలో, మీడియా ప్రతినిధుల భాషలో కూడా చాలా విపరీతంగా అదొక ఫాషన్‌లాగా మారి వాడుతున్న పదం **'జరగడం'**.ఈ 'జరుగు' అనే మాట వాడుకలోనికి ఎలా వచ్చిందో ఎందుకు వ్యాపించిందో వివరంగా విచారించాలి. ఒక నాయకుడు టి.వి. ఛానల్‌కోసం విజృంభించి మాట్లాడుతున్నాడు. గమనించండి. 'నేను మార్నింగ్ ఫ్లైట్‌కి రావడం జరిగింది. నాకు నిరసన చెప్పడానికి అక్కడికి వచ్చిన (ఫలానా పార్టీ) కార్యకర్తలు ఇంగిత జ్ఞానాన్ని మర్చిపోవడం జరిగింది. నాపైన కోడిగుడ్లు విసరడం జరిగింది. దాన్ని నేను అక్కడికక్కడే ఖండించడం జరిగింది. ఇది శవ రాజకీయం అనికూడా చెప్పడం జరిగింది. అక్కడి రైతు ఆత్మహత్య చేసుకోవడానికి నాకు గాని మా పార్టీకి కాని ఏం సంబంధం లేదని కూడా నేను గట్టిగా చెప్పడం జరిగింది. అక్కడి రైతు ఆత్మహత్య కుటుంబ కలహాల కారణంగా జరిగిందని అక్కడివాళ్లే చెప్పడం జరిగింది. ఈ విషయాన్ని నేను మానాయకుడికి తెలియజేయడం జరిగింది. ఆయన కూడా ఈ విషయాన్ని చాలా సీరియస్‌గా తీసుకోవడం కూడా జరిగింది...." ఇలా సాగిపోతూ ఉంది ఈ విధమైన ప్రసంగం. మామూలుగా నాయకులు మీడియా ముందు మాట్లాడే సందర్భంలో మైకు దగ్గరకు రాగానే అప్పటిదాకా మామూలుగా ఉండే వారి భాష, చాలా లాంఛనరూపం అవుతుంది. బిగుసుకుపోయి పడికట్టు విధానానికి మారుతుంది. కాని ఇటీవల నాయకులు మామూలుగా ఇంటి దగ్గర మాట్లాడేటప్పుడు, స్నేహితులతో మాట్లాడేటప్పుడు కూడా ఇదేవిధంగా మాట్లాడటాన్ని గమనించవచ్చు.

ఇంకొక నాయకురాలు మాట్లాడుతూ ఉంది గమనిద్దాం. 'నేను మాట్లాడేటప్పుడు ఏమన్నా తప్పు మాట్లాడటం జరిగిందా, అతన్నేమైనా తిట్టడం జరిగిందా. ఎందుకతను నా గురించి దుర్భాషలాడడం జరిగింది అని నేను అడుగుతున్నాను. ఆడవాళ్ళ వ్యక్తిగత విషయాలు అతనికి ఎందుకు అని నేను ప్రశ్నించడం జరుగుతూ ఉంది ఇప్పుడు. నేను ఎలా మేకప్ వేసుకుంటే

ఆయనకెందుకు అని ప్రశ్నించడం జరుగుతూ ఉంది ఇప్పుడు'.

ఒక అసెంబ్లీ సమావేశంలో జరుగుతున్న వాదన ఇక్కడ చూద్దాం. 'అధ్యక్షా, గౌరవ సభ్యుడు చేసిన ఆరోపణల్ని మా నాయకుడు ఇప్పటికే ఖండించడం జరిగింది. ఒక దురదృష్టకరమైన సంఘటన జరిగితే దాన్ని రాజకీయం చేయడాన్ని నేను కూడా సభాముఖంగా ఇప్పుడు ఖండించడం జరుగుతూ ఉంది. ఇదే విషయంపైన మా పార్టీ సభ్యులందరూ నిన్న సభ నుండి వాకౌట్ చేయడం జరిగింది. అంతేకాదు సభలో సమర్పించిన కాగితాల్ని చించివేయడం జరిగింది. కాని, ఆవేశంలో మా సభ్యులు మైకులు విరిచివేయడం జరగడాన్ని మాత్రం నేను అంగీకరించడంలేదు. అధ్యక్షా... అధికార పార్టీ మమ్మల్ని అసమర్థులుగా భావించడం జరిగినందుకు నేను చింతిస్తున్నాను. జరిగిన దురదృష్టకరమైన ఘటనను రాజకీయం చేయవద్దు అని నిన్ననే మా నాయకుడు హెచ్చరించడం జరిగింది. అదే విషయాన్ని నేను ఇక్కడ తిరిగి చెప్పడం జరుగుతూ ఉంది. అధ్యక్షా, అధికారంలో ఉన్న మంత్రిగారు, వారు చేసిన ఆరోపణలను ఉపసంహరించుకోవడం జరగాలి' ఇలా కొనసాగిపోతూ ఉంది.

ఇక మీడియా ప్రతినిధి మాట్లాడుతున్నాడు. టి.వి. స్టూడియోలో ఉన్న న్యూస్ యాంకర్‌కి రిపోర్టు చేస్తున్నాడు. 'సత్యనారాయణా, మంత్రి గారి కాన్వాయ్‌లోని ఒక వెహికల్ దారిన పోయే ఒక మహిళను ఢీకొట్టడం జరిగింది. అక్కడ ఆమెకు కాలు విరగడం జరిగింది. కాన్వాయ్‌లో ఎస్కార్ట్‌లో ఉన్న రక్షక సిబ్బంది ఆమెను వాన్‌లోనికి తీసుకోవడం జరిగింది. తర్వాత మంత్రిగారి కాన్వాయ్ ప్రయాణం సాగించింది. ఇప్పుడే సభావేదిక వద్దకు రావడం జరిగింది'. సత్యనారాయణా... ఇలా స్టూడియోలో ఉన్న యాంకర్ పేరు పలకడంతో రిపోర్టు భాగం ముగుస్తుంది. తర్వాత యాంకర్ మాట్లాడతాడు. 'సభావేదిక వద్ద వాతావరణం ఎలా ఉంది? మంత్రిగారిని నిర్వాహకులు ఎలా రిసీవ్ చేసుకున్నారు'. తిరిగి రిపోర్టర్ మొదలుపెడతాడు. 'సత్యనారాయణా...సభా నిర్వాహకులు మంత్రిగారిని చాలా మేళతాళాలలో పూర్ణకుంభంతో రిసీవ్ చేసుకోవడం జరిగింది...' ఇక ఇలా రిపోర్టు చేయడం కొనసాగింది. ఈ క్రమంలో కనీసం మరొక పదిహేను ఇరవై సార్లు 'జరిగింది' అనే పదం వచ్చింది.

తెలుగుకు పట్టిన ఇదేం ఖర్మమో చెప్పలేము. పైన చెప్పిన రాజకీయ నాయకుల వాక్యాలు ఇక్కడి మీడియా ప్రతినిధి వాక్యాలు గమనిస్తే ఈ భాష ఎంత కృత్రిమంగా ఉందో చెప్పవచ్చు. ఒక్కొక్క వాక్యాన్ని గమనిస్తే... తెలిసిపోతుంది. 'ఫ్లైట్‌కి రావడం జరిగింది' అనడానికి బదులు 'ఫ్లైట్‌కి వచ్చాను' అనవచ్చు. 'చెప్పడం జరిగింది' అని చాలా సార్లు వచ్చింది. దీనికి బదులు 'చెప్పాను' అని అనడం తెలుగుకు సహజమైన వాక్యం. 'నాయకుడు చెప్పడం జరిగింది' అని ఎందుకు 'నాయకుడు చెప్పారు' అని మామూలుగా అనవచ్చు. ఇంకా చూడండి. 'తెలియజేయడం జరిగింది' అని కాకుండా 'తెలియజేశాను' లేదా 'వాళ్ళు తెలియజేశారు' అనాలి వేరే వారు అయితే, 'చించివేయడం జరిగింది'. 'మైకులు విరిచివేయడం జరిగింది' ఎందుకిలా. 'చించివేశారు' అని అనవచ్చు. 'విరిచారు' అని అనవచ్చు. దీన్ని 'ఖండించడం జరిగింది' అని అనక్కరలేదు. 'ఖండించాను' లేదా 'ఆయన ఖండించారు' అని చక్కగా తెలుగు వాక్యంలాగా చెప్పవచ్చు. 'వాకౌట్ చేయడం జరిగింది'. 'డిమాండ్ చేయడం జరిగింది' అని అనవక్కరలేదు. వాకౌట్ చేశాము'. 'డిమాండ్ చేశాము' అని చక్కగా క్లుప్తంగా చెప్పవచ్చు. ఇది తెలుగు సహజమైన వాక్యం అవుతుంది.

ఇంకా చూద్దాం... 'తప్పు మాట్లాడడం జరిగిందా' అని అనడం కన్నా 'తప్పు మాట్లాడానా' అని అనవచ్చు కదా. 'ఉపసంహరించుకోవడం జరగాలి'. ఇలా ఎందుకు 'ఉపసంహరించుకోవాలి' అని అంటే సరిపోతుంది కదా!

'వాన్ మహిళను ఢీకొట్టడం జరిగింది' అనడానికి బదులు 'ఢీ కొట్టింది' అని అంటే సరిపోతుంది కదా! 'కాలువిరగడం జరగడం' ఏమిటి 'కాలు విరిగింది' అంటే సరిపోతుంది కదా. సహజమైన తెలుగు వాక్యం అవుతుంది కదా. ఇలా విపరీతంగా చెప్పిన 'జరిగింది' అనే పద ప్రయోగం ఇలా రాజకీయ నాయకులకు మీడియా ప్రతినిధులకు ఎలా అలవాటు పడిందో కాని, తెలుగు భాషని చాలా కృతకం చేస్తున్నారు. నాయకులు తమకు తెలుగు భాషమీద ప్రేమ ఉంది అని చెప్పదలుచుకుంటే ఈ 'జరిగింది' అనే పదంతో వచ్చే వాక్యాలను వదిలివేయాలి. తెలుగుకు చక్కగా ఉండే వాక్యాలను భాషకు సహజమైన వాక్యాలను ఎంపిక చేసుకుంటే వారి భాష చాలా చక్కగా ఉంటుంది. వారిపట్ల వారి భాషపట్ల ప్రజల్లో మంచి భావన ఏర్పడుతుంది.

అయితే జరిగింది అని చెప్పే వాక్యాలు అన్నీ అసహజమైనవికావు. ఈ పదంతో వచ్చే వాక్యాలు చాలా సహజమైనవి కూడా ఉంటాయి. సుదూర భూతకాలాన్ని చెప్పే సందర్భంలో ఈ 'జరిగింది' అనే పదాన్ని సహజమైన ధోరణిలో వినియోగించవచ్చు. 'ఆరోజుల్లో అలా జరిగింది' 'స్వాతంత్ర్యోద్యమ కాలంలో పార్టీల నిర్వహణ ఇలా జరిగేదికాదు'. 'ఆయనే ఉండి ఉంటే ఇంత దారుణం జరిగేది కాదు'. ఇక్కడ సుదూర భూతకాలిక క్రియాక్రమాన్ని చెప్పడానికి ఈ వాక్యాలు బాగుంటాయి. ఒక వస్తువుకాని విశేషంకాని ఒకచోటినుండి మరొక చోటికి కదలించడం గాని కదలడం కాని అనే పనులను చెప్పడానికి జరుగు అనే పదం మూల అర్థాన్ని తెలిపే పదం. అంతేకాదు ఒక పని అవుతూ ఉండడాన్ని కూడా ఇది సూచిస్తుంది. పని జరుగుతూ ఉంది. పని జరిగింది. అనే తరహా వాక్యాలు సహజంగా ఉంటాయి.

**'పరిస్థితి' అనే దుస్థితి :**

ఇక రాజకీయ నాయకుల భాషలోను విశేషించి మీడియా ప్రతినిధుల భాషలోను చాలా విరివిగా వాడుతున్న పదం 'పరిస్థితి'. ఈ పదం వినియోగం పరిస్థితి దారుణంగా ఉంది. ఒక మీడియా ప్రతినిధి మాట్లాడే పద్ధతి చూడండి. స్టూడియోలోనుండి యాంకర్ అడుగుతుంది. అక్కడ సంఘటన ఎలా జరిగింది ప్రస్తుతం పరిస్థితి ఎలా ఉంది అని అడిగింది. ఇక ప్రతినిధి మాట్లాడుతున్నాడు. సుమా (సుమా, లేదా ఏదైనా పేరు న్యూస్ యాంకర్ ని ఉద్దేశించి అంటాడు) 'ఇక్కడ ప్రజలు బాగా ఆందోళన చెందుతున్న పరిస్థితి ఉంది. ఘటన జరిగి ఇంతసేపైనా పోలీసులు కాని అగ్నిమాపక సిబ్బంది కాని వచ్చిన పరిస్థితి లేదు. నలుగురైదుగురు వ్యక్తులు ఇక్కడి మాన్‌హోల్ దగ్గర నాలా కూలిన పరిస్థితిలో కనిపించకుండా పోయిన పరిస్థితి ఉంది. అన్ని వైపులనుండి వచ్చే జనం అదుపులేని పరిస్థితి' ఇలా సాగుతూ ఉంది. అతని రిపోర్టింగ్ వాక్యానికి ఒకసారి కాని రెండు సార్లు కాని పరిస్థితి అని మాట వాడటం అతనికి బాగా ఊతపదం లాగా మారిన వైనం మనకు కనిపిస్తుంది. 'అనంతపురం నుండి వచ్చి పుష్కర పుణ్యస్నానం చేసిన ఈ భక్తులు అనంతపురం జిల్లాలో కూడా ఇలా నీరు కలిగించమని గోదారి మాతను కోరుకున్న పరిస్థితి... కెమేరామెన్...తో సాయి – రాజమండ్రి' (తేదీ:25-7-2015). ప్రతి చానల్లో ఉన్న రిపోర్టర్లు ఇలా పరిస్థితి అనే మాటని అనవసరంగా వినియోగించే తీరు 90 శాతం వరకు ఉంది.

పైన వాక్యాలు ఒకసారి గమనిస్తే... ఆందోళన చెందుతున్న పరిస్థితి ఉంది. అని అనడం కాదు. ఆందోళన చెందుతున్నారు అని సహజమైన వాక్యాన్ని చెప్పవచ్చు కదా. అది రాకనా లేక ఇలా పరిస్థితి అనే పదాన్ని వాడకపోతే అక్కడి పరిస్థితి వివరించడం సాధ్యం కాదు అని అనుకుంటున్నాడా, తెలియదు, 'అగ్ని మాపక సిబ్బంది వచ్చిన పరిస్థితి లేదు' అని కాకుండా సూటిగా అగ్నిమాపక సిబ్బంది ఇంకా రాలేదు అని చెప్పవచ్చు. కోరుకున్న పరిస్థితి ఏమిటి కోరుకున్నారు అని అంటే సహజమైన వాక్యం కదా. ఆ

> ‘నాజూకుగా సరసంగా సభ్యంగా ఎదుటివారి మనస్సు ఆకర్షించేటట్లుగా మాటలాడడమూ ఉపన్యసించడమూ నేర్వవలెను. ప్రజా ప్రభుత్వం బాగా ఉండవలెనంటే వక్తృత్వము బాగా వృద్ధి పొందవలెను.’
> **– గిడుగు**

డొంక తిరుగుడు వాక్యాలు ఎందుకు. పైన ప్రతి వాక్యంలో పరిస్థితి అవే వ్యర్థంగా అతిగా వాడినట్లు మనకు స్పష్టంగా తెలుస్తుంది.

ఇక నాయకులు దీనికి ఏమాత్రం తీసిపోలేదు. టి.వి కెమేరా ముందు నాయకులు మాట్లాడినా శాసనసభలో మాట్లాడినా నాయకుల భాషలో ఈ ‘పరిస్థితి’ అనే మాట చాలా విరివిగా వినియోగంలో ఉంది. అయితే సరైన వినియోగంలో కూడా ఉంది. కాని అనవసరమైన వినియోగంలోనే ఎక్కువగా ఉంది. నాయకుడు మాట్లాడుతున్నాడు చూడండి ‘ప్రజలు ఈ రోజున వారిని తిరస్కరిస్తున్న పరిస్థితి’, (ఉంది అని కూడా చాలా సందర్భాలలో అనరు), ‘ప్రతిపక్షం వారు ఎన్ని మొసలి కన్నీళ్లు కార్చినా ప్రజలు నమ్మని పరిస్థితి ఉంది’. ‘ప్రతిదానికీ వారు మాపైన ఆరోపణలు చేసే పరిస్థితి ఉంది’. ముఖ్యమంత్రిగారు కూడా ఇలా పరిస్థితి అనే పదాన్ని చాలాసార్లు వినియోగించడం టి.విలో చూస్తున్నాము. ‘పుష్కరాలకు లక్షలాదిమంది రాబోయే పరిస్థితి ఉంది’ . ఇందులో ‘ఇదే మాదిరి చాలా బాగా పని చేసి ముందుకు పోవాల్సిన పరిస్థితి’.

సాక్షాత్తూ ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడుగారి వాక్యం చూద్దాం. ‘....తర్వాత తిక్కన ఎర్రాప్రగడ పోతన వంటి మహాకవులు అనువాదం చేసే పరిస్థితి వచ్చింది...’ (తేదీ:25-7-15). ఇది పుష్కరాల సందర్భంగా రాజమండ్రిలో ఆయన చేసిన ఉపన్యాసంలో చెప్పిన వాక్యాలలో ఒకటి. ఇక్కడ రాజరాజ నరేంద్రుడి గురించి నన్నయ గురించి ఇంకా సాహిత్యం గురించి మాట్లాడారు ఆ సభలో. అక్కడ ఇంకా ఈ **పరిస్థితి** పదం పలు సార్లు వచ్చింది. ఇది తప్పు పట్టడం కాదు. ఆయన దీన్ని తన శైలిగా చేసుకున్నారు.

శాసనసభ కార్యక్రమాలు చూసినా కూడా గౌరవ సభ్యులు చాలా మంది మాట్లాడే సందర్భాన్ని గమనిస్తే ఈ పరిస్థితి అనే పదం ఎంత విస్తృతంగా ఉంటుందో గమనించవచ్చు. నూటికి తొంబైసార్లు ఈ పరిస్థితి అనే పదాన్ని వదిలివేయవచ్చు. గౌరవ సభ్యులు కాస్త తమ భాష పట్ల శ్రద్ధ చూపిస్తే ‘ఈ పరిస్థితి’ అనే పదాన్ని వదిలివేసి సహజమైన వాక్యాలు వాడవచ్చు. పైన గమనిస్తే ‘నమ్మని పరిస్థితి ఉంది’ అని చెప్పడం కాదు ‘ప్రజలు నమ్మడం లేదు’ అని అంటే సరైన సహజమైన వాక్యం గదా. ‘ఆరోపణలు చేసే పరిస్థితి ఉంది’. ‘ఎందుకు ఆరోపణలు చేస్తున్నారు?’ అంటే తెలుగుకు సహజమైన వాక్యం కదా. ఇలా ప్రతి వాక్యాన్ని గమనిస్తే ఈ పరిస్థితి అనే పదం ఎంత వ్యర్థంగా వినియోగిస్తున్నారో గమనించవచ్చు.

కాని, ఈ పరిస్థితి అనే పదం జాగ్రత్తగా వినియోగిస్తే చాలా సహజమైన సందర్భాలలో చాలా బాగా వాడుకోవచ్చు. ప్రజలు రాలేని పరిస్థితి ఉంది. అంటే ఇక్కడ ఈ పదం చాలా అవసరం. ‘ప్రజలు రాలేకపోతున్నారు’ అనే వాక్యంలో అర్థం ప్రజలు రావాలనుకుంటున్నారు కాని వారికి ఏవో ఇబ్బందులు ఉన్నాయనే ప్రధానమైన భావం చప్పున స్ఫుటమౌతుంది. కాని ‘ప్రజలు రాలేని పరిస్థితి ఉంది’ అనే వాక్యం చెబితే ప్రజలు రావాలని అనుకుంటున్నారు. కాని అక్కడి వాతావరణం కారణంగా –లేదా– అక్కడినుండి రవాణా సౌకర్యాలు అస్తవ్యస్తంకావడం వల్ల కాని రాలేకపోతున్నారు అనే అర్థాన్ని ఇక్కడ ‘పరిస్థితి ఉంది’ అనే వాక్యం చెబుతుంది. ఇక్కడ ఈ పదం చాలా సమర్థంగా ఉండి భావాన్ని శక్తిమంతంగా చెబుతుంది. ఇలాంటి సహజమైన సందర్భాలలో ఈ **పరిస్థితి** అనే పదమే శక్తివంతమైనది. నాయకులు ఇది గమనించి ఈ పదాన్ని వినియోగిస్తే వారి భాష చాలా బాగుంటుంది.

**నాయకులు ఊతపదాలు:**

చాలామంది నాయకులకు ఊతపదాలు – అంటే వారు మాత్రమే అలవాటుగా వాడే పదాలు కొన్ని ఉన్నాయి. వీటివల్ల పెద్ద ఇబ్బందిలేదు. ఇది వారి శైలిని కూడా చెబుతుంది. ఒకాయన మాటి మాటికీ ఉద్దేశపూర్వకంగా అనే మాటని వాడుతుంటాడు. ప్రతి రెండు మూడు వాక్యాలలోను ఇది వస్తుంది. ఆయన ‘ఏ ఉద్దేశపూర్వకంగా ఇలా అన్నాడో తెలియదు’. ‘ఆ ఉద్దేశపూర్వకంగా నేను చెబుతున్నాను’. ఇలా సాగుతుంది ఈ ఊతపదం. మన మాన్య ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు గారికి ఒక ఊతపదం ఉంది. ‘తెలియజేసుకుంటున్నాను’. అనే మాట చాలా విరివిగా వస్తుంటుంది. ఒక అంశం ముగిసే సమయానికి ‘తెలియజేసుకుంటున్నాను’ అనే పదం వస్తుంది. ఇది వచ్చింది అంటే ఆయన ప్రసంగంలో ఒక పేరా అయిపోయినట్లు లెక్క. అభివృద్ధి చెందాలి అనే అర్థంలో ‘ముందుకు పోవాలి’ అనే రెండు చక్కటి మాటల్ని ఆయన వినియోగిస్తారు. ఇది వచ్చినప్పుడు కూడా ఒక పేరా అయిపోయినట్లు లెక్క. మాన్య నారా చంద్రబాబు నాయుడుగారు, అలాగే మన తెలుగు ప్రధాని పి.వి. నరసింహరావుగారూ చాలా మంచి ప్రతిభావంతమైన నాయకులుగా ప్రజలముందున్నారు. కాని వారిద్దరూ గొప్ప వక్తలు కారు. కాని చంద్రబాబుగారు గడచిన నాలుగైదేళ్లలో వక్తృత్వాన్ని బాగా పదును పెట్టుకున్నారు. తనదైన శైలి తనదైన పదాలు ఉంటాయి. మాటల్లో పదును వేగం కూడా పెరిగాయి. కాని ఆయన ఉపన్యాసాలలో కూడా పైన చెప్పిన ***జరుగుడు, పరిస్థితులను*** విరివిగా చూడవచ్చు. మన తెలుగు నాయకుల్లో వెంకయ్య నాయుడుగారు చాలా మంచి వాగ్ధాటికి పదునైన హాస్యానికి మంచి ప్రసంగానికి పెట్టింది పేరు. ఆయనకొక మేనరిజం ఉంది. ఆయన చేతులు ఊపడానికి తన భాషకి సంబంధం ఉంది. వాక్యాంత ప్రాస వినియోగం చాలా ఉంటుంది. రెండు చేతులు తెరచి కుడి చేయి కుడివైపుకి ఎడమ చేయి ఎడమవైపుకి విసురుతూ వాక్యాన్ని విసురుతారు. ఆయన చెయ్యి విసిరాడు అంటే అక్కడ వాక్యం ముగిసి ఫుల్‌స్టాప్ వచ్చింది అని అర్థం. ఆయన ఉపన్యాసాలలో ‘యొక్క’ ‘ఆయొక్క’ మాటలను అక్కరలేకపోయినా, విరివిగా, ఊతపదంగా వాడడాన్ని మనం గమనించవచ్చు.

రాజకీయ నాయకులని ఒక సామాజిక వర్గంగా భావిస్తే ఆ సామాజిక బృందానికి దానికై దానికి కొన్ని లక్షణాలు ఒక తరహా భాష ఉంటుంది. ఇది సామాజిక పరిణామం. కాని భాష విషయానికి వస్తే భాష అనేది వారి రంగం కాదు కాబట్టి ఇలా పైన చెప్పిన దుస్థితి ఏర్పడుతూ ఉంది. కాని మంచి ప్రతిభావంతమైన శక్తిమంతమైన భాష మాట్లాడితే, వారి వక్తృత్వ కళని అభివృద్ధి చేసుకుంటే అది వారి వృత్తిని పెంచుతుంది. వారి అవకాశాలను బాగా మెరుగు పరుస్తుంది.

గతంలో మహానాయకులు మహా వక్తలుగా ఉన్న సందర్భాలను గుర్తుకు తెచ్చుకుంటే. నెహ్రూగారి ప్రసంగం వస్తుందంటే జాతి మొత్తం రేడియో దగ్గర ఎదురు చూసేదట. పుచ్చలపల్లి సుందరయ్యగారి ఉపన్యాసం ఉంది అంటే ప్రజలు బండ్లు కట్టుకొని దగ్గరి ఊళ్లకు వెళ్ళి ఆయన ఉపన్యాసాలు వినేవారు. అలాంటి వారిని నేటి నాయకులు స్ఫూర్తిగా భావించాలి. నాయకులు మాట్లాడేభాష, వారి సంస్కారాన్ని విద్వత్తుని తెలుపుతుంది. వారి భాష వారికి శక్తినిస్తుంది అని గమనిస్తే... నాయకులూ, మీ భాషను మార్చండి. అది మీకు సహాయం చేస్తుంది. మిమ్మల్ని పెంచుతుంది.

**రచయిత ఫోన్ : 9440493604**

- శ్రీ సంకేపల్లి నాగేంద్రశర్మ

# ప్రభుత్వ వైఫల్యాలు-ప్రజల ఇబ్బందులు



**144** సంవత్సరాలకు వచ్చే గోదావరి కుంభమేళాకు రెండు తెలుగు ప్రభుత్వాలు పెద్ద ఎత్తున భారీ ఏర్పాట్లు చేసినప్పటికీ, రాజమండ్రి ప్రధాన పుష్కరఘాట్ రేవువద్ద జరిగిన తొక్కిసలాటలో మొదటి రోజే 27 మంది అనూహ్యంగా మృత్యువాత పడగా పలువురు గాయాలపాలయ్యారు. విభ్రాంతికి గురైన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు పుష్కరాలు జరిగే వరకు రాజమండ్రిలోనే నివాసముండి పుష్కర ఏర్పాట్లు పర్యవేక్షిస్తున్నారు. జూలై 18 శనివారం రంజాన్ సెలవుదినం కావడంతో భారీగా జనం తండోపతండాలుగా తరలిరావడంతో రెండు రాష్ట్రాలలో విపరీతంగా రద్దీపెరిగి లక్షలాది మంది భక్తుల వాహనాలన్నీ రోడ్లపైనే ఇరుక్కుపోయి, పదినుండి 24 గంటల వరకు నానాయాతనలు అనుభవించారు. వృద్ధులు, పిల్లలు, మహిళలు, మధుమేహవ్యాధిగ్రస్తుల బాధలు వర్ణనాతీతమైపోయాయి. ఆహారం, వైద్య సదుహాయం, మందులు, నీళ్ళు దొరకక భక్తులు ఇబ్బందులకు గురయ్యారు. జనప్రవాహం, ట్రాఫిక్ నియంత్రణపట్ల అవగాహన లేనందున, మొత్తం వ్యవస్థ అంతా ఒకేసారి కుప్పకూలడంతో ఆలస్యంగానైనా కళ్ళు తెరిచిన రెండు రాష్ట్రాల ప్రభుత్వాల అధికారులు, పోలీసులు అప్రమత్తమై తగు చర్యలకై ఉపక్రమించారు.

గోదావరి పుష్కరాలు జూలై 14నుండి ప్రారంభమై, 25వ తేదీన ముగియనున్నాయి. మహారాష్ట్రతోపాటు, పాండిచ్చేరితో కలిపి రెండు తెలుగు రాష్ట్రాలకి ఈ పుష్కరాలు పరిమితమయ్యాయి. అంటే నాలుగు రాష్ట్రాలలో ఈ నది ప్రవహిస్తుంది. కేంద్రపాలిత ప్రాంతమైన యానాం (పాండిచ్చేరి), మడ అడవులు, ఓడలరేవు ప్రాంతాలలో బంగాళాఖాతంలో కలిసేటప్పుడు గోదావరి ప్రవాహాలు కనిపిస్తాయి. తెలంగాణాలోఐదు జిల్లాలలో గోదావరి పారుతుండగా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఉభయగోదావరి జిల్లాలలో పారుతున్నాయి.

గోదావరి పుష్కరాలకై గత ఫిబ్రవరి నుండి రెండు తెలుగు రాష్ట్రాల ప్రభుత్వాలు ప్రణాళికాబద్ధంగా చర్యలు తీసుకున్నప్పటికినీ, కొన్ని ఇబ్బందుల్ని పనులు, నిధుల విడుదల జాప్యాలను అధిగమించకపోవడం విమర్శలకు తావిచ్చినట్లయింది. ఈ 12 రోజుల పుష్కరాలలో ఇరు రాష్ట్రాలలో కలిపి సుమారు 10 కోట్ల మందికి పైగా భక్తజనం పుణ్యస్నానాలు చేస్తారని అంచనా. ఒక పక్క తీవ్ర వర్షాభావం, భిన్నంగా వాతావరణంలో వేడి పెరగడం వల్ల గోదావరి పుష్కరాల నిర్వహణ అనేక విషమ పరీక్షలకు గురయింది. తెలంగాణాలోని ఘాట్లలో నీటి కొరత ఏర్పడగా, పలుచోట్ల పైపులపై జల్లు స్నానాలు ఏర్పాటు చేశారు. పలు ఘాట్లలో నీటి ప్రవాహాలు తగ్గిపోవడం వల్ల బురదమేటలు వేసి భక్తుల స్నానాలకు ఇబ్బందులకు గురయ్యారని సమాచారం. ఇరు రాష్ట్రాలలో పారిశుధ్య కార్మికుల సమ్మెప్రభావం పుష్కరాలపై సూటిగా కనిపించకపోయినా, పారిశుద్ధ్యలోపం, జలాలు కలుషితమై బ్యాక్టీరియా మాయమైపోతున్నాయని, పర్యావరణ శాపంపై పలు వార్తలు వచ్చాయి. గజ ఈతగాళ్ళ ఏర్పాటు, సిసి కెమెరాలతో గట్టి నిఘా వ్యవస్థ, నది పవిత్రత, పిండ ప్రదానాలు వంటి విషయాలలో తగు చర్యలు తీసుకున్నా ప్లాస్టిక్ బ్యాగుల నిషేధం, కొబ్బరికాయలు, ఆహారపదార్థాలు, పుష్కరసామాన్లపై ధరల నియంత్రణ లేదు. తెలంగాణ, ఆంధ్రాలోని పలు పుష్కర కేంద్రాలలో వివిధ స్వచ్ఛంద సంస్థలు ఏర్పాటు చేసిన అన్నదాన శిబిరాల వల్ల ఇరు రాష్ట్రాల ప్రభుత్వ యంత్రాంగాలు ఊపిరి పీల్చుకున్నట్లయింది.

తెలంగాణా ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటైన తర్వాత తెలంగాణా ప్రభుత్వానికి ఈ పుష్కరాల నిర్వహణ తొలిసారి కావడం, ఏర్పాట్లవిషయమై ముఖ్యమంత్రి కెసిఆర్ పలు సమీక్షా సమావేశాలు నిర్వహించి, కింది స్థాయి యంత్రాంగాన్ని సన్నద్ధం చేశారు. వివిధ శాఖల మంత్రులను సైతం పురమాయించడంతో పుష్కర ఏర్పాట్లు సజావుగా జరిగాయనే చెప్పుకోవాలి.

తెలంగాణా ప్రభుత్వం తొలుత ఐదువందల కోట్లు ఖర్చుచేస్తున్నట్లు ప్రకటించి, మరో రెండు వందలకోట్ల రూపాయలను ఖర్చు చేసినట్లు మంత్రులు ప్రకటించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 8 వందల కోట్లరూపాయలను ఖర్చు చేస్తున్నట్లు ప్రకటించింది. తెలంగాణలో ఈ పుష్కరాలకు 106 ఘాట్లు ఏర్పాటు చేయగా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 262 (ఘాట్లను) రేవులను ఏర్పాటు చేశారు. మహారాష్ట్ర ప్రభుత్వం ఆఖరు వరకు నీరు ఇవ్వడానికి సమ్మతిస్తుందన్న ఆశాభావంతో ఉన్న తెలంగాణ ప్రభుత్వానికి నిరాశే ఎదురైంది. రాష్ట్ర ప్రభుత్వ చర్యలు అంత ఫలవంతం కాకపోవడంతో శ్రీరాంసాగర్, కడెం, శ్రీపాదసాగర్ ప్రాజెక్టులనుండి నీటిని జూలై 13న విడుదల చేయాలని, రేవులలో జలాలను పారించాలని నిర్ణయించుకుంది. జూలై 16 తర్వాత అడపా దడపా చెదురు ముదురు వర్షాలు ప్రారంభం కావడంతో భక్తుల




పుణ్యస్నానాలకు ఇబ్బందులు అంతగా తలఎత్తలేదు. మహారాష్ట్రనుండి పారే గోదావరి జలాలు తెలంగాణాలోని కందకుర్తివద్ద తెలుగునేలకు చేరడంతో, కందకుర్తి (త్రివేణిసంగమం) వద్ద మూడు ఘాట్లను నిజామాబాద్ జిల్లా యంత్రాంగం ఏర్పాటు చేసింది. తెలంగాణాలోని నిజామాబాద్ జిల్లాకందకుర్తి, పోచంపాడు, ఆదిలాబాద్ జిల్లాలోని బాసర, గూడెం, సోన్, ఖానాపూర్, మంచిర్యాల, చెన్నూర్, లక్సెట్టిపేట, కరీంనగర్ జిల్లాలోని ధర్మపురి, కాళేశ్వరం, మంథని, కోటిలింగాల, గోదావరిఖని, రాయపట్నం, వరంగల్‌జిల్లాలోని రామన్నగూడెం, మంగపేట మల్లకట్ట, ఖమ్మం జిల్లాలోని భద్రాచలం, పర్ణశాల, రామచంద్రాపురం తదితర చోట్ల ప్రధాన ఘాట్లు భక్తుల రద్దీతో కనిపిస్తాయని తొలుత అధికారులు అంచనా వేసినా, చిన్న చిన్న ఘాట్లలో కూడా జనం రద్దీ కనిపించింది. ఆంధ్రప్రదేశ్‌రాష్ట్రంలోని రాజమండ్రి, నర్సాపూర్, అంతర్వేది, ధవళేశ్వరం, కొవ్వూరు గోష్పాద క్షేత్రాలలో ప్రధాన ఘాట్లను ఏర్పాటు చేశారు.

ఇరు తెలుగురాష్టాలలో బృహస్పతి సింహరాశిలో ప్రవేశించే జూలై 14వ తేదీ ఉదయం 6.26 నిముషాలకు వేదమూర్తుల మంత్రోచ్చారణల మధ్య పీఠాధిపతులతో కలిసి పుష్కర స్నానాలు చేయడంతో పుష్కరాలు అధికారికంగా ప్రారంభమయ్యాయి. రాజమండ్రిలో సిఎం చంద్రబాబునాయుడు, ధర్మపురిలో తెలంగాణ సిఎం కెసిఆర్‌లు సతీసమేతంగా పుణ్యస్నానాలు ఆచరించి పుష్కరస్నానాలకు శ్రీకారం చుట్టారు.

**రాజమండ్రి తొక్కిసలాట:**

రాజమహేంద్రి తొలిరోజునే శోకమహేంద్రిగా మారిపోయింది. సిఎం చంద్రబాబు స్నానంకోసం పుష్కర గేటు వద్ద పుష్కర గేట్లు తెరవకపోవడంతోనే, గేట్లవద్దే భారీగా చేరిన జనం సిఎం స్నానాల అనంతరం గేట్లు తెరవగా, ఒకేసారి తోపులాటలు పెరిగిపోయి జరిగిన తొక్కిసలాటలో 27 మంది మృత్యుపాలుకాగా, ఇందులో 24మంది మహిళలే చనిపోయారు. ఇద్దరు పురుషులు, ఒక బాలుడు చనిపోయారు. రెండువందల మందికి పైగా గాయాల పాలయ్యారు. భక్తుల హాహాకారాలతో పుష్కర ఘాట్ మార్మోగిపోయింది. ఎక్కడ ఏం జరుగుతుందో తెలియని పరిస్థితి అయింది. ఈ సంఘటన అనంతరం వివిధ ప్రతిపక్ష పార్టీల నాయకులు చంద్రబాబు రాజీనామా చేయాలని, పుష్కర ఏర్పాట్లు గతి తప్పాయని పెద్దగా విమర్శించాయి. తొక్కిసలాటలు, అంబులెన్స్ అందుబాటు వంటి సౌకర్యాల్ని పుష్కర ఏర్పాట్లలో చేర్చక పోవడం వల్లే ఈ మహావిపత్తు సంభవించిందని పత్రికలు వివిధ కోణాలలో విమర్శిస్తూ వార్తలు రాశాయి. రాజమండ్రిలో కోటిలింగాల, గౌతమి పుష్కరఘాట్, మార్కండేయ ఘాట్, సరస్వతి ఘాట్ (విఐపి ఘాట్), ధవళేశ్వరం శ్రీరామపాదాల రేవుఘాట్, కోటిపల్లి ఘాట్‌లలో భక్తులు పుణ్యస్నానాలు చేసినా, సిఎం చంద్రబాబు విఐపి ఘాట్ వదిలి పుష్కరఘాట్‌లో స్నానాదికాలు చేయడం తొక్కిసలాట విపత్తు సంభవించిందని ఆరోపణలు వచ్చాయి.

**జలకాలుష్యం:**

వర్షాభావ పరిస్థితి, ప్రవాహాలపై పడింది. కోట్లాదిమంది గోదావరి ఘాట్లలో పుణ్యస్నానాలు చేయడానికి రావడం వల్ల గోదావరి జలాలు పలుచోట్ల కలుషితమైనట్లు సమాచారం. బాక్టీరియా ఇన్‌ఫెక్షన్ రోజురోజుకు పెరిగిపోతున్నట్లు వైద్య నివేదికల సమాచారం. ముఖ్యనగరాలలో మున్సిపల్ మురికినీరును, పారిశ్రామిక వ్యర్థాలను గోదావరి నదిలోకి వదలడం వల్లే జలాలు కాలుష్యమైపోయాయన్న వార్తలు వచ్చాయి. గంగానది ప్రక్షాళనకు కేంద్రం 20వేల కోట్ల రూపాయలు కేటాయించగా, ఆ దిశలో గోదావరి జలాల కాలుష్యాల నివారణకు ఉభయ తెలుగు రాష్ట్రాలు, కేంద్ర ప్రభుత్వం దృష్టి సారించాల్సిన అవసరం ఏర్పడింది. పర్యావరణ సూత్రాలు పక్కన పెట్టి ఇసుక పర్రల దోపిడి, గ్రానైట్ మాఫియా గుట్టల విధ్వంసం, తెలంగాణలో ఒపెన్ కోల్‌మైన్స్ తవ్వకాల వల్ల గోదావరి ప్రవాహ జలాలపై నీలినీడలు ఏర్పడుతున్నాయని పర్యావరణ నిపుణులు హెచ్చరిస్తున్నారు.

మహారాష్ట్రలో 11 ప్రాజెక్టులు గోదావరిపై వరుసగా కట్టడం వల్ల తెలంగాణా శ్రీరాంసాగర్ ప్రాజెక్టులో నీళ్ళురాక కరువైపోయింది. పైగా వర్షాభావ పరిస్థితులు అగ్గికి ఆజ్యం పోసినట్లయింది. జూలై 18నాటి ట్రాఫిక్ రద్దీ సంఘటనల వల్ల పలువురు గుండెపోట్లపాలైనట్లు సమాచారం. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జూలై 20, 21 తేదీలలో సెలవులు ప్రకటించినా, తెలంగాణ మౌనంగా ఉండిపోవడం విమర్శలకు తావిచ్చినట్లయింది. కేవలం పుష్కర క్షేత్రాలలో ప్రభుత్వ సెలవులు ప్రకటించడం, ఇతర ప్రాంతాలకు సెలవులు కనీసంగా ఒకటి, రెండైనా ఇవ్వకపోవడం వల్ల ట్రాఫిక్ రద్దీకి దారితీసిందని విమర్శలు వచ్చాయి. ఏదైనా పుష్కరాలకోసం ముందస్తు పకడ్బందీ ప్రణాళిక చేబట్టి చిత్తశుద్ధితో అమలు చేయడంలో విఫలమయ్యాయి.. వచ్చే సంవత్సరం కృష్ణానదికి జరిగే పుష్కరాల ఏర్పాట్లలో ఈ అనుభవాలను లెక్కలోకి తీసుకొని తగిన స్థాయిలో ఏర్పాట్లు చేయాలి.

**రచయిత ఫోన్ నం. 9441797650**

గోదావరి పుష్కరాలు

# జలప్రవాహం చెంత జనప్రవాహం

(రాజమహేంద్రవరం నుంచి అమ్మనుడి ప్రతినిధి)



విచారాంశాలు, విశేషాంశాలతోపాటు 2015 గోదావరీపుష్కరం రాజమహేంద్రవరం వద్ద సాంస్కృతిక శోభలతో ఉత్సవంలా జరిగింది.

నిజానికి పుష్కరం హిందువులకి చెందిన మతవిశ్వాసాలు, ఆ మతశాస్త్రాలకు చెందిన తతంగాలకు చెందిన నిర్వహణలు. ప్రజలు–పురోహితులు–కర్మకాండలకు చెందిన ఆచరణలు, వీటి పరస్పర సంబంధితాంశాలూ ఎక్కువగా ఉంటాయి.

ఇందులో దొరతనాల ప్రమేయాలు ప్రజాసౌకర్యాల పరికల్పనలకుచెందినవి మాత్రంగానే ఉంటాయి. ఆంగ్లేయుల కాలంనుండీ పుష్కరాలకు వచ్చే అసంఖ్యాక ప్రజానీకానికి సౌకర్యాలు చూడడంలో దొరతనాలు తమ పాత్రలు వహిస్తూనే వున్నాయి.

నీరు ప్రాణాధారం. ఆహారం లేకుండానైనా కొన్ని రోజులు మనుగడ సాగించవచ్చుగాని, నీరుత్రాగకుండా బ్రతకలేం. తిండి తిన్నాక కూడ నీరు త్రాగడం అవసరం.

భూమ్మీద మూడువంతుల నీరూ, ఒకవంతు భూమి వున్నట్లే పుడమి బిడ్డలమైన మన తనువుల్లోనూ మూడువంతుల రక్తం, ఒక వంతు ఎముకలూ వున్నాయి.

ప్రపంచంలో ఆయాదేశాల్లో ఎన్నో నదులున్నాయి. అవి నీటి సిరులతో మానవుల బతుకు పంటల్ని పండిస్తూనే ఉంటాయి.

ఆయాదేశాల సంస్కృతుల్ని బట్టి నదుల్ని చూసే చూపులుంటాయి.

ఉపయోగపడేవాటికీ, భయాన్ని కలిగించే వాటికి శక్తిరూప ఆరాధనలు, దైవీకరణలు అనూచానంగా వస్తున్నవే. వృక్షపూజ, సర్పపూజలు ప్రకృతిశక్తుల పూజల్లో భాగమే నదీ పూజలు కూడా.

భారతదేశంలో హిందూపురాణ శాస్త్రాలు శాఖోపశాఖలై విశ్వాసాల నమ్మకాల ఆధారంగా గట్టిగా కుదురుకొని జవజీవనాలతో మమేకాలయ్యాయి.

పంచభూతాల్లో నీటికి, నీటి వనరుల్లో నదులకూ మళ్ళీ నదుల్లో గంగకూ ప్రాధాన్యమిచ్చారు. గంగకు చెల్లెలుగా గోదారిని భావించారు. అయితే గంగకంటే ప్రాచీనమైన నది గోదావరి అని అంతర్జాతీయ ప్రఖ్యాతి చెందిన తెలుగు ఇంజనీరు కె.ఎల్. రావు గ్రంథస్థం చేశారు.

గురుడు సింహరాశిలో ప్రవేశించినప్పుడు గోదావరికి పుష్కరాలు వస్తాయి. 12 సంవత్సరాలకు వచ్చే పుష్కరం 12 రోజుల పాటు జరుగుతాయి. 2015 గోదావరి పుష్కరాలను దొరతనం 'మహాపుష్కరాలు' అంటూ సొంతముద్ర వేసింది. ఈ 'మహా'పై పండితుల్లో శషభిషలు తప్పలేదు.

పైగా ఇన్నో సంవత్సరం పుష్కరమంటూ గణించడాన్ని పండితులు ఖండించారు. పుష్కరం నదికి వస్తుంది కాని ప్రాంతానికి ఊళ్ళకి కాదు. కాని మహారాష్ట్రను వదలి గోదావరి ప్రవాహం తెలంగాణ, ఆంధ్ర రాష్ట్రాలలో ప్రయాణించినప్పుడు ఒడ్డుల ప్రక్కన గల ఊళ్ళల్లో ఒక పెద్ద పట్టణం, విశాల గోదావరి ప్రక్క గల పట్టణం రాజమహేంద్రవరం మాత్రమే. దక్షిణకాశిగా భావించబడడం, చారిత్రక సాహిత్య సాంఘిక రంగాలలో విశేషంగా పేరుపొందడం వంటి కారణాల నేపథ్యంలో రాజమహేంద్రవరం ప్రాంతంలో పుష్కర నిర్వహణకు ప్రాధాన్యం ఇబ్బడిముబ్బడైంది.

గోదావరి ఎప్పుడూ పవిత్రమైనదే అయినా–పుష్కరకాలంలో సర్వతీర్థాలు, ముక్కోటి దేవతలు అక్కడ చేరతారని అందువలన తీరాల్లో చేసే దానధర్మాలకు, అర్పణ తర్పణలకూ పిండప్రదానాలకూ పుణ్యఫలాలు అధికాధికంగా వస్తాయనే హిందువుల విశ్వాసం పుష్కరాలకు ఇన్ని లక్షల మందిని రప్పించింది.

ముఖ్యంగా చనిపోయినవారిని స్మరిస్తూ పిండ ప్రదానాలు చేయడం ఒక కృతజ్ఞతతో కూడిన పని అవడంతో ఇలా చేయడంలో సాహిత్యయోధులకూ కొందరు ముఖ్య వ్యక్తులకు తర్పణలివ్వడం జరిగింది.

పుష్కరదినాలు అప్పుడా? ఇప్పుడా? ఎప్పుడూ! అనే అంశంపై ఎప్పుడూ తర్జన భర్జనలే – దొరతనపు గణనలకు విభేదిస్తూ (అవీ పండితులు చేసినవే) మధుర కృష్ణమూర్తి శాస్త్రి, దోర్బల ప్రభాకరశర్మ, మరికొంతమంది తమ మార్గ–గణనలకు ఆధారంగా పుష్కరాలలో ముందుగానే స్నానాధివిధిని నిర్వహణలు చేసుకున్నారు. 2015 పుష్కరాలకు దొరతనం, ప్రసార మాధ్యమాలవారు, పత్రికా మాధ్యమాలవారూ విస్తృతంగా ప్రచారం చేయడమూ, ఇన్ని లక్షలమంది రాకలకు కారణమైందంటున్నారు. బ్రతుకు తెరువుల్లో–ప్రజల్లో వచ్చిన

ఆర్థికాభివృద్ధిసైతం జనాల రాకలకు తోడై వుండచ్చు. గోదారి రేవుల్లో ఎక్కడ పుష్కర విధులు నిర్వహించినా ఫలితం ఒకటేనని ప్రచారం చేయాలన్న ఆలోచన తొలిరోజున 27 మంది చనిపోయిన తర్వాత గాని ప్రభుత్వానికి కలగలేదు. మొదటినుండి ఆ ప్రచారం జరగవలసివుంది.

రాజమహేంద్రి పుష్కరాలరేవు (అసలు పేరు పుష్పగిరి రేవు)లో జనం త్రొక్కిసలాటల్లో 28మంది అమాయక యాత్రికుల ప్రాణాలు గాలిలో కలిసిపోయాయి. ఒకరా? ఇద్దరా? 27 మంది చనిపోవడం రెండు తెలుగు రాష్ట్రాల ప్రజల్నేకాదు యావత్తు దేశాన్ని కలచివేసింది. యాత్రికుల్ని భయభ్రాంతులకి గురిచేసింది. ఈ మారణకారణాలపై న్యాయవిచారణ జరిపించి తీరాలి.

లక్షల యాత్రికుల రాక, ముఖ్యమంత్రి పర్యవేక్షణలు, ఆయన తరచు రాజమండ్రికి రావడం– అంతేకాదు– పుష్కరాలలో పన్నెండు రోజులూ తానే దగ్గర ఉండి ఆదేశాలూ అవీ జారీ చేయడం– ఇన్ని వున్నా ఇన్ని నిండు ప్రాణాలు సున్నా కావడానికి కారణాలు తప్పనిసరిగా ప్రజలకు తెలియాలి.

మధ్యన దృశ్యమాధ్యమంలో రాష్ట్రదేవాదాయశాఖా మంత్రి – ఈ మరణాలు– ఇవేకాక శ్రీ వేంకటేశ్వర ఆనం కళాకేంద్రం దగ్గరలోనే గ్యాస్ సిలండర్లు పేలడం ఇటువంటి సంఘటనలు మామూలుగా జరిగాయా వెనుక ఏమైనా కారణాలున్నాయా అని ఆలోచించాలి అనడంతో ప్రజల్లో ఆశ్చర్యం ఎక్కువయింది.

కొన్ని సంఘటనలు దొరతనానికి కనువిప్పయి కొన్ని ప్రత్యేక చర్చలు చేపట్టారు. పారిశుద్ధ్యం ప్రధాన అంశం. రాజమహేంద్రవర నగర పాలక సంస్థ అధికారులూ, ఉద్యోగులూ రాత్రీపగలూ చురుగ్గా పనిచేశారు.

**స్థానిక ప్రముఖ పత్రిక ప్రజాపత్రిక – గోదావరి రేవుల్ని – పుష్కరఘాట్– ఇలా పిలవడం బాగాలేదని ఘట్టంకి బదులుగా చక్కని తెలుగు మాట రేవును వాడుకోలేమా అని వ్రాసింది. దీనిపై స్థానిక కవుల సాహితీవేత్తల మౌనాన్ని విమర్శించింది.**

ఇంగ్లీషువాళ్ళ నోళ్ళబడి భ్రష్టుపడిన ఊరు పేరు 'రాజమండ్రి'ని రాజమహేంద్రవరంగా మార్చనున్నట్లు ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబు నాయుడు పుష్కర సందర్భ సభావేదికనుండి ప్రకటించడం పండితులు మెచ్చుకున్నారు. రాజమండ్రి పేరును రాజమహేంద్రిగా మార్చాలని పురిపండా అప్పలస్వామి, ఆరుద్ర, మధునాపంతుల వంటివారు లోగడ కోరారు. శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు వంటి పండితులు రాజమహేంద్రవరంగా మార్చాలని లోగడ కోరారు. ఇప్పుడు ముఖ్యమంత్రి రాజమహేంద్రవరం ప్రకటన వివాదానికి ముగింపు పలికినట్లే అనుకోవాలి.

మరువలేని తొలినాటి విషాద వాతావరణం లేకపోతే 2015 పుష్కరాలు పూర్తిగా ఒక సాంస్కృతికమైన సంబరంగా మిగిలిపోయేది.

దూరాభారాన్ని గమనించాక వచ్చే పుష్కరయాత్రికులకు అనేక వీధుల్లో ఐచ్ఛికంగా తమ ఇళ్ళముందర మంచినీళ్ళు, పులిహోర పొట్లాలూ ఇచ్చిన ప్రజల తీరు గమనిస్తే గోదావరీ జల ప్రవాహానికే కాదు, అశేష జన ప్రవాహానికి జనం నీరాజనమిస్తారనిపించింది. ◆

**కవిత**

# రాగమాలిక

**రా**యిలా నిశ్చల గీతంలా కాకుండా
అలల కలగానమే కదా నది అంటే
దారి పొడుగునా మౌనశిలలను కరిగిస్తూ
మాటల వీణాతంత్రులను మీటడమేగా నది లక్ష్యం
చిరునవ్వుల విరిమాలల పరిమళాలు పంచడానికే
ముఖాముఖాలు చూసుకొంటూ
లాభనష్టాల తులాదండంతో తూస్తున్న స్వార్థప్రపంచంలో
చిన్న పాయగా కన్ను తెరచిన దగ్గరనుంచి
పెనుకడలిలో కరిగిపోయే వరకు
విభిన్న రకాల ప్రవాహానివి
రాగమాలికవు
ఎండిపోయిన బీడు పొలాలను
సస్యశ్యామల వర్ణచిత్రాలుగా మార్చే కళాకారిణివి.

**కొ**త్త పరికిణీ అంచులను కొంచెం
పైకిపట్టుకొని నెమ్మదిగా నడిచే బాలికలా
అప్పుడే పుట్టి సడిచేయక కదిలే నిశ్శబ్ద రాగానివి
నడుస్తున్నప్పుడు చీరకుచ్చెళ్ళ పింఛం
అందంగా విచ్చుకొన్నట్లు
గబగబా అడుగులు వేసే ఆధునిక యువతిలా
ఉరుకులు పరుగులు పెట్టే ఉత్సాహ రాగానివి
కట్టుకొన్న మొగుడైనా కానివాడైనా
నిందాబాణాన్ని గురిచూసి విసిరినపుడు
ఆగ్రహించిన స్త్రీవాదిలా
ఊళ్ళని ఇళ్ళని ముంచెత్తే మహోగ్ర రాగానివి
పల్లెల్లో పట్టణాల్లో ప్రవహిస్తూ
ప్రాణికోటికి జీవఫలాలనందించే దాన రాగానివి
జీవితమంతా ప్రవహిస్తూ సాగరగర్భంలో కలిసేటపుడు
నిండుజీవితం గడిపిన మహిళలా ప్రశాంత రాగానివి.

**జీ**వన మాధుర్యాన్ని అందరికీ దోసిళ్ళతో అందిస్తూ
ప్రవహించడమే నీ నైజం
ఏ సీతాకోక చిలుక వాలని ఎండిన తోటలా
ఏ హరివిల్లు మెరవని శూన్యాకాశంలా
జీవితం నిష్ఫలమైనపుడు
జీవనదీ గలగల సంగీతాన్ని విని
నేనూ ఒక అలనై ఒక కలనై
ఉప్పెననై ప్రవహిస్తా.

**– మందరపు హైమవతి**
**ఫోన్: 9441062732**

డా॥ ఈమని శివనాగిరెడ్డి
డా॥ మొవ్వా శ్రీనివాసరెడ్డి

# 135 ఏళ్లకు మళ్లీ వెలుగు చూచిన జయసింహుని పెదమద్దాలి రాగిరేకు శాసనం

**1883** లో అప్పటి కృష్ణాజిల్లా కలెక్టర్ రాబర్ట్ సీవెల్, ఆర్కియోలాజికల్ సర్వే ఆఫ్ సదరన్ ఇండియా (మద్రాసు) వారికోసం 'లిస్ట్స్ ఆఫ్ ది యాంటిక్వేరియన్ రిమెయిన్స్ ఇన్ ది ప్రెసిడెన్సీ ఆఫ్ మద్రాస్' అనే పుస్తకాన్ని సంకలనం చేశారు. ఈ పుస్తకంలో కృష్ణాజిల్లాకు సంబంధించిన ఊర్లపై రాస్తూ (పేజీ 51), గన్నవరానికి 16 మైళ్ల దూరంలో నైరుతి దిక్కులోనూ, బెజవాడకు 24 మైళ్ల దూరంలో తూర్పుగానూ గల పెద్దమద్దాలి గ్రామంలో చాళుక్య జయసింహుని మూడు రేకులున్న రాగి రేకు శాసనం ఇటీవలే బయల్పడిందనీ, వీటి వివరాలకు 'లిస్ట్ ఆఫ్ కాపర్ ప్లేట్స్', వాల్యూం-II, పేజీ 1, నెం.3లో చూడవచ్చని, పేర్కొన్నాడు. అంతేకాదు, మరో రెండు రాగిరేకు శాసనాలు ఇదే గ్రామానికి చెందిన తాడంకి గోపన్న దగ్గరున్నాయనికూడా తెలియజేశారు. కానీ వాటి వివరాలు ఇప్పటివరకూ తెలియరాలేదు. అది అలా ఉంచితే, తూర్పు చాళుక్య రాజైన జయసింహుడు (తూర్పు చాళుక్య వంశ పాలకుడైన కుబ్జ విష్ణువర్ధనుని కొడుకు) విడుదల చేసిన మూడు రాగిరేకు శాసనాల గురించి కొద్దిమంది చరిత్రకారులు మాత్రమే ప్రస్తావించారు. మరికొందరు విస్మరించారు. మాజేటి సోమశేఖరరావు సంపాదకత్వంలో వెలువడిన 'గుంటూరు జిల్లా సమగ్ర చరిత్ర-సంస్కృతి' (మొదటిభాగం-2004)లో వి.కె. మోహన్, ఎం. సోమశేఖరరావులు రాసిన 'తూర్పు చాళుక్యుల, చాళుక్య - చోళుల పాలన' అన్న ఏడో అధ్యాయం (పే.160)లో పెద్ద మద్దాలి శాసన ప్రస్తావన ఉంది. జయసింహవల్లభుని కాలంలో చాళుక్యులకు, పల్లవులకు ఘర్షణ ప్రారంభమైందనీ, రెండు రాజ్యాల మధ్య గల బోయ (కొట్టాలు) దేశాన్ని (ప్రకాశం జిల్లా కందుకూరు నుంచి నెల్లూరు జిల్లా చివరివరకూ) తన ఆధీనంలోకి తెచ్చుకోవటానికి, జయసింహుడు ఉదయగిరిలో విడిది చేసి, వారితో యుద్ధం చేసి, జయించి, తమ సామంతులుగా చేసుకొన్నాడని పై రచయితలు పేర్కొన్నారు.

ఆచార్య బీ.యస్.ఎల్. హనుమంతరావు రాసిన 'ఆంధ్రుల చరిత్ర' (పేజీ.147-148)లో కుబ్జ విష్ణువర్ధనుని కుమారుడైన జయసింహవల్లభుడు 'సర్వలోకాశ్రయ' 'విజయసిద్ధి' అన్న బిరుదులు ధరించి క్రీ.శ.641నుంచి 673 వరకు 33 ఏళ్ల పాటు వేంగిని రాజధానిగా చేసికొని పరిపాలించాడని ఉంది. జయసింహుడు తన పెదమద్దాలి శాసనాన్ని ఉదయపురం నుంచి ఇచ్చాడనీ ఇది ఉదయగిరి అయి ఉంటుందనీ, జయసింహుడు ప్రకాశం జిల్లాలోని బోయకొట్టాలను ఆక్రమించి, వారిని సామంతులుగా చేసుకొని ఉంటాడని అదే సందర్భంలో పెద్దమద్దాలిశాసనాన్ని విడుదలచేసి ఉంటాడని హనుమంతరావు చెప్పారు. వి. సుందర రామశాస్త్రి తన 'హిస్టరీ ఆఫ్ కృష్ణా డిస్ట్రిక్టు' (పే.59)లో జయ సింహుడు తన దాయాది మొదటి విక్రమాదిత్యుడు కంచిపై దాడిచేసినపుడు అతనికి సహాయపడటానికి వెళ్తూ నెల్లూరు జిల్లా ఉదయగిరివద్ద విడిది చేసినపుడు పెదమద్దాలి రాగిరేకుశాసనాన్ని విడుదలచేసి ఉండవచ్చునని పేర్కొన్నారు. పైగా ఈ శాసనపాఠం 'ఇండియన్ యాంటిక్వేరీ వాల్యూం 13, (పే.113)లో ఉందని సూచించారు. మహమ్మద్ సిలార్ రచించిన 'కృష్ణా జిల్లా చరిత్ర' (పేజీ.54)లో, కుబ్జ విష్ణువర్ధనుని కుమారుడైన మొదటి జయసింహ వల్లభుడు తన 18వ పాలనా సంవత్సరం అంటే క్రీ.శ.660లో విడుదల చేసిన రాగిరేకుల శాసనం పామర్రు దగ్గర 'పెద్దమద్దాలి' గ్రామంలో 1880లో దొరికిందనీ, గుద్రవార (గుడివాడ) విషయంలో మర్దవల్లి గ్రామానికి తూర్పుగానున్న పినకపర్రు గ్రామాన్ని దానం చేసిన వివరాలు ఈ శాసనంలో ఉన్నాయని చెప్పారు.


EASTERN CHALUKYA GRANT OF THE 18TH YEAR OF JAYASIṀHA I.

**తూర్పు చాళుక్య రాజైన జయసింహుడు (తూర్పు చాళుక్య వంశ పాలకుడైన కుబ్జ విష్ణువర్ధనుని కొడుకు) విడుదల చేసిన మూడు రాగిరేకు శాసనాల గురించి కొద్దిమంది చరిత్రకారులు మాత్రమే ప్రస్తావించారు. మరికొందరు విస్మరించారు.**

ఆచార్య వకుళాభరణం రామకృష్ణ ప్రధాన సంపాదకులుగా, బి. రాజేంద్రప్రసాద్ సంపాదకులుగా వెలువడిన 'ఆంధ్రప్రదేశ్ సమగ్ర చరిత్ర-సంస్కృతి' మూడో సంపుటి- 'తొలిమధ్యయుగ ఆంధ్రప్రదేశ్' గ్రంథంలో జె. దుర్గాప్రసాద్ రాసిన 'వేంగీ చాళుక్యులు' అన్న మూడో అధ్యాయం (పేజీ 29-30) లో మొదటి జయసింహుని గురించి రాసిన వివరాలలో అతడు కళింగ, ఆంధ్ర శత్రువులను గట్టిగా అణగదొక్కానని ప్రకటించుకున్నాడనీ, ఇంకా దండి, తన దశకుమార చరిత్రలో కళింగగాంగ రాజుతో జరిగిన యుద్ధంలో జయసింహుడు చనిపోయాడని అతనికి 'సర్వసిద్ధి' అన్న బిరుదుండేదని పేర్కొన్నారు.

ఇక అసలు విషయానికొద్దాం. 1884వ సం॥లో ప్రచురితమైన 'ఇండియన్ యాంటిక్వేరీ' వాల్యూం-13 (పేజీ. 137, 138) లో పెదమద్దాలి రాగిరేకు శాసనం గురించి 'సాంస్క్రిట్ అండ్ ఓల్డ్ కానరీస్ఇన్స్క్రిప్షన్స్' శీర్షికన జె.ఎఫ్.ఫ్లీట్ వివరాలనందించారు. ఈ శాసనం మద్రాస్ ప్రెసిడెన్సీ, కృష్ణాజిల్లా, నూజివీడు రెవెన్యూ డివిజన్‌లో

ఉన్న పెద్దమద్దాలి గ్రామంలో ఇంటికోసం పునాదులు తవ్వుతున్న ఒక బ్రాహ్మణునికి దొరికిందనీ, రాబర్ట్ సీవెల్ ద్వారా ఆ శాసనం తన పరిశీలనకొచ్చిందని ఫ్లీట్ రాశాడు.

మూడు రేకులున్న ఈ రాగి శాసనానికి 4 1/2 అంగుళాల వ్యాసంలో, ఒక అంగుళం మందం ఉన్న ముద్ర ఉందనీ, దానిపై 'శ్రీ సర్వసిద్ధి' అన్న బిరుదుందనీ, మూడు రేకులు 53 3/8 తులాల బరువుందనీ, ముద్ర గల కడియం 50 5/8 తులాల బరువుతో మొత్తం 104 తులాల బరువుందనీ తెలియజేశాడు. తూర్పుచాళుక్య రాజైన మహారాజ జయసింహవల్లభుడు లేక మొదటి జయసింహుడు ఉదయపురం నుంచి ఈ శాసనాన్ని విడుదల చేశాడనీ, గుద్రహార విషయంలోనున్న మర్దవల్లి లేక మద్దవల్లి (మద్దాలి-పెదమద్దాలి) గ్రామానికి తూర్పునగల పెణుకపఱు గ్రామాన్ని 18వ పాలనా కాలంలో అంటే శ.క.582 వ సం॥ (క్రీ.శ.660వ సం॥)లో దానం చేశాడని పేర్కొనబడిందని ఫ్లీట్ తెలియజేశాడు.



J. Burgess. From the original plates. W. Griggs, Photo-lith.

EASTERN CHALUKYA GRANT OF THE 18TH YEAR OF JAYASIMHA I.



## శాసనపాఠం

**మొదటి రేకు - మొదటిపక్క :**

1. శ్వస్తి శ్రీమద్విజయోదయపురాత్ భగవప్వి(సా)మి మహాసేనపాదాను
2. ద్యాతానాం సప్తలోకమాతృభిః పరివర్ధితానాం భగవన్నారాయణ
3. ప్రసాద సమానాదిత వరాహలాంఛనేక్షణక్షణ వశీకృత అశేష
4. ముహిక్షితాం మానవ్యసగోత్రానాం చాళుక్యానాం కులమలంకాకో చతు
6. రుదధిసలిల సముల్లంఘిత కీర్తేః శ్రీ కీర్తివర్మణః పౌత్రః సమశ్రితా
7. నాం కామధేను చరితస్య అనేకరిపుదుర్గ ప్రమధానావాప్తవి

**రెండోరేకు - మొదటి ప్రక్క:**

8. షమసిద్ధేః యస్యచ శాస్త్ర మాప్నత్రాణాయ విగ్రహఃపరాభి
9. మానభంగాయ శిక్షితం వినయాయ విభవార్జనం ప్రదానా
10. య ప్రదానంధర్మాయ ధర్మః శ్రేయోవాప్తయే తస్య తనయః
11. శశిధరివ సర్వలోకః హృదయానందకరః సు
12. రగజ ఇవవిచ్ఛిన్న దాన సలిలకిన్నర్ణ నికేతః చ
13. క్రధర నైవా ప్రతిహతచక్రః ద్రోణ ఇవ కృపానుగతః స్వబా
14. హుబలోపార్జిత సర్వసిద్ధిః సమర శతసంకటోత్కంఠ విజయ

**రెండే రేకు - రెండోపక్క :**

15. వీరధ్వజః శ్రీ జయసింహవల్లభ మహారాజః పరమబ్రహ్మ
16. ణ్యో మాతాపితృపాదానుద్యాతః సర్వేనేవ మాజ్ఞాపయ త్యస్తు వా విధి
17. తం అస్మాభిః గుద్రహారవిషయే మర్దవల్లి పూర్వపార్శ్వే పెణుకప
18. ఱు నామగ్రామగ్రాలమో విషువ నిమిత్తే విజయ రాజ్యసంవత్సరె
19. అష్టాదశె పొగులూర వాస్తవ్య భారద్వాజసగోత్రస్య భా
20. రద్వాజసూత్రశ్యాధిత వేద ద్వయస్య శివశర్మణః పౌత్రాయ గృహీ
21. త సాహస్రస్యాధిగత వేద ద్వయస్యదేవశర్మణః పుత్రాయ

**మూడోరేకు: మొదటిపక్క:**

22. షట్కర్మణ నిరతాయ ఆశీతితర్కాయ గుప్తశర్మణే సర్వకరప
23. రిహారేణా గ్రహారికృత్య ప్రతిగ్రహో దత్తః నకై శ్చి దప్యస్యోపరి బా
24. ధా కరణీయా ఉక్తెచ భగవతా వేదవ్యాసేన వ్యాసేన బహుబిర్వ
25. సుధా దత్తా బహు భిచ్ఛాను పాలితా యస్య యస్య యదా భూమి
26. స్తస్యతస్య తదాఫలం షష్ఠి వర్ష సహస్రాణి స్వర్గే మోదతిభూ
27. విదా ఆక్షేప్తా ఛానుమంతాచ తన్యేవ నరకే వసేత్ మంత్రి పురోహితస్య 28. యంధేంద్రస్య బృహన్పతిః ఆజ్ఞాప్తిస్సియశర్మస్య వాజపేయేజ్యా య భూభూభిః

శ్రీమద్విజయోదయపురంనుంచి. మహాసేనుడైన కార్తికేయుని పాదానుధ్యాతులు, సప్తలోక మాతలు, సప్తమాతలవల్ల వృద్ధిచెందుతున్న, భగవన్నారాయణ ప్రసాదులైన, వరాహలాంఛనులైన అనేకమంది రాజుల్ని వశంచేసుకున్న వాడైన మానవ్య సగోత్రులైన, హారీతిపుత్రులైన, అశ్వమేథ, అవభృథ స్నానంచేత పవిత్రులైన చాళుక్యులనే కులానికి అలంకారమైన నాలుగు సముద్రాల పర్యంతం వ్యాపించిన కీర్తిగలవాడైన శ్రీ కీర్తివర్మ మనుమడు, కామధేనువని పేరుగడించి, అనేక శత్రుదుర్గాలను జయించి, విషమసిద్ధి బిరుదుగాంచిన ఆప్తుల శ్రేయస్సుకోరేవాడు. అయిన అతనికొడుకు సర్వసిద్ధి బిరుదుపొందిన వాడు. పరమబ్రాహ్మణ్యుడు, తల్లిదండ్రుల పాదసేవచేయువాడైన జయసింహ వల్లభ మహారాజు, గుద్రవార విషయంలోని మర్దవల్లి (మద్దవల్లి-మద్దాలి) గ్రామానికి తూర్పుగానున్న పెనుకపర్రు గ్రామాన్ని పొగులూరు గ్రామానికి చెందిన రెండు వేదాలు బాగా ఎరిగిన శివశర్మ మనుమడు, దేవశర్మ కొడుకుఅయిన గుప్తశర్మకు ఏమాత్రం పన్నులు లేకుండా అగ్రహారం చేసి రాజుతన 18వ విజయరాజ్య సం॥లో దానం చేశాడు అని శాసనపాఠం.

(కేంద్ర మంత్రివర్యులు సుజనాచౌదరిగారు, మాలక్ష్మీగ్రూప్ ఆఫ్ కంపెనీస్ అధినేత యార్లగడ్డ హరిశ్చంద్రప్రసాద్‌గారు పెద్దమద్దాలి గ్రామ వాస్తవ్యులే).

---

రచయితలు **డా॥ ఈమని శివనాగిరెడ్డి** (ది కల్చరల్‌సెంటర్ ఆఫ్ విజయవాడ) ఫోన్: **9848598446** ; **డా॥ మొవ్వా శ్రీనివాసరెడ్డి** (లయోలా కాలేజి, విజయవాడ, ఫోన్: **9490333488**

---

**కవిత**

## 'బర్త్‌డే' బాబు

**పాలు** త్రాగకుండానే పడుకున్నాడు బాబు
పుట్టిన రోజుకి వచ్చిన 'గిఫ్టులు'
'మమ్మీ' 'డాడీలు' లెక్కపెట్టుకుంటుంటే
వచ్చిన డబ్బులు నానమ్మా తాతయ్య
మూటకడుతుంటే
అమ్మ కౌగిలికోసం ఏడ్చి ఏడ్చి
పాలు తాగకుండానే, పడుకున్నాడు బాబు

బర్త్‌డే కోటు ఉక్క బెడుతుంటే
బర్త్‌డే కేకు గొంతుకడ్డంపడి
గబుక్కున లేచాడు బాబు
మంచినీళ్ళుకూడా త్రాగకుండానే
పడుకున్నాడు బాబు

రాత్రి అతిథులు చేసిన బర్త్‌డే గోలకి
జ్వరం పడ్డాడు బాబు
జ్వరంలోనే వెక్కివెక్కి ఏడ్చాడు
పాలుత్రాగకుండానే పడుకున్నాడు బాబు

బర్త్‌డే పార్టీ గ్రాండ్‌గా జరిగిందని
అందరూ గొప్పగా చెప్పుకుంటున్నారు...
వేసిన మందులు కడుపులో తిప్పుతుండగా
అమ్మా నాన్నలిద్దరూ డ్యూటీలకి వెళ్ళిపోగా
పాలుత్రాగకుండానే పడుకున్నాడు బాబు...

**– డి. నటరాజ్**
**ఫోన్: 9440428597**



తెనుగు లెంక 'అభినవ తిక్కన' తుమ్మల సీతారామమూర్తి.

# తెనుగు లెంక సూక్తులు

**తెనుగు లెంక అంటే తెలుగు భాషా సేవకుడని అర్థం. అందరూ ఆయనను 'అభినవ తిక్కన' అంటారు. తెలుగు మాటకున్న వాడి వేడి గ్రహించిన కవి ఆనాడు తిక్కన అయితే ఈ ఆధునిక కాలంలో తుమ్మల సీతారామమూర్తి. తుమ్మలవారికి తెలుగుభాషను గురించి, తెలుగుజాతిని గురించి, వాని అభివృద్ధి గురించి కొన్నివిశిష్టమైన అభిప్రాయా లున్నాయి. వాటిని చదువరులకు అందించడమే ఈ శీర్షిక ఉద్దేశ్యం.**

*"తల్లిబాస తీపి తగులని మానిసి,/ దేశకవిత నిగ్గు తెలియనతడు/ జాతిరుచులు కాన జాలని యంబేద/ కాదు కాదు నాయకరము వడయ – తెలుగులెంక తుమ్మల"*

**భాష,** జాతి – అనేవి ఒకదానితో ఒకటి అవినాభావ సంబంధం కలిగి వేరు చేయలేని పదాలు. భాషముందా, జాతిముందా అని ప్రశ్నిస్తే విత్తుముందా, చెట్టు ముందా అని ప్రశ్న వేయాల్సి వస్తుంది. భాష ఉంటేనే జాతి. జాతిమాట్లాడేదే భాష. జాతి ఉంటేనే ఒక రాజ్యం; ఆ రాజ్యానికి ఒక నాయకుడు. భాష లేకపోతే ఆ జాతికి పేరులేదు. జాతికే పేరు లేకపోతే ఆ రాజ్యానికి, ఆ నాయకునికి గుర్తింపురాదు.

అందుచేత నాయకత్వం వహించేవాడికి భాషపట్ల నిశ్చితమైన విధానం ఉండాలి. జాతిని ప్రగతి పథంలో నడిపించాలనే తపనతో పాటు భాషకు ఊపిరిపోసి, దానిని ఆధునిక అవసరాలకు అతికేటట్లు తయారు చేయాలి. కాని దురదృష్టవశాత్తు తెలుగు రాష్ట్రాలనాయకులకు తెలుగుభాష తీపి తెలియదు. తెలుగు కవితలోని అంశాలు తెలియవు. జాతి సాధించిన ప్రగతి తెలియదు. అధికారం అందలాలు అందుకోవాలని, పదవులు పదిమంది తన వాళ్ళకు పంచిపెట్టి పబ్బం గడుపుకోవాలని, తనకు మాత్రమే కీర్తి దక్కాలనే తాపత్రయం తప్ప, భాషగురించిన ఒక విధానం లేదు. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడి ఇన్ని సంవత్సరాలు గడిచినా విడిపోయి సంవత్సరమయినా ప్రభుత్వాలు భాష గురించి తమ విధానం చెప్పవు. భాషాభివృద్ధికి ప్రయత్నం చేయవు.

అందుకే తుమ్మల 'తెలుగు భాష తీపి తెనియని వాడు– తెలుగలోని దేశకవిత అందం తెలియనివాడు, తెలుగుజాతి గొప్పతనాన్ని గ్రహించలేనివాడు అసమర్థుడు; అవివేకి అని, అలాంటి వాడికి ప్రభుత్వాన్ని పాలించే అర్హతలేదని తేల్చి చెప్పాడు.

ఇప్పటికైనా నాయకులు ఈ సంగతి గ్రహించాలి. తమ భాషావిధానం తెలియచెప్పాలి. భాషాభివృద్ధికోసం కృషి చేయాలి. అంతరించి పోతుందేమోనని ఆవేదన చెందుతున్న భాషాభిమానులకు తమ కార్యాచరణద్వారా ఆనందం కలిగించాలి. నాయకత్వానికి తాను అర్హుడనని నిరూపించుకోవాలి.

**– డాక్టర్ నాగభైరవ ఆదినారాయణ**
**ఫోన్ : 9849799711**

**కవిత**

# అక్షర యాత్ర

**ఒ**కసారి
లోకంలోకి వదిలిన అక్షరాలు
మళ్ళీ వెనుకకు రావు
వదిలిన తర్వాత
అవి నీవి కావు.

వాటిని పలుకరించి
ఎవరైనా ఆదరించారా
అవి వారి సొంతమౌతాయి.

కలం నుంచి రాలిన అక్షరాలు
ఎప్పటికీ వాడని పువ్వులు
వాటి చెవుల్లో
కాలం ఊదే రహస్యాలు
బహుశా రేపటి భాష్యాలు.

అక్షరాలు
ఎదుటివారి గుండెలను తడుతాయి
తెరుచుకోకపోతే
నిరాశపడవు.

లోకమంతా తిరిగి
మళ్లీ ఇంటిముందు నిలబడతాయి
గుర్తుపట్టకపోతే
నొచ్చుకోవు.

అప్పటికే
కొత్త అక్షరాలు
ఇంట్లో దూరుతాయి
కొన్నాళ్లకు ఇవి
వాటితో కలుస్తాయి.

సృష్టికర్త
అక్షరాల్లో తన తత్వాన్ని
ప్రవేశపెడుతాడు
అవి బయటికెళ్లి
అందరి ఆర్తిని స్వీకరిస్తాయి.

**– డా॥ ఎన్. గోపి**
సెల్‌నం. 040-27037585

- శ్రీ బొర్రా గోవర్ధన్

## తెలుగమ్మ ఒడిలో బౌద్ధం - 6

# తలలు వంచిన కంకులు తథాగతునికి నమస్కరించాయి

**తె**లుగు నేలపై తన భావజాల ప్రభావాన్ని బౌద్ధం ఎంతగా చూపిందో గత వ్యాసాల్లో చూశాం. ఈ వ్యాసాల ఉద్దేశ్యం, బౌద్ధం తెలుగునేల మీద ఎప్పుడెప్పుడుంది? ఎక్కడెక్కడుంది? ఏఏ కాలాల్లో ఏఏ ప్రదేశాల్లో గొప్పగా వ్యాపించింది? ఏఏ పాలకుల పోషణలో వర్ధిల్లింది? ఎలా ఉత్థాన పతనాలు చెందింది? అనేది మాత్రం కాదు. బౌద్ధ భావజాలం ప్రధానంగా ఏఏ రంగాల్లో ఉంది, ఎలా చేరువయ్యింది. అది మన జీవితాలకి అసలు చేరగలిగిందా? లేదా? దాని ప్రభావం మనమీద ఉందా - లేదా, అనేదే.

ఇప్పటివరకూ ఉన్న తత్త్వాలు గానీండి, మతాలు గానీండి, ధర్మాలుగానీండి- ఇంతకాలం నిలబడినవి బౌద్ధం తప్ప మరొకటి లేదు. ఇది నిర్వివాదాంశం. చారిత్రక సత్యం.

మనం ఒకనాడు ఒక మత విధానాన్ని నమ్మొచ్చు. మరోసారి మరో మత విధానానికి మారొచ్చు. మనం హిందువులం కావొచ్చు, క్రైస్తవులం కావొచ్చు, మహ్మదీయులం కావొచ్చు.మన మతాభిమానాలూ, మతావలంబనలూ ఏవైనా కావొచ్చు. కానీ, మనందరి జీవన విధానం మాత్రం దాదాపుగా ఒకటిగానే ఉంటుంది. పండగ రోజుల్లో తప్ప, మిగిలిన రోజుల్లో మన జీవన విధానం అంతా ఒక్కటే! నిజం చెప్పాలంటే పండగ రోజుల్లో కూడా...!

**తెలుగు ఆచారాలు:**

మొన్ననే లియాఖత్ అలీ అనే ఒక ముస్లిం మిత్రుడు నేనూ ఫోన్లో మాట్లాడుకున్నాం. ఆయన హేతువాది. నాస్తికుడు. బౌద్ధాభిమాని. రంజాన్ గురించి చెప్తూ 'ఈ పండగ సందర్భంగా అన్నదమ్ములు ఆడపడుచులకి బట్టలు పెడతాం' అని చెప్పాడు. నాకు ఒకింత ఆశ్చర్యం వేసి 'ఆడపిల్లలకి ఇలా బట్టలు పెట్టడం మహమ్మదీయ ఆచారమా?' అని అడిగాను.

'ఇలా పెట్టాలనేది మతాచారం కాదు. మన తెలుగు ఆచారం. ఈ విషయం ఖురాన్‌లో లేదు - ఇతర ముస్లిం ప్రాంతాల్లో కూడా లేదు. ఇది మన ఆచారమే' అన్నాడు.

నేనిక్కడ ఈ విషయాన్ని ప్రస్తావించింది, ఇది కూడా ఈ వ్యాసంలోని భాగమే కాబట్టి. మొట్ట మొదటిగా 'స్త్రీలకు' గౌరవాన్ని ఇచ్చింది, స్త్రీలకు అధిక ప్రాధాన్యత ఇచ్చింది ఈ నేల మీద 'బౌద్ధం' మాత్రమే! బౌద్ధం స్త్రీలకు గౌరవాన్ని ఇవ్వడమే కాదు, స్త్రీలు కూడా అందుకు ప్రతిగా బౌద్ధాన్ని ఈ నేలమీద విశేషంగా ఆదరించారు.

**ఈ కర్మకారులు, రైతులు, మహిళలు ఇంతగా బౌద్ధాన్ని ఆదరించడానికి కారణం మనది ప్రధానంగా వ్యవసాయ దేశం కావడమే. భరతఖండంలో ఇబ్బడి ముబ్బడిగా ధాన్యరాశులెత్తిన నేల మనది. కృష్ణా, గోదావరి జీవ జలాలతో సశ్యశ్యామలమైన ప్రాంతం మనది.**

**బౌద్ధం స్త్రీ హృదయాల్లోకి ఎలా చొచ్చుకుపోతుందో వ్యవసాయ సమాజంలోకి కూడా అంతే వేగంగా చొచ్చుకు పోతుంది. ఎందుకంటే... ఈ రెండింటి స్వభావం 'హింసకు' వ్యతిరేకం కాబట్టే.**

**బౌద్ధాన్ని ఆదరించడంలో మహిళల ముందడుగు:**

శాతవాహన రాజుల్లో గౌతమీపుత్ర శాతకర్ణి బౌద్ధవ్యతిరేకి కాదుగానీ, బౌద్ధుడు మాత్రం కాదు. కానీ, ఆయన తల్లి గౌతమీ బాలశ్రీ బౌద్ధానికి వీరాభిమాని. ఆమె బౌద్ధాన్ని విశేషంగా ఆదరించింది. ఆమెను సంతృప్తి పరచడానికి ఆమె కొడుకు గౌతమీపుత్ర శాతకర్ణి గానీ, మనవడు పులోమావిగానీ బౌద్ధులకూ, బౌద్ధసంఘాలకూ దానాలు చేశారు.

ఆ తర్వాత వచ్చిన ఇక్ష్వాకుల కాలంలో బౌద్ధం ఈ నేలమీద పరిఢవిల్లింది. అయినా ఏ ఒక్క ఇక్ష్వాకరాజూ బౌద్ధాభిమానికాదు. అప్పుడు కూడా ఇక్ష్వాకు రాణులే 'పోటీపడి' బౌద్ధాన్ని ఆదరించారు.

వీరేకాదు, విష్ణుకుండిన రాజైన గోవిందవర్మ పట్టపురాణి మహాదేవి కూడా బౌద్ధారామాలు నిర్మించింది. మహాదేవి భర్త గోవిందవర్మ , మనుమడు 'విక్రమేంద్ర వర్మ'లు కూడా ఈమె వల్ల బౌద్ధాభిమానులుగా మారారు.

యుద్ధాలు జరిగే కాలంలో రాణులంతా బౌద్ధారామాలకు చేరి, బుద్ధ భగవానుణ్ణి ఆరాధించే వారు. 'అహింస' నెలకొనాలని ఆరాటపడేవారు. నెలకొల్పాలని వేడుకునేవారు.

స్త్రీ హృదయం.... ఖచ్చితంగా చెప్పాలంటే మాతృహృదయం - దయ, ప్రేమ, కరుణ, అహింసల్ని కోరుకుంటుంది. అది ఒక ప్రాకృతిక ధర్మం. మాతృత్వంలోని, మాతృ ధర్మంలోని గొప్పతనం . ఆ హృదయం వినాశనానికి దూరంగా ఉంటుంది. 'ఇది ఒక సృష్టి నిర్మాణ ప్రక్రియ'.

స్త్రీలు యుద్ధాలకు ఎంతగానో తల్లడిల్లిపోతారు. అధికారం కోసం 'విజయమో వీరస్వర్గమో' అనే పిచ్చి భ్రమల్లో పడి విలువైన ప్రాణాల్ని పణంగా పెట్టిన భర్తలు, కొడుకులు, తండ్రులు... వీరందర్ని కోల్పోయినప్పుడు స్త్రీలు ఎంతో వేదన అనుభవిస్తారు. వారు ఎందుకు

'అహింసను' ఆరాధిస్తారో – మనం పైన చెప్పుకున్న విషయాన్నే కాదు, మహాభారతంలోని శాంతి, స్త్రీ పర్వాలు చూసినా అర్థం అవుతుంది.

అందుకే... మన తెలుగు నేలమీద కూడా రాజులకంటే రాణులే బౌద్ధాన్ని ఎంతగానో ఆదరించారు. అంటే... బౌద్ధాన్ని ఆదరించడంలో మన తెలుగు నేలమీద స్త్రీల పాత్రే ప్రధానమైంది అన్నమాట.

నిజానికి రాజులు బౌద్ధానికి దూరంగా ఉన్నారు. తమ ఆశలకు, దురాశలకూ, వికృత క్రీడలకూ, రాజ్య ఆక్రమణ పేరుతో జరిగే నరమేధానికీ 'వంత'పాడని, ఒప్పుకోని బౌద్ధాన్ని దూరంగానే ఉంచారు. తమ హింసా ప్రవృత్తికి 'చేదోడు వాదోడు'గా నిలిచే మత ధర్మాన్నే నెత్తికెత్తుకున్నారు. పెంచి పోషించారు.

అయినా, అశేష తెలుగు జాతి మీద బౌద్ధ ప్రభావం ఇంతగా ఎందుకుంది? – అంటే....

ఆనాటి చిన్నా చితకా వ్యాపారులు, సంపదలో రాజులతో సరితూగగల ధనిక శ్రేష్ఠులు, వ్యవసాయదారులు, రైతులు, చేతివృత్తులవారు, ముఖ్యంగా మహిళలు బౌద్ధాన్ని విశేషంగా ఆదరించారు. వీరంతా ఎన్నెన్నో దానాలు చేసి ఆరామాల్ని నిర్మించారు. పోషించి బ్రతికించారు. చివరికి, ఆ రోజుల్లో వైదిక మతం తన దరికి రాకుండా దూరంగా నెట్టేసిన అంటరానివారుసైతం ఈ ఆరామాల్ని పోషించారు. ఎన్నో శాసనాలు ఈ విషయాల్ని ఋజువు చేస్తున్నాయి.

అంటే...బౌద్ధం ప్రజా మతంగా అలరారిందన్నమాట. వీరంతా బౌద్ధాన్ని ఒక 'అతీత శక్తి' గల మతంగా కాకుండా – తమ జీవితానికి సరిపోయే జీవన విధానంగానే భావించారు.

ఈ కర్మకారులు, రైతులు, మహిళలు ఇంతగా బౌద్ధాన్ని ఆదరించడానికి కారణం మనది ప్రధానంగా వ్యవసాయ దేశం కావడమే. భరతఖండంలో ఇబ్బడి ముబ్బడిగా ధాన్యరాశులెత్తిన నేల మనది. కృష్ణా, గోదావరి జీవ జలాలతో సశ్యశ్యామలమైన ప్రాంతం మనది.

బౌద్ధం స్త్రీ హృదయాల్లోకి ఎలా చొచ్చుకుపోతుందో వ్యవసాయ సమాజంలోకి కూడా అంతే వేగంగా చొచ్చుకు పోతుంది.

ఎందుకంటే... ఈ రెండింటి స్వభావం 'హింసకు' వ్యతిరేకం కాబట్టే.

**మూలవాసుల జీవన విధానం:**

భారతదేశంలో మూలవాసుల ప్రధాన జీవన విధానం వ్యవసాయం. ఇక్కడి నేలతీరు, ఋతుపవనాలు, జీవనదులు ఇక్కడి మూలవాసుల్ని వ్యవసాయదారులుగా మలచాయి. వ్యవసాయంలో అధిక శ్రమ ఉంటుంది. ఋతువుల ప్రభావం ఉంటుంది. నిరీక్షణ ఉంటుంది. ఆటు పోట్లు ఉంటాయి. అది నెలల తరబడి సాగే ఒక నిలకడైన ప్రక్రియ. అంటే వ్యవసాయంలో శ్రమ, ఓర్పు ఈ రెండూ ప్రధానంగా ఉంటాయి. వీటికి తోడు వ్యవసాయం ఏ ఒక్క వ్యక్తో ఇతరుల సాయం లేకుండా వ్యక్తిగతంగా చేసేదికాదు. అది సమష్టి కృషి. కాబట్టి ఇచ్చిపుచ్చుకోవడాలూ, సర్దుబాట్లు చాలా అవసరం. ఈ ఓర్పు, సహనం, సర్దుబాట్లు – ఇవే వ్యవసాయ సమాజాల్ని నడిపిస్తాయి.

పైగా, వ్యవసాయంలో 'నేలకి' అంటే క్షేత్రానికి అధిక ప్రాధాన్యత ఉంటుంది. అంటే మానవుల్లో క్షేత్రానికి మారు రూపైన 'స్త్రీకి' ఎనలేని గౌరవం ఉంటుంది. అందుకే గాలి, వాన, అగ్ని లాంటి ప్రకృతి శక్తులు మగ దేవుళ్లే అయినా, భూమి మాత్రం దేవుడు కాలేదు. దేవతే అయ్యింది.

అందుకే వ్యవసాయ సమాజంలో పైన మనం చెప్పుకొన్న సహనం, సహకారాలతో పాటు స్త్రీకి కూడా తగిన గౌరవం ఉంటుంది. ఈనాటికీ మనం తొలకరిలో తొలిగా విత్తనాల్ని 'ఇంటి ఆడపిల్లలతోనే' నాటిస్తాం.

**పశుపాలక సమాజాల్లో జీవన విధానం:**

మరి పశుపాలకులైన, అభారతీయులైన ఆర్య సమాజాల్లో జీవనం సాఫీగా లేదు. ఉండదు. వారికి స్థిర నివాసం లేదు. కాబట్టి స్థిర బుద్ధీ రాదు. దేశ దిమ్మరులైన వారు, పశువుల్ని మేపుకుంటూ, వచ్చేదారిలో ఉన్న స్థానికులందరిలో తగవులు పడుతూ గడిపేవారు. గుర్రాలు, ఇనుప ఆయుధాలు వారిని అణకువకు దూరం చేశాయి.

వారి జీవనంలో స్త్రీలకంటే పురుషులకే అధికారం ఉంటుంది. అంతేగాదు. పశుపోషకులు క్షేత్రానికంటే బీజానికే అధిక ప్రాధాన్యతనిస్తారు. వారిది 'బీజ' ప్రాధాన్యమైన సంస్కృతి. (ఇప్పటికీ మనం పశువుల్లో ఉత్తమజాతి పశువులకోసం బీజకేంద్రాలకే పోతాం!)

అంటే... భారతీయ మూలవాసులది మాతృస్వామ్య సంస్కృతి, క్షేత్ర ప్రాధాన్యమైన వ్యవసాయ సంస్కృతి. కాగా, అభారతీయులైన ఆర్యులది దేశ దిమ్మర, బీజ ప్రాధాన్యమైన పశుపోషణ సంస్కృతి. అందుకే ఆర్య సంస్కృతి వచ్చాకే మగదేవతలు, పురుషులకు అధికారాలు వచ్చిపడ్డాయి. యుద్ధాలు, హింసలూ ఆర్యసంస్కృతిలో సర్వసాధారణం. తన్నుకోవడం, తాగడం, తందనాలాడడం, ఆక్రమించుకోవడం వీరి నిత్యకృత్యాలు.

ఏదేమైనా, మేలైన విధానమే గెలుస్తుంది అని గతంలో చదివాం. ఇక్కడా అదే జరిగింది. మూల భారతీయుల్ని యుద్ధాల్లో ఓడించిన ఆర్యులు... చివరికి తమ 'దేశదిమ్మరితనాన్ని' ఒదులుకొని, మూలవాసుల వ్యవసాయాన్నే ఎంచుకొన్నారు.

ఇది మూలవాసుల సాంస్కృతిక విజయం.

అటవిక సంస్కృతిపై నాగరిక సంస్కృతి సాధించిన గెలుపు.

ఐతే, ఆర్యుల జీవన విధానంలో ఓ నూతన దృక్పథం పుట్టు కొచ్చినప్పటికీ... వ్యవసాయ సమాజాల అభివృద్ధికి, ఆర్యుల ధార్మిక విధానాలు పెద్ద అవరోధం అయ్యాయి.– అవే యజ్ఞాలు, యాగాలు.

**వ్యవసాయంలో జంతువుల పాత్ర:**

ఆర్యుల జీవనంలో జంతు బలులు అనివార్యమే అయినప్పటికీ, వ్యవసాయ సమాజాల్లో వ్యవసాయాభివృద్ధికి జంతువులు ముఖ్యంగా ఎద్దులు, గుర్రాలు విశేషంగా ఉపయోగ పడతాయి. చివరికి వ్యవసాయ ఉత్పత్తులకు ఈ జంతువులే గొప్ప వనరులయ్యాయి. నాగలి లేని వ్యవసాయం పోడు వ్యవసాయం. కానీ, విశాలమైన మైదానాల్లో, నదుల పరిసర ప్రాంతాల్లో జరిగే వ్యవసాయానికి నాగలికి మించిన పరికరం మరొకటి లేదు. ఎద్దులు, గుర్రాలు లాగకుండా నాగలితో వ్యవసాయమూ సాధ్యంకాదు. డీజిల్ లేకుండా ట్రాక్టర్లు తిరగలేవుకదా! అలాగే ఎద్దులు, గుర్రాలు లేకుండా నాగళ్ళు కదలలేవు. పశు బలాన్ని యాంత్రిక బలంగా

మార్చడంతో వ్యవసాయోత్పత్తి విపరీతంగా పెరిగింది.

ఇలా, వ్యవసాయ ఉత్పత్తుల్లో నాగలిని కనిపెట్టాక దాన్ని లాగడానికి ఎద్దుల్ని ఉపయోగించాక... ఎద్దులు, ఆవులు వ్యవసాయ కుటుంబాలకు ఏకైక దిక్కు అయ్యాయి. అన్నం పెట్టే జీవనాధారం అయ్యాయి.

మరి, ఇలాంటి 'పశువుల్ని' యజ్ఞం పేరుతో చంపి తింటుంటే... చివరికి వ్యవసాయమే కుంటుబడి ,జీవనాధారమే పోతుంది. ఆహార నిల్వలు అంతరించిపోతాయి. సమాజం సంక్షోభంలో పడిపోతుంది.

అందుకే.. భారతీయ, అభారతీయ (అనార్య, ఆర్య) సంస్కృతులు తీవ్రంగా సంఘర్షించుకున్నాయి.– ఈ సంఘర్షణలో వ్యవసాయదారుల పక్షం వహించింది బౌద్ధం. యజ్ఞాల్ని తీవ్రంగా వ్యతిరేకించింది. యజ్ఞయాగాల్ని రూపుమాపడానికి బౌద్ధం గొప్ప ఉద్యమంగా సాగింది.

**యజ్ఞాల్ని బుద్ధుడు ఒక్కడే వ్యతిరేకించాడా?**

ఈ ప్రశ్న చాలా మంచి ప్రశ్న. చాలా మంది వేసే ప్రశ్న. బుద్ధుడే కాదు,బుద్ధుని కాలంలో ఉన్న జైనులు, అసితకేశ కంబలుడు, ప్రకృత కాత్యాయనుడు, చార్వాకుడు, మక్కలిగోసాలుడు, సంజయ వేలట్ఠిపుత్రుడు, చివరికి ఉపనిషత్తుకారులు కూడా యజ్ఞాల్ని వ్యతిరేకించినవారే. వీరంతా యజ్ఞం వల్ల 'పుణ్యం' రాదని ప్రబోధించారు. అయితే, వీరందరూ ప్రబోధాల దగ్గరే నిలిచిపోతే, బుద్ధుడొక్కడే... కార్యాచరణకు దిగి, ఎన్నో యజ్ఞాల్ని ఆపేయించాడు. యజ్ఞం జరిగే చోటుకు వెళ్ళి, వారికి నచ్చచెప్పి, యజ్ఞాలు విరమించేలా చేశాడు.

ఇలా యజ్ఞాల్ని ఆపేయించిన సంఘటనలు బౌద్ధసాహిత్యంలో ఎన్నో ఉన్నాయి. కోసల సంయుత్తంలో కోసలరాజుచేత, అంగుత్తర నికాయంలోని సుత్తనిపాతలో ఉగ్గత శరీరుని చేత, సుత్తనిపాతంలో బ్రాహ్మణధమ్మిక సూత్తంలో మరొకని చేత, దీఘనికాయంలోని కూటదంతసుత్తంలో కూటదంతునిచేత యజ్ఞాలు మాన్పించిన సంఘటనలు ఉన్నాయి. ఇక్కడ చెప్పిన ప్రతి యజ్ఞంలో 3వేలపైచిలుకు జంతువుల్ని బలివ్వడానికి సిద్ధపడినవే.

తాము నిర్వహించే యజ్ఞాల కోసం ప్రతి గ్రామం నుండి ఇన్నేసి జంతువులను ఇవ్వాలని రాజులు హుకుం జారీ చేసేవారు. జనం నిరాకరిస్తే... సైనికులు రైతుల ఇళ్ళమీద పడి బలవంతంగా జంతువుల్ని (ఆవుల్ని,ఎద్దుల్ని) లాక్కుపోయి, యజ్ఞ బలిగా వధించేవారు.

బుద్ధుడు తన జీవితంలో నిరంతరం వైదిక కర్మకాండల్ని వ్యతిరేకిస్తూ తిరిగాడు. అందుకే....బౌద్ధం వ్యవసాయ వర్గాలకి, మిగిలిన సాధారణ ప్రజానీకానికీ అంత తొందరగా అందింది. వ్యవసాయాభివృద్ధికి అత్యంత ఆవశ్యకమైన గోవధ మీద మొదటిగా నిషేధం విధించినవారు బౌద్ధులే! వారు ఆవుల్నేకాదు. గేదెలు, గుర్రాలు లాంటి పశువుల్ని కూడా వధించవద్దనే చెప్పారు. జంతుసంపద వ్యవసాయానికి ఎంత అవసరమో చెప్పే ఒక గాథని (శ్లోకాన్ని) చూద్దాం:

***యధా మాతా పితా భాతా అఞ్ఞే వాపి చ ఞాతకా***
***గావో నో పరమా మిత్తా యాసు జాయంతి ఓ సధా***
***అన్నదా బలదా చేతా వణ్ణదా సుఖదా తధా***
***పీతమత్థవసం ఞత్వా నాస్సుగావో హనింసుతే...***

(సుత్తనిపాతంలోని బ్రాహ్మణ ధమ్మిక సుత్తంనుండి)

అంటే...

" తల్లిదండ్రుల్లా, అన్నదమ్ముల్లా, ఇతర బంధుమిత్రుల్లా గోసంపదకూడా మాకు ఎంతో ఇష్టమైనది. మా వ్యవసాయానికి మూలాధారం అవే. మాకు అన్నాన్ని, బలాన్ని, కాంతిని, సుఖాన్ని, ఇచ్చే దాతలు అవే. ఇది తెలిసిన పండితులు గోవధ చేయరు...' అని.

ఇలాంటి గాధలు బౌద్ధసాహిత్యంలో చాలా ఉన్నాయి.

వ్యవసాయ సమాజాలకి బౌద్ధం గొప్ప ఊతం ఇచ్చింది.

అందుకే.....

ఆ సమాజాలు కూడా బౌద్ధానికి ఊతంగానే నిలిచాయి.

**నూతన పంటలు– వంటకాలు:**

వ్యవసాయ ఆధార పంటల వ్యాప్తికి బౌద్ధులు ప్రవేశపెట్టిన కొత్త కొత్త ఆహార పదార్థాల తయారీ కూడా గొప్ప సహాయం చేసింది.

బుద్ధుని కాలంవరకూ... చరిత్రలో మనకందిన సమాచారం మేరకు మన దేశంలో శాకాహార వంటకాలు అంతగా లేవు. బూరెలు, అరిశెలు, బెల్లంరొట్టెలు లాంటి బెల్లం వంటకాలు; పంచదారతో చేసే పాయసాలు పరమాన్నాలు; గారెలు, జంతికలు లాంటి కారం పదార్థాలు – ఇలా వివిధ శాకాహార వంటకాల్ని బౌద్ధులు విరివిగా ప్రచారం చేశారు. మాంసానికి మారుగా (మాంసం మానండి అని నిషేధం విధించకుండానే) రుచికరమైన శాకాహార వంటకాలకి శ్రీకారం చుట్టారు. అర్చన, నివేదనల్లో, దేవతలకు 'జీవుల బలి'కి బదులుగా ఈ పదార్థాల్ని సమర్పించమని సాక్షాత్తు అశోకుడే శాసనాలు వేయించాడు. శాసనాల్లోనే కాదు, బౌద్ధ జాతక కథల్లో వీటి ప్రాముఖ్యతని చెప్పే కథలు కూడా కొన్ని ఉన్నాయి. బెల్లం, పంచదార, పిండి మిల్లుల ప్రస్థావన కూడా ఉంది.

అప్పటి వరకూ ఉన్న అపరాలు, జొన్నలు,సజ్జలు లాంటి మెట్ట పంటలతో పాటు వరి(శాలి)ధాన్యాన్ని ప్రధాన ఆహారంగా మలచడంలో బౌద్ధం పాత్ర విశేషమైంది. పాతర్లలో నిలువ ఉంచిన వరి ధాన్యం రుచికి, ఆరోగ్యానికి మంచిదని చెప్పే సంఘటనలు జాతక కథల్లో ఎన్నెన్నో. మూడు సంవత్సరాలు నిలువ ఉంచిన శాలి ధాన్యంతో వండిన అన్నం రుచి,సువాసనల గురించిన వర్ణనలు కోకొల్లలు.

ఇలా– అన్ని రకాలుగా వ్యవసాయ పంటలు పెంచడానికి, వ్యవసాయాభివృద్ధికి బౌద్ధం పెద్దపీట వేసింది

**రాజు చేయాల్సిన యజ్ఞాలు:**

యజ్ఞాలు చేసి, జంతుబలులిస్తే దేవతలు కరుణిస్తారని, కరువులు పోతాయని' యుద్ధాల్లో విజయం వరిస్తుందని,రాజులూ,బ్రాహ్మణులూ ప్రజలకు చెప్పేవారు. ఇలా చెప్పి యజ్ఞానికి సిద్ధమైన కూటదంతునితో యజ్ఞం ఆపేయిస్తాడు బుద్ధుడు. ఈ సమయంలో కూటదంతునితో మహావిజితుడు అనే రాజు కథ చెప్తాడు. ఈ కథలో.....

"... రాజా! రాజ్యం సుభిక్షంగా ఉండాలంటే రాజు ఈ విధంగా చేయాలి. ముందు రైతులు క్షేమం చూడాలి. వారికి అన్ని రకాల

సదుపాయాలూ కల్పించాలి. నీటివసతి ఏర్పాటు చేయాలి. అందుకోసం కాల్వలు తవ్వాలి. చెరువులు తీయాలి. రైతుల్ని ఋణవిముక్తుల్ని చేయాలి. వారికి కష్టకాలంలో ఉచితంగా విత్తనాలు అందించాలి. అలాగే వ్యాపారులకి తగినంత ఆర్థిక సాయం చేసి, వ్యాపార వృద్ధికి తోడ్పడాలి. తగిన రహదారులు వేయించాలి. ఉద్యోగులకు నెలనెలా సక్రమంగా జీతాలివ్వాలి. అప్పుడే వారు తమతమ పనులు చక్కగా నిర్వర్తించగలరు. – ఇలా చేస్తే రాజ్యం సుసంపన్నమవుతుంది. మీ కోశాగారానికీ తగినంత ఆదాయం వస్తుంది, అంతేకానీ యజ్ఞయాగాలు చేస్తే, జంతువుల ప్రాణాలు తీస్తే, యాగాల పేరుతో వేలాది చెట్లను తెగ నరికితే... ప్రజాక్షేమం రాదు" –

ఇలాంటి సందేశాలు ఇంకా కొన్ని చోట్ల ఉన్నాయి.

అంటే... బౌద్ధం ఎటునుంచి చూసినా వ్యవసాయ సమాజ వికాసానికి ఎంతగా తోడ్పడిందో, వ్యవసాయ సమాజానికి వెన్నుదన్నుగా ఎలా నిలిచిందో అర్థం చేసుకోవచ్చు. 'తాను ఒక తాత్త్విక, ధార్మిక రైతునని, తాను చేసేది ధార్మిక సేద్యమని' బుద్ధుడే చెప్పుకున్నాడు.

**తెలుగునేలే ఒక ధాన్యపు కొట్టం:**

వ్యవసాయ కుటుంబాలు బౌద్ధాన్ని ఇంత విశేషంగా ఆదరించాయంటే.... ఇందుకే...! కేవలం వ్యవసాయం మీద జీవించే తెలుగు సమాజం, కృష్ణ, గోదావరి ప్రాంతంలోని రైతులు, శ్రామికులు, చేతివృత్తులవారు, వ్యాపారులు బౌద్ధాన్ని ఆదరించకుండా, అనుసరించకుండా ఎలా ఉండగలరు?

తెలుగునేలమీద బౌద్ధవ్యాప్తికి మన వ్యావసాయిక జీవనం ఒక ప్రధాన కారణం.

దీనికి తగిన చారిత్రక ఆనవాళ్ళు కూడా ఉన్నాయి. ముఖ్యంగా కృష్ణానదీ తీరంలో ఉన్న ఆంధ్రనగరి– అంటే ఈ నాటి అమరావతి. దీనికి ధాన్యకటకం అనే పేరుంది కదా! అంటే... 'ధాన్యం కొట్టు' అని, ధాన్యాగారం అని. విశేష మేమంటే ఆ రోజుల్లో బౌద్ధం ఈ నేలమీద పరిఢవిల్లిన రోజుల్లో అమరావతి, ఆదుర్రు, మోటుపల్లి రేవులనుండి భారతదేశంలోని ఇతర ప్రాంతాలకే కాకుండా, తూర్పు ఆసియాలో దాదాపుగా అన్ని దేశాలకూ, ధాన్యం ఎగుమతి పెద్ద ఎత్తున జరిగేది. దీనికి కారణం కూడా బౌద్ధమే! ఈ తూర్పు ఆసియా దేశాలన్నింటిలో బౌద్ధ ధర్మం ఉంది. పైగా అమరావతి మహాయాన బౌద్ధంలో అతి ముఖ్యమైన పవిత్ర నగరం – మహాయాన సంప్రదాయానికి పుట్టినిల్లు. కాబట్టి తూర్పు ఆసియా దేశాలన్నింటిలో వర్ధిల్లిన మహాయాన సంప్రదాయం, తెలుగువారి వ్యాపారాభివృద్ధికి కూడా ఒక కారణం అయ్యింది.

ఆయా ప్రాంతాల నుండి నూతన వంగడాలు రావడానికి మార్గం కూడా అయ్యింది.

అందుకే... గలగల పారుతూ పరుగులు తీసే కృష్ణా– గోదావరి తీరాలలోని జొన్న పొత్తులు, చెరకు మొవ్వలు, వరి కంకులు తలలు వంచి తథాగతునికి నమస్కరించాయి. ఈ నదీ తీరాల రేవులు బౌద్ధ ధర్మానికి రాదారులయ్యాయి.

**రచయిత ఫోన్ : 9390600157**

## సవరణ

*అమ్మనుడి జూలై సంచిక 17వ పుటలో తెలుగమ్మ ఒడిలో బౌద్ధం–5 లో – రెండు పేరాల్లోని మరింత విషయస్పష్టతకోసం వాటిని ఈ కింది విధంగా సవరించి చదువుకోవలసిందిగా కోరుతున్నాము. చదువరులకు ఇబ్బంది కలిగించినందుకు మన్నించగోరుతున్నాము.*
*– సం॥*

1. బౌద్ధం స్త్రీ అణచివేతను అంగీకరించదు. తెలుగునాట పురుషాధిపత్యమే ఉన్నప్పటికీ, ఉత్తర భారతదేశంలో వలే స్త్రీలపై అణచివేత ఉండదు. ముఖ్యంగా ఆర్యీకరించబడిన ఒకటి , రెండు అగ్ర కులాల్లో తప్పితే, మిగిలిన అశేష శూద్ర, అంటరాని కులాల్లో, స్త్రీ అణచివేత అంతగా కన్పించదు. పురుషులతోపాటు 'పనీ పాటు'ల్లో స్త్రీల భాగస్వామ్యం కూడా గణనీయంగా ఉంటుంది. అంటే ఉత్పత్తిలో స్త్రీలు కూడా భాగస్వాములే. బ్రాహ్మణీకరణం చెందిన అగ్ర కులాల్లో తప్ప స్త్రీని నీచ బానిసగా చూసే నీచ సంప్రదాయం దిగువ కులాల్లో లేదు. పైగా, ఆడవారికి ఉన్నన్ని 'నిత్య జీవిత' వేడుకలు,(జాత కర్మలు) మరెక్కడా లేవు. ఆడవారికి జరిగే 'రజస్వల'(బంతి), వివాహం, సీమంతం (సూడిదలు) , బారసాల ,(వాయనాలు) ఇంకా అట్లతద్ది ఇలాంటి ఉత్సవాలు, వీటిలో ఎక్కడా 'హింసా' పూరిత విధానం కనిపించదు.

2. అలాగే.. కుల రాహిత్య భావం గురించి. తెలుగు నాట అంటరానితనం ఉన్నా– గ్రామాల్లో బ్రాహ్మణిజాన్ని భుజానకెత్తుకున్న అగ్ర కులాల్లో తప్ప శూద్ర, అంటరాని కులాల వారి మధ్య 'అక్కా! బావా! అన్నా! వదినా! మామా!" అంటూ వరసలు పెట్టుకుని పిలుచుకునే ఒక సుహృద్భావ వాతావరణం ఉంది. ఇది– వైదిక మతం సృష్టించిన 'కులం' మీద బౌద్ధ భావజాల ప్రభావమే! అయితే ఇటీవల బ్రాహ్మణిజం తన ధోరణి కాస్త మార్చుకుని, శూద్రజాతుల్లో పై మెట్టు ఉన్నవారిలోకి చొరబడింది. మనువాద భావజాలానికి శూద్రులే గట్టి కాపలాదారులుగా భావించి తన వికృతదృష్టి వారిమీద పెట్టింది. ఈ వికృత క్రీడ నుండి తప్పుకోవాలంటే బౌద్ధం ప్రబోధించిన మానవీయ దృక్పథాన్ని పెంపొందించుకోవాల్సిందే!.

- శ్రీమతి డి.పి. అనూరాధ

# తొలి అజంతా చిత్రం మనదే

అజంతా... ఈ పేరు వినని భారతీయులు ఉండరు... ఈ చిత్రానికి తలవంచని కళాకారుడు ఉండడు... ప్రపంచంలో ప్రఖ్యాత పెయింటింగ్‌లుగా నిలచిన వీటి వయసు నేటికి అక్షరాలా రెండు వేల రెండు వందల సంవత్సరాలు...

ఏన్షియంట్ ఆర్ట్ అయినా... మోడర్న్ ఆర్ట్ అయినా... ఎక్స్‌ప్రెషన్లో తేడా ఉండొచ్చు... కాన్వాస్లో తేడా ఉండొచ్చు... సబ్జెక్టులో తేడా ఉండొచ్చు... కష్టంలో తేడా ఉండొచ్చు... కానీ ఫీలింగ్స్ మాత్రం ఒకటే... కళాకారుడి శ్రద్ధ మాత్రం ఒకటే.. కానీ అజంతా పెయింటింగ్స్‌లో వీటన్నిటికి మించింది ఏదో ఉంది... అదేమిటి? అసలు ఈ కళాకారులు ఎవరు? వాళ్లకీ మన తెలుగు నేలతో ఏమిటి సంబంధం? అజంతాలో పెయింటింగ్స్ ప్రాణం పోసింది మనం... చిత్రకళలో ఓ నూతన ఒరవడి సృష్టించి భరతజాతికే మార్గనిర్దేశం చేసింది మనం.... మైఖేలాంజెలోలా... పికాసోలా మన వాళ్ల పెద్ద పెద్ద పేర్లు బయటపడకపోవచ్చు..

కానీ మన అజంతా చిత్రకళ మాట్లాడుతోంది... నిజాలు చెబుతోంది...

అజంతా పెయింటింగ్స్‌కు అంకురార్పణ చేసింది మన తెలుగు వాళ్లు అనడానికి నాలుగు గట్టి సాక్ష్యాలు...

1) సహ్యాద్రి పర్వతాల్లోని ఈ కొండగుహలను శాతవాహనుల కాలంలో తొలచారు... ప్రపంచంలో మరెక్కడా లేని రాక్ కట్ ఆర్కిటెక్చర్‌లో శాతవాహనులది అందెవేసిన చేయి.

2) మొత్తం 29 దాకా ఉన్న రాతి గుహల్లో 9, 10 గుహలు అత్యంత పురాతనమైనవని పురావస్తు శాఖ తేల్చేసింది.

3) శాతవాహనులు బౌద్ధానికి ఎంతో ప్రాధాన్యం ఇచ్చారు. బౌద్ధగురువులనూ పోషించారు.





4) 9, 10 గుహల్లో పెయింటింగ్స్ అమరావతిలోని శిల్పంతో పోలి ఉండడం విశేషం... ఇక్కడి గుహల వెలుపల ఉన్న శిల్పాలు అమరావతి శిల్పానికి ప్రతిరూపాలే...

బౌద్ధం అద్భుతమైన అమరావతి శిల్పానికి ఎలా ఊపిరిలూదిందో అలాగే అజంతా చిత్రాలకు కూడా ప్రాణం పోసింది...

బౌద్ధానికి దేశమంతా దాసోహమంటున్న కాలం అది... వర్షాకాలంలో తలదాచుకోవడానికి రాళ్లను తొలచి గుహలు నిర్మించడం మొదలుపెట్టారు బౌద్ధభిక్షువులు... క్రమంగా ఈ గుహలే చైత్యగృహాలు అయ్యాయి... మరికొన్ని విహారాలు అయ్యాయి... చైత్యగృహంలో బుద్ధుడి స్థూపమే ప్రధాన ఆకర్షణ...

గోడలను బోసిగా విడిచిపెట్టకుండా బొమ్మలను చిత్రించడం మొదలుపెట్టారు. భిక్షువులకు తెలిసిన జాతక కథలే ప్రధానాంశం అయింది... అలా రూపుదిద్దుకున్నవే విశ్వవిఖ్యాతి చెందిన అజంతా పెయింటింగ్స్...

అజంతా చిత్రంలోని ప్రతి బొమ్మా ఏదో ఒకటి చెబుతూనే ఉంటుంది. ఆ బొమ్మ మనిషికి సంబంధించింది కావచ్చు.. జంతువే కావచ్చు... లేకపోతే చెట్లు, లతలే కావచ్చు... ప్రతిదాంట్లో ప్రాణం ఉన్నట్టు... చేతనత్వంతో ఉన్నట్టుగా కన్పిస్తుంది. వాస్తవానికి ఈ కళాకారులందరూ సమాజాన్ని పరిత్యాగం చేసి... బౌద్ధం స్వీకరించినవారు... కానీ వీరి చిత్రకళలో లౌకికమైనవీ ఉండడం విశేషం...

సమాజం నుంచి దూరంగా వెళ్లారు కానీ, తమ హృదయంలో గూడుకట్టుకునిఉన్న సమాజ రూపురేఖల్ని విడిచిపెట్టలేదు... అందుకే ఈ చిత్రాల్లో పద్మపాణి ఎంత అందంగా ఉంటాడో... రాజదంపతులు

కూడా అంతే అందంగా ఉంటారు.. వారి పరిచారికలు కూడా అలాగే ఉంటారు.

అందుకే ఈ అజంతా పెయింటింగ్స్ అజరామరం అయ్యాయి... సుమారు 900 ఏళ్ల చిత్రలేఖనం...

శాతవాహనుల తరువాత... వాకాటకులు.. బాదామి చాళుక్యుల కాలంలో అజంతా చిత్రాలు రూపుదిద్దుకున్నాయి... క్రీస్తు పూర్వం 2వ శతాబ్ది నుంచి క్రీస్తు శకం 7వ శతాబ్ది వరకూ ఇక్కడ చిత్రలేఖనం జరుగుతూనే ఉంది... ఈ కొండలు సామాన్యమైనవికావు... రంగు రంగుల రాళ్లు ఇక్కడ సమృద్ధిగా దొరుకుతాయి... వీటిని మెత్తగా పొడిగా చేసి చెట్ల జిగురును కలిపి అనేక రంగుల పెయింట్లను తయారు చేశారు.

ముందుగా గోడలను నున్నగా చేసి సున్నం, పేడ, బెల్లం పాకం లేదా కోడిగుడ్డు సొన కలిపిన మిశ్రమాన్ని అద్ది, ఆరిన తరువాత స్కెచ్‌లు వేసుకుని, రంగులు వేసి ఉండవచ్చు... అజంతాలో సుమారు 900 ఏళ్లు సాగిన చిత్రలేఖనంలో ఓ క్రమపద్ధతి కనిపిస్తుంది. అలాగే గుహలోని చిత్రాలకు మరొక గుహలోని చిత్రాలతో సంబంధం ఉన్నట్టు అనిపిస్తుంది. పదో గుహలోని బోధిసత్వ వృక్ష పూ చిత్రానికి మొదటి గుహలోని బోధిసత్వ పద్మపాణి చిత్రాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ విషయం స్పష్టం అవుతుంది...

తొమ్మిది, పది సంఖ్యల గుహల్లోని ఎడమవైపు గోడల మీద వేసిన పెయింటింగ్స్ క్రీస్తు పూర్వం చివరి రెండు శతాబ్దాలవి... భారతీయ వర్ణ చిత్రాలలో ఇవే అతి పురాతనమైనవి... పదో గుహలో చిత్ర వస్తువు ఓ బౌద్ధగాథ... ఎడమ పక్క ఒక రాజు సపరివారుడై బోధివృక్షాన్ని పూజిస్తున్నాడు... కుడిపక్కన పదిహేను మందితో ఉన్న నాట్యమేళం ఉంది... రెండు చిత్రాలలోనూ ఇహపరాలు రెండూ ఉన్నాయి... ఆవేశం... సాధుత్వం వంటి భిన్నమైన అంశాలను ఒకేసమయంలో చూపించడం మేధావులు ఆనాటి చిత్రకారులు....

ఈ గుహలోనే కుడివైపు గోడమీద షడ్దంత జాతకాన్ని చిత్రించారు... ఇది క్రీస్తు శకం రెండో శతాబ్దికి చెందిందని కళాకారుల అభిప్రాయం... ఇది కూడా తెలుగు వారిదే అని చెప్పవచ్చు... బోధివృక్ష పూజలోనూ, షడ్దంత జాతక చిత్రంలోనూ ప్రదర్శితమైంది థేరవాద బౌద్ధమే... ఈ చిత్రాల్లోని వ్యక్తులు శక, ద్రావిడ ముఖాకృతులు, వైఖరులు ఒకటే... అంతేకాకుండా రెండిట్లోనూ వాడిన రంగులుకూడా ఒకటే కావడం విశేషం... షడ్దంత జాతక కథ చిత్రాలకు అమరావతి శిల్పాలకు సాదృశ్యం అద్భుతంగా ఉన్నట్టు ప్రముఖ ఆర్కియాలజిస్టు యజ్దానీ ఎప్పుడో సిద్ధాంతీకరించారు.

**చీకటియుగం:**

చిత్రకళ శిల్పకళలా చిరంజీవి కాదు... చిత్రకళకు ప్రధాన శత్రువు సూర్యరశ్మి... ఈ విషయం తెలిసే మన పూర్వీకులు చీకటి గుహలలో వర్ణచిత్రాలను వేసి, ముందు తరాల వారి కోసం భద్రపరచారు... అజంతాగా చిత్రాలు నిజంగానే చీకటిలో మగ్గిపోయాయి... 1819 వరకూ అజంతా గురించి ఆధునిక ప్రపంచానికి ఏమీ తెలియదు... కాలం దుప్పటిని కప్పుకుని వెయ్యేళ్ల పాటు అజంతా చిత్రాలు ఎందుకు ఉండిపోయాయి? క్రీస్తు శకం 7వ శతాబ్ది నుంచి బౌద్ధం భారతదేశం నుంచి దూరమైపోయింది... బౌద్ధ భిక్షువుల స్థావరంగా ఉన్న గుహలు క్రమంగా నిర్జీవంగా మారాయి... క్రమేపీ ఈ ప్రదేశం అంతా దట్టమైన అటవీ ప్రాంతంగా మారిపోయి... జనజీవనానికి దూరమైపోయింది.

1819లో ఆనాటి మద్రాస్ ప్రెసిడెన్సీకి చెందిన బ్రిటీష్ ఆఫీసర్ జాన్‌స్మిత్ పులిని వేటాడేందుకు ఇక్కడికి వచ్చి 10వ గుహ ముందు భాగాన్ని కనుగొన్నాడు... లోపల పెయింటింగ్స్‌ను చూసి ఆశ్చర్యపోయాడు... గోడమీద ఓ చోట తన పేరునూ వ్రాశాడు... ఈ పేరు ఇప్పటికీ అలాగే ఉంది... అడవుల్లో ఉన్న ఈ మిస్టీరియస్ ప్రదేశం అప్పట్లో పెద్ద చర్చనీయాంశంగా మారింది. అయితే అజంతా అద్భుతం అందరికీ దగ్గరయ్యేలా చేసిన వ్యక్తి హైదరాబాద్ నిజామ్ ఉస్మాన్ అలీ ఖాన్... అడవిలోని చెట్లనంతా కొట్టించేసి దారులు వేయించాడు... ఈనాటికీ ఇదే దారిని ఉపయోగించడం విశేషం... అంతేకాకుండా ప్రతి గుహలోని పెయింటింగ్స్‌కు నకళ్లను తయారుచేయించి పెట్టాడు... హైదరాబాదులోని స్టేట్ మ్యూజియంలో అజంతా గ్యాలరీలో ఈ పెయింటింగ్స్‌లో కొన్ని ప్రదర్శనలో ఉన్నాయి... నేడు అజంతాలో 9, 10 గుహల్లో అక్కడక్కడా రంగులు మాత్రమే కన్పిస్తాయి.. కానీ పూర్తి పెయింటింగ్స్ కన్పించవు... మరి కొన్ని సంవత్సరాలకు ఈ గోడలమీద పెయింటింగ్స్ ఉన్నాయంటే నమ్మలేని పరిస్థితి ఏర్పడుతుందేమో...

ఆనాడు అజంతా చిత్రకళ దేశదేశాలకూ పాకింది... శ్రీలంకలోని సిగిరియా కొండమీద కశ్యప మహారాజు రాణుల చిత్రాలపై మన తెలుగు చిత్రకళా ప్రభావం ఎంతగా పడిందో స్పష్టంగా తెలుస్తుంది.... ఇవి క్రీస్తుశకం 7వ శతాబ్దికి చెందినవి... ఆనాడు శ్రీలంకతో తెలుగు నేలకు ఎంతటి అనుబంధం ఉండేదో వేరే చెప్పక్కర్లేదు... తమిళనాడులోని సిత్తన్న వాశల్ గుహల్లో కూడా చిత్రకళ రూపుదిద్దుకుంది. ఇవి క్రీస్తు శకం 9వ శతాబ్దికి చెందడం గమనార్హం.

ఇంతటి గొప్ప కళకు అంకురార్పణ చేసిన చిత్రకారులు మన తెలుగు వాళ్లు కావడం మనకు గర్వకారణం.

కానీ నేడు అజంతా మహారాష్ట్రలో భాగం...

అమరావతి శిల్పం తరలిపోయింది...

నాగార్జునకొండ కృష్ణానీటిలో మునిగిపోయింది...

హంపి కర్ణాటకలో భాగమైపోయింది...

అజంతా పరుల సొత్తయిపోయింది...

అన్నిటికీ మించిన బాధాకరమైన విషయం... భారతదేశంలో వరల్డ్ హెరిటేజ్.

మాన్యుమెంట్స్ లిస్ట్‌లో మన తెలుగు రాష్ట్రాల స్థానం ఖాళీగా ఉండడం...

మన పూర్వీకులు ఎన్నిటికో శ్రీకారం చుట్టారు... 2 వేల ఏళ్లనాడే ఎన్నో జాతులకు ఎన్నో కళల్లో మార్గ నిర్దేశం చేశారు. తరువాతి తరాల వారం వారి ప్రతిభను పునికి పుచ్చుకోలేకపోయాం... ముందుకు తీసుకువెళ్లలేకపోయాం. ఇవన్నీ మా పూర్వీకుల ప్రతిభకు తార్కాణాలు అని ధైర్యంగా ఎలుగెత్తి చాటలేకపోతున్నాం. కనీసం మనసులోనైనా నివాళులు అర్పిద్దాం.

**రచయిత ఫోన్: 9010016555**

హిందూపురం కత

**‘ఇది** ఈనాటి కత గాదు. ఇంగెవరో సెప్పింది కూడ కాదు. శానాయేండ్లనాడు నాకండ్లముందరే జరిగిన కత.

అదేమంటే–

ఒకనాడు నేను ఎనుముగొడ్లు మేపేదానికి పొద్దున పోయినోడు బారెడు పొద్దున్నట్లే ఇంటిదావ పట్టితి.

ఇల్లు ఇంకా అర్ధామడ దూరంలో వున్నట్లే ముక్కులు అదిరిపొయ్యేటట్ల మసాలా శార వాసన నన్ను ఉక్కిరి బిక్కిర సేశ. నోట్లో నీళ్లు ఊరబట్టె. పండక్కో ఊరి ద్యావరకో అపురూపంగా గాని మా ఇంట్లో నంజిరి శార సేసెల్లేదు. అట్లాది ఉన్నట్లుండి తునకల శార సేసిండారంటే– ఏడిదో యిషేశముంటుంది అని అనుకొంటి. సేతిలోని బర్రపైకెత్తి జీవాల వీపుల మీద నాలుగు అంటిచ్చి బిరబిర్న ఇల్లుసేరుకొంటి. పశువుల్నంత గాటి దగ్గరికి తోలి తలుగులు మెడకాలయలకు తగిలిస్తి.

మామూలుగాఅయితే అంత పొద్దులో పొయ్యిలోకి కట్టెలు కొడుతూనో, కసువు సిమ్ముతూనో, వామిలో గడ్డిపీకుతూనో మా ఇంటి జనాలు కనిపిస్తా ఉండల్ల. ఆ పొద్దు ఒగ నరమానవుడు గూడ కనిపించకపోతే నాకి శానా యిసిత్రమనిపించె. ఆత్రమాత్రముగా మెదెడు సొప్పదంట్లు వామినుండి తీసి జీవాల ముందరేసి ఇంట్లోకి పరిగెత్తిపోతి.

ఇల్లంటే– అట్లా యిండ్లు ఈ కాలంలో యాడా లేవు!

సుట్టూరా టెంకాయగర్ల తడకలు, పైన ఏటవాలుగా అగిశ వాసాలు. వాటిమింద సెరకు సోగల కప్పడం. గాలికి వట్టిసోగ ఎగిరిపోకుండ పైన బరువులు. యండకాలంలో సల్లగ, సలికాలంలో యచ్చగా వుంటావుండె. ఆ కాలంలో యా ఊర్లో సూసినా మట్టిమిద్దెలు, ఇట్లా గుడిశలే ఉంటావుండె.

అట్లా మాగుడిశలోకి అడుగుపెడ్తానే ఎదురుగా ఒక పెద్దస్వామి పద్మాసనం మాదిరి కాళ్లు మడుసుకోని కూకోనుండె.

మూరెడు పొడవు గడ్డం మీసాలు. బారెడు పొడవు ఇరబోసుకోనుండే తలెంటికిలు. సగం తెల్లగ, సగం నల్లగ కలబరకమయ్యిండివి. వాట్ని సూస్తే నాకు కత్తాళి (కలబంద) నారు, పుండి (గోగు)నారు కలిపిపేనిన కపిలి మోకు గుర్తుకొచ్చె. యర్రగ నల్లనల్లగ మాసినట్లుండే అడ్డపంచె కట్టుకోనుండారు. శరీరం సూస్తే ఆముదం నూనెపూసి కాల్చిన వంకాయ మాదిరి నల్లగ నిగనిగ మెరుస్తావుండాది. ఆయప్ప కండ్లుమూసుకోని, గోనెసంచిమింద కూకోని ఏడిదేదిదో బోధన సేస్తావుండాడు.

మాయవ్వ, మాయమ్మ, మానాయన, నాతమ్ముడు... మాఇంట్లో వుండేవాళ్లంతా ఆయప్ప ముందర కూకోని ఊపిరి తీసేదీ ఇడిసేదీ మర్సి నోర్లు తెర్సుకోని ఇంటావుండారు.




మెల్లగా లోపలికి నడిసి, నాలుగు మాట్లు ఇంటిగాని – అవినాకేమీ అర్థంకాలేదు. తలకాయ గీరుకోని దిక్కులు సూస్తావుంటే మానాయన నన్ను సైగల్తోనే పిల్సి, సెవితాకి నోరుపెట్టి’ మన రెడ్డి స్వామిరా... శానాశానా తెల్సిన మాన్నభావుడు కాళ్లకి దండం పెట్టుకో మంచి జరుగుతుంది’ అని గుసగుస సెప్పె.

ఆ పనికే కాసుకోనున్నట్లు, స్వామి కాలి మడతల్చి పాదాలు నా ముందరికి సాపె. ఎర్రీబిర్రగ పెరిగిందే కాలిగోర్లు, అంగుళం మందం మురికిసేరి ఎండిన పేడ తట్టి మాదిరి ఉండే పాదాలు సూసి నాకు శానా అనహ్యామైపాయ. ఇదేందిరా దేవునట్లాస్వామంటారు దయ్యం కాళ్లమాదిరి వుండావి అనుకోని కండ్లు మూసుకోని మొక్కిన శాస్త్రంసేసి బయటికి పోతి.

నంజిరి శార మాత్రం గమగమా అని పరిమళిస్తా ముక్కులో దూర్తా వుంది.

ఆ కాలంలో మాంసం శార్లు ఇంట్లో సేస్తా వుండ్లేదు. మాంసం తినేది శడ్డపనిఅని శానా పాపకార్యమని ఇంటికి దూరంగా సేస్తావుండ్రి. శారసేసే మట్టి

కుండలు కూడా వేరేదానికి వాడ్తా వుండ్లేదు. అవెప్పుడు బయటే ఉంచుతావుండ్రి. తినేది అయ్యినంక తట్లనంతా వరికసుతో కాల్చి శుద్ధిసేసి, ఆవుపంచితం సల్లి యర్రమన్నుతో తోమి ఇంట్లోకి తెస్తావుండ్రి. మాంసం శారు తిన్న తట్టలోకి పాలుగాని, మజ్జిగగాని ఏస్తా వుండ్లేదు. శానా కట్టుదిట్టాల భయాలకాలమది!!

ఇంతకీ శారు సేసేకి యా కోడికోసిండారో సూస్తామని అనుకొంటి. అప్పటికే దూళిదూళి మబ్బయిపోయింది. పెద్దకోళ్లన్నీ ఇంటి ముందరుండే జాలిసెట్టు మింద కెగిరి కొమ్మలపైన సేరిండివి. పిల్లల కోళ్లనంతా దిడగల(గంప)కింద మూసి పెట్టిండారు.

మా ఇంట్లో ఇరవై ముప్పయికి పైగా కోళ్లుంటాయి. అన్ని కోళ్లూ ఒక ఎత్తయితే యర్రకోడిదే ఒక ఎత్తు. దాన్ని మేమంతా యర్రోడు అని ముద్దుగా పిలిస్తే, మా నాయన మాత్రం సిపాయిగారు అని పిలుస్తాడు. అది మాఇంట్లో పుట్టిందికాదు. మా ఇల్లుండేది ఊర్లో గూడా కాదు. ఏటి గట్లో మా సేన్లు, ఆ సేన్ల మధ్యనే ఇల్లు. మా ఇంటికి అర్ధమైలు దూరంలో ఆడాడ రవన్ని ఇండ్లుండాయి.

ఒగ దినం అదియాట్నుంచి ఎత్తుకోనొచ్చిందో ఏమో? గద్ద ఒక కోడిపిల్లని కాళ్లసందులో ఇరికిచ్చుకోని మా ఇంటి మిందనుంచి ఎగరిపోతావుంది. గోర్ల సందులో సిక్కుకోని సన్నపిల్ల కివ్‌కివ్ అని సావు అరుపులు అరుస్తావుంది. తప్పిచ్చుకోని ప్రాణాలు కాపాడుకొనేదానికి తనుకులాడ్తావుంది. దాని అరుపు విని మేమంతా గుడిశలోనుంచి బయటికొస్తిమి. ఆయ్... ఉయ్.... అని అర్చుకొంట, సేతులు పైకెత్తి అదిలిచ్చి గద్దని బెదిరిస్తిమి.

మా అరుపుల్కి గద్దే భయం పడిందో, మా మాటల్తో ధైర్యం తెచ్చుకోని కోడిపిల్లే గద్దగోర్లనుండి తప్పించుకొన్నో తెలీదుగాని, 'తప్'న కోడిపిల్ల కిందబడె. నేను సర్ర్‌న కోడిపిల్ల దగ్గరికి సేరి రెండు సేతుల్తోనా నలుక్కుండ పువ్వుని పట్టుకొన్నట్ల పట్టుకొంటి. కోడిపిల్లయితే పాపం అపుడో ఇపుడో ప్రాణాలు పొయ్యేదాని మాదిరి కివ్ కివ్ అని అరుస్తావుండాది. గడ గడ అదుర్తావుండాది. అది బతుకుతుందనే నమ్మకమే నాకుండ్లేదు.

అంతసేపటికి మాయవ్వ బిరుబిర్నొచ్చి దాని రెక్కల కింద, కాళ్లకింద తడిమి సూశ. పత్తిపోగుల మాదిరి వచ్చీరాని దాని ఈకల్ని పక్కకి జరిపి సూశ. ఉడుము ఏళ్ల మాదిరీ వుండే పాపిష్టి గద్దగోర్లు రెండు మూడు తావుల్లో కుచ్చుకోని రగతం కార్తావుంది. కుడికాలు ఇరిగి ఊగులాడ్తావుండె. వాటిని సూసి 'అయ్యో సన్నబిడ్డకి యంత కష్టమొచ్చింది' అని మాయవ్వ అంగలార్సుకొంట గాయాలకంతా యర్రమన్ను పూశ. ఇరిగిన కాల్ను నెట్టగా సేసియర్రమన్నుగుడ్డతో గట్టిగా కట్టుగట్టె.

అపుడు కోడిపిల్ల 'సిలసిల' అని సన్నగ గొంతులో శబ్దం సేసుకొంట— మా అవ్వ సేతుల్లే తల్లి రెక్కలనుకోని కండ్లు మూసుకోని కాసంతసేపు సగిచ్చినట్ల వాలిపాయ.

అంతసేపటికి ఇంట్లోకి పొయ్యి నేను కొర్రలు, జొన్న నూకలు తెస్తి. నా తమ్ముడు యామన్నయితే గుద్దల్ని తీసుకుపొయ్యి కాలువ గట్లో వుండే పుట్టను తవ్వి దోసిలినిండా సెదలు తీసుకొనొచ్చె. ఆయప్పకి ఏడెనిమిదేండ్లు. నాకంటె రెండేండ్లు సిన్నోడు. కోళ్లు, కుక్కలు, పిల్లులంటే ఆయప్పకి శానాశానా ఇష్టము. అవి యన్ని రకాలుగా శబ్దాలు సేస్తాయో. ఆ శబ్దాలకి అర్థాలేమో ఆయప్పకి బాగా తెల్సు. ఆయప్పని గురించి ఇంగొొగుసారి సెబుతాలెఇండి.

రవన్ని సెదలు, కాసన్ని కొర్రగింజలు. బండిగి (పొట్ట)నింద కోడిపిల్ల తింటూనే ఒక బోకిలో నీళ్లు తెచ్చి పెడ్తిమి. ముక్కుతో సన్నగా పీల్సుకోని, తలపైనికెత్తి గోటగొట్న శారెదు నీళ్లు తాగేశ. దాని ఈడుండే కోడిపిల్లలు మా ఇంట్లో లేవు. అందుకే ఇది మిగిల్న కోళ్ల జతకిపోతావుండ్లేదు. మాయవ్వ భుజాల మిందో, పొయ్యి దగ్గర బువ్వసేసే మాయమ్మ కాళ్లమిందో ఎగురుకొంట, కోడికి పుట్టిన కోడిమాదిరి కాకుండా మనుష్యుల జతలో సన్న పిల్లోని మాదిరి పెరిగె.

సూస్తావున్నట్లే సన్న ఈకలన్నీ రాలి కొత్త ఈకలు మొలిశ. తలమింద కిరీటం మాదిరి యర్రజుట్టు పెరిగె. యర్రగా మందారం పూల రేకల మాదిరి వుండే దాని ఈకలు సూసేకి శానా ముచ్చటయితావుండె. అన్ని కోళ్ల మాదిరి అది బయటికి పొయ్యి గింజగిట్ర, పురుగు పుట్ర తింటా వుండ్లేదు.

ఇంట్లో దొంతుల సందుల్లోన, పొయ్యి దగ్గర కట్టెలకింద వుండే పురుగుల్ని, తడికల మింద తిరిగే బల్లుల్ని, తొండేబిక్కల్ని, జర్రుల్ని, తేళ్లని, మిడుతల్ని, సిట్టెలకల్ని ఎదికెదికి తింటావుండె. మేం బువ్వతినే పొద్దుకి తట్ల దగ్గరికొచ్చేది. ఏసిన సంగటి తుత్తలు, కాయగూరల తోళ్లు, కడాలో తినకుండ ఇడిసిందంతా తింటా వుండె.

అంతమాత్రమే అయితే అది మామూలు కోడిపుంజుకిందే లెక్క.

ముందే సెప్పిండాను మా ఇల్లుండేది పొలాల్లోనే అని. శానా మట్టుకు మా ఇంటికి కొత్త జనాలెవరూ రారు. యా మర్సి అడుక్కుతినేవాళ్లుగాని, అనుమానంగా దొంగ సూపులు చూసేవాళ్లుగాని— మా ఇంటి పట్టుకు ఒచ్చిరనుకో, అప్పుడు సూడిపోన్నా నా సామిరంగా ఆ కోడి కొదమ సింగమైపోతుంది. కొక్కొక్కో' అని ముందస్తు ఎచ్చరికలు జారీ సేసుకొంట, రెండు కాళ్లతోనా నేలని గీరుకొంట, రెక్కలు టపటపా కొట్టుకొంట విష్ణుశక్రం మాదిరి ఎగిరి, రెండు కాళ్లతోన ముఖం మీదికి ఎగిచ్చి తన్నేది. ఒచ్చినోళ్లు కలవరిచ్చుకోని, పడేదీ లేసేదీ తెలీకుండ కాళ్లకి బుద్ధిసెప్పుతావుండ్రి.

అంతేగాదు. ఒగదినం పొద్దున్నే బువ్వతిని ఇంట్లో వాళ్లంతా ఎవరి పన్లకి వాళ్లు పొయ్యిండారు. మధ్యాన్నమపుడు సద్ది తీసుకుపోదామని మాయమ్మ ఇంటికొచ్చి వాకిలుకు అడ్డం పెట్టిండే తడిక తీసినంట. లోపలికి పోదామంటే కోడి కిబ్బిబ్బీ ముందుకు పోనీదంట. 'కొర్‌కొర్' అని హెచ్చరిస్తా కాళ్లని ముక్కుతో కుక్కుతావుందంట. మా యమ్మకి ఏమీ అర్థం కాలేదంట.

మా ఇంట్లో ఒగ పిల్లి ఉండె. అదిగూడా శానా విశ్వాసమైన జీవి. అది లోపల నుండి 'మ్యావ్ ప్రిస్ ప్రిస్' అని ఎవర్నో బెదిరిచ్చినట్ల శబ్దం సేస్తావుందంట. అది ఇని అనుమానమొచ్చిన మాయమ్మ నాయన్ని కూతలేసి పిల్సినంట. బిరబిర్న ఇంటికి ఒచ్చిన మా నాయన అవి అరిసే అరుపు విని... లోపలెవరో మనకు అపకారం సేసే దుర్మార్గులుండారనుకోని, గుడిశముందర సూర్లో వుండే ఎదురు కర్ర సేతికి తీసుకొన్నంట.

యపుడు మా నాయన సేతికి బరకట్టె అందుకొన్నో అపుడు యర్రోడు పక్కకి తప్పుకొన్నంట. మెల్లగ లోపలికి తొంగి సూసినంట మానాయన.

దొంతులుమధ్య దూరేకి రెట్ట లావు నల్లనాగుబాబు

కదుల్తావుందంట. ముందరికొస్తే పడుతుందంటాని, పిల్లి పంజాయిప్పి కత్తులట్లా గోర్లని సూపిస్తావుందంట. అంతేనంట. మా నాయన యనకపాట్నుంచి పాముకి ఒగటి అంటిచ్చినంట. నడుమిరిగి అది మెలిదిరిగి పాయనంట. దొంతుల సందుల్లో ప్రాణాలు పోకుండా పొర్లాడ్తావుండే పామును – ఒక పక్క యర్రోడు ముక్కుతో పొడుస్తావుండంట, ఇంగొగు పక్క పిల్లి పంజాతో వాంచబట్టిందంట.

ఇట్ల ఒకటిగాదు రెండు గాదు యర్రోని సాహసం పన్లు!! జనాలని జాగురూకుల్ని సేసేదాన్కే అది మా ఇంటికి ఒచ్చిందని మురిపోతావుంటిమి. మా నాయన దాని సెవులకి యెండిలోలాకులు తగిలిచ్చి అలంకారము గూడా సేసిండె.

రెడ్డిస్వామి ఉపదేశాలన్నీ ముగిసినట్లుండాయి. అందరూ ఇంటినుండి బయటికొచ్చిరి. ఇంటెనక కానుగ సెట్టు కొమ్మకి సీమనూనెలాటీ తగిలిస్తిమి. అందరికీ తట్టలు సాలకుంటె పాకపట్లు తీసుకోని వర్సగాకూ కొంటిమి. మాయమ్మ అందరికీ ఒగొగు సంగటిముద్దేసి గంటెడు తునకల శార ఒడ్డిస్తావుండె. సన్నగా గాలెత్తుకోనె. ఏదిదో ఎండిన ఆకు మాదిరి ఉండేది ఎగిరొచ్చి నాతట్లో పడితే తీసి సూస్తి. అది ఆకు కాదు కోడీకయర్రగా వుంది. అనుమానమొచ్చి 'ఇదిమన యర్రోని ఈక మాదిరి ఉందే' అని గొణిగితి. నా మాట్లు ఎవ్వరికీ ఇనపడినట్లు లేవు. అందరూ నిశ్శబ్దంగా తింటావుండారు. నేను గూడ ఒగముక్క నోట్లో పెట్టుకోని నమిలేదానికిపోతి. నా తమ్ముడు గట్టిగా ఏడ్సుకొంట' మన యర్రోని అన్యాయంగా సంపి శారొండిన్నినారన్నా' అని తినేదిఅపి అంగలార్సబట్టె. నా కడుపులో ఎవరో సెయ్యిపెట్టి దేవినట్లాయ. తింటా వుండేదట్లే వాంతి సేసుకోని ఆకునువదిలి లేసిపోతి.

అపుడు తెలిసిందేమంటే–

ఆస్వామి మా కులస్థుల గురువులయ్యంట. ఆయప్ప సూపిచ్చిండే మహాత్యాలు, సెప్పిన మాటలు పొల్లుపోకుండా నిజాలయ్యిందే కతలు యాడజూసినా జనాలు సెప్పుకొంటా వుంటారు.

ఆయప్ప దర్శనం సేపిచ్చుకొనేకి ఒస్తానని ముందుగా ఒగమాట గూడా సెప్పడంట. టకీమని ఒగ ఇంటికిపోతాడంట. ఆయప్ప కాలుమోపితే ఆ యిల్లు పావనమయినట్లేనంట. ఆయప్ప మాటలకి ఎవురూ ఎదురు సెప్పగూడదంట. అట్లా స్వామి మా ఇంటి కొచ్చినపుడు మా ఇంటి దగ్గర ఎవరూ ఉండ్లేదంట. ఎవరి పన్లు వాళ్లు సేసుకొంట పురసత్తులేకుండ ఉండ్రంట.

ఆయప్ప ఒచ్చినోడు ఒచ్చినట్లే వాకిలుకు అడ్డం పెట్టిండే తడక తీసి నట్టింట్లో గోనెసంచి పర్సుకోని గుడిశ ఎగిరిపొయ్యే రకంగా దేవునిపాట్లు పాడ్తావుండాడంట. పన్లయిపోతూనే మాయమ్మా నాయనా ఇంటికొచ్చిరంట. స్వామిని సూసి కాళ్లమింద పడ్రంట 'సామీ మాన్నభావా మీరొచ్చినపుడు మేము ఇంట్లో వుండక శానా తప్పుసేసిండాము. కోపము తెచ్చుకోవద్దుస్వామీ' అని బతిమిలాడ్రంట.

అపుడు స్వామి రవంతసేపు కండ్లు మూసుకోని శాంతపడి సెంబుడు ఎనుంపాలు గింటగొట్న తాగినంట. మా నాయన్ని దగ్గరికి పిల్సి భుజంమీదికి సెయ్యేసి 'నీవు శానా కష్టజీవి. నిజాయితీలో నీకి మించినోళ్లు ఈ భూమ్మిందే లేరు. అయినా నీ సేతులకష్టం నోటికి అందకుండా పోతావుంది. దానిక్కారణం నువ్వుకాదు. నీ ఇంట్లో ఒగ అరిష్టం తిరుగుతావుంది. అందుకే నీ ఎదుగుదల ఎనిక్కి పోతావుంది' అని సెప్పినంట.

అపుడు మాయమ్మ గట్టిగా ఏడ్సుకొంట స్వామి కాళ్లు బిర్రగా పట్టుకోని 'అరిష్టమేదిదో సెప్పండి స్వామీ' అని కన్నీళ్లు కార్సబట్నంట.

అపుడు స్వామి కండ్లు మూసుకోని, గడ్డం సవరించుకోని 'ఈ సృష్టిలో యన్నో రకాల పక్షులుండివి. అవన్నీకాదని మనం కోళ్లనేయాల పెంచుతావుండాము? అది నిద్రపోయే మనిషిని కూతలేసి లేపుతుంది గనక. అట్లా కోడి మంచి జాతయ్యింది పెంచుకొంటే మనం కూడా అన్ని రకాలుగా బాగుపడ్తాము.

అయితే కోళ్లలో నీతయ్యిందేది? అరిష్టమైందేది? అని తెలుసుకోనెదెట్లని మీకు సందేహం రావొచ్చు. అది పెద్ద బ్రహ్మ విద్యగాదు. నల్లకోడికాళ్లునల్లగ, తెల్లకోడికాళ్లు తెల్లగ, యర్ర కోడికాళ్లు యర్రగా వుండల్ల. అట్లకాకుండ కోళ్ల రంగొకటి, కాళ్లరంగు ఇంగొగటి ఉండకూడదు. అట్లా విరుద్దం రంగులకోడి యా యింట్లో వుంటే ఆ ఇల్లు దుంపనాశనమైపోతుంది' అని సెప్పినంట.

స్వామి మాట్లిన్న మా నాయనకి భయం సుట్టుకొన్నంట. నిముషం ఆలస్యంసేయకుండ 'కొక్కొక్కో' అని కోళ్లని పిల్సి శాటడు గింజలేసి అవి మేస్తావుంటే అన్ని కోళ్లనీ పరీక్ష చేసినంట. స్వామి సెప్పినట్లే అన్నీ సరిగా ఉండివంటగాని ఒక తెల్లకోడికి నల్లకాళ్లు, యర్రోనికి తెల్లకాళ్లు ఉండావంట. అంతేనంట స్వామి మాట్లకి ఎదురు సెప్పకుండ మనస్సును రాయిసేసుకోని కండ్లుమూసుకోని యర్రోన్ని, గుడ్లకొచ్చిందే ఇంగొగు తెల్లకోడ్ని కోసి శారొండిండాడంట.

ఇంట్లో జనమంతా బలంతం సేసినా నేనూ మాయామన్నా బువ్వ తిన్లేదు. అలిగి ఏడ్సుకొంట, ఎర్రోని తల్సుకొంట ఒగ మూల్లో ఉండిపోతిమి.

స్వామి మాత్రం తత్వాలు పాడుకొంట. దుత్తనిండా తెచ్చిండే ఈతకల్లు తాక్కొంట, పరలోకాన్ని గురించిన కతలు సెప్పుకొంట ద్యానంలో ఉండిపాయ. స్వామి సెప్పే పెద్దమాటలు అర్థంకాక నేనుయప్పుడు నిద్రపొయ్యిండానో నాకే తెలీదు.

పొద్దు బుట్టి బారెడు పొద్దెక్కినా ఎవరూ నిద్ర లేసినట్లు లేదు. మాయవ్వ ముందుగానే లేసి ఏడ్సినట్లనిపిస్తే నేను కూడా దిడుగ్గన లేస్తి. నట్టింట్లో కమ్మిడిమింద పనుకోనుండే స్వామిలేడు. మాయవ్వ మెడలో బంగారు కాసులదండ గూడా లేదు. మాయమ్మ సెవుల్లో కమ్మలు కనిపించలేదు. మా నాయన జేబులో బీడీలకట్ట అగ్గిపెట్టెగూడా మాయమయ్యిండివి.

ఇంగేమి సేస్తుము. ఎవరికైనా సెప్పితే సిగ్గుల సేటని దొంగస్వామిని తిట్టుకొంట తిమురుకొంట శాపనార్థాలు పెట్టుకోని ఊరకే అయితిమి.

ఇది జరిగి ఏండ్లు పూండ్లు అయిపాయ.

అయినా గూడా కాషాయం బట్టల్తో గడ్డం మీసాల స్వాములు యాడ కనబడినా, కష్టం సేసే జనాల్ని పిల్సి సేసే ఉపదేశాల మాట్లు, యాడ ఇనపడినా నాకు అరికాలిమంట నెత్తికెక్కుతావుంటుంది.

ఈళ్ల కండ్లల్లో బడి యర్రోనట్లా అమాయకులు యంతమంది నాశనమైపోతారో గదా అనిపిస్తుంది!!

**రచయిత ఫోన్ నం. 9440073636**

జనవాణి

# బుద్ధుని బోధనలకింత ప్రాధాన్యతా?

**బు**ద్ధుని బోధనలకు ఇప్పుడు ప్రాసంగికత లేదనీ, ఆయన బోధనలకింత ప్రచారం ఇప్పుడు అక్కరలేదనీ ఉప్పల నరసింహంగారు జూలైనెల 'అమ్మనుడి'లో వ్రాసి చదువరుల ముందుకొక చర్చను పెట్టారు. అంటే బుద్ధుని బోధనలు ఇప్పుడె రెలెవెంట్ (relevant) కావని వారి అభిప్రాయం. అలా అయితే- శంకరాచార్యుడు మొదలుకొని తక్కిన హైందవ, హైందవేతర మతాలన్నీ ఇప్పుడు ఇర్రెలెంట్ అనే అనుకోవాలా? మరి-పలురకాల మానవతావాదాలు, రాజకీయ సిద్ధాంతాలు-మార్క్సిజం, సోషలిజం వంటివన్నీ నేడు అసంబద్ధాలని అనుకోవాలా?

ఏ ధర్మ ప్రబోధకుడయినా మతావిష్కర్త అయినా, సిద్ధాంతకర్త అయినా నాటి సమాజాన్ని దృష్టిలో పెట్టుకొని, వారి సమస్యల పరిష్కారానికి తనకు తోచిన మార్గాన్ని బోధిస్తాడు. అది దేవుణ్ణి ఆశ్రయించుకొని ఉండవచ్చు, లేకనూ కావచ్చు. ఆ సిద్ధాంతాల ప్రబోధకాలానికీ నేటికీ మనుషుల బ్రతుకు అవసరాల్లో, చిక్కుల్లో ఎన్నో మార్పులు వచ్చి ఉండవచ్చు. వారసత్వంగా వచ్చే బతుకు తీరుతెన్నులెన్నో ఉంటాయి. అందులో చాలా అసంగతాలూ ఉంటాయి. మరి వీరందరి ఆలోచనల్నీ, బతుకుల్నీ ఒక్కసారే ఏమంత్రదండంతో మార్చివేద్దాం? ఎలా మార్చివేద్దాం? ఇలాంటి చర్చ ఇప్పుడు అసంగతం కాదా?

సరే. చర్చకు పెట్టే స్వేచ్ఛ పాఠకుడికి ఉంటుంది. దానిపై తక్కిన పాఠకులు స్పందించే స్వేచ్ఛ ఉంటుంది.

ఇంతకూ- బౌద్ధం తొలినుండి ఇప్పటివరకకూ ఒకేరకంగా లేదు. రకరకాల వ్యాఖ్యాతలు... 2000 ఏళ్లకు పైబడిన కాలంలో బోధనల్లో ఆచారాల్లో ఎన్నో రకాల మార్పులు చోటుచేసుకుంటున్నాయి. బుద్ధుడే దేవుడని ప్రచారం చేసిన వాళ్లు, వాటిని నమ్మినవాళ్లూ ఉన్నారు. దేవుణ్ణి చర్చకు పెట్టకుండా మనిషే లక్ష్యంగా- సుఖమైన శాంతిప్రదమైన, హేతుబద్ధమైన జీవితాన్ని, సమాజహితంగా గడపగల జీవితాన్ని బుద్ధుడు బోధించాడు. ఇటీవలి కాలంలో ఆవిధంగా డా॥ బి.ఆర్.అంబేద్కర్ బౌద్ధాన్ని ఆధునికంగా పునర్నిర్వచించాడు. చివరకు- భారత రాజ్యాంగ రచనలో కూడా ఆ భావనలను తీసుకొన్నాడు అంబేద్కర్.

ఆయా కాలాలలో ఆలోచనలు బోధనలుగా సమాజంలోకి వచ్చినపుడు వాటిని ఎవరు ఎట్లా గ్రహిస్తారనేది ఎవరూ నియంత్రించలేని సంగతి, నిరంతర విద్య మేథోపరమైన భౌతికమైన శ్రమ- ఇవన్నీ సమాజ జీవితాన్ని ప్రభావితం చేస్తాయి. మూఢనమ్మకాలను పారద్రోలే కృషిని కొనసాగిస్తూ నవ సమాజ నిర్మాణానికి కృషి చెయ్యాలి. ఎప్పటికప్పుడు నవీకరణం (అప్‌డేటింగ్) చేసుకొని, సమాజ పరిస్థితులకనుగుణంగా ఎదగని ఏ సిద్ధాంతమూ నిలవదు. ఇదంతా తెలియవారుకాదు - ఉప్పల నరసింహంగారు. అయినా ఏ ప్రతిక్రియాత్మక ఆలోచన ఇలా వ్రాయడానికి వారిని ప్రోత్సహించిందో?

**కె. వినయ్ కుమార్, తెనాలి.**

# అమ్మనుడిలో కతలు

అమ్మనుడిలో కతలు ఇంతకుముందున్న నడుస్తున్న చరిత్రలో ప్రచురించిన కతలవలెనే వివిధ ప్రాంతాల ప్రజల పలుకు తీరులోనే ఉండడాన్ని అభినందిస్తున్నాము. ఇందువల్ల ఆయా ప్రాంతాలవారి బతుకు తీరుతెన్నులూ, మాట తీరు తెలుస్తున్నవి. సామాజిక అంశాలతో ఈ కతలు రావడం కూడా అభినందనీయం. అమ్మనుడిలో ప్రచురిస్తున్న కతలు ఆసక్తిని రేకెత్తిస్తున్నాయి. ఇది సాహిత్యం ద్వారా భాషకు జరుగుతున్న నిజమైనసేవ.

**కె. విజయలక్ష్మి, శ్రీకాకుళం**




**కవిత**

## పాలకడలి - అమ్మనుడి...

**తె**లుగుభాష మాగాణి
తెలుగువారినోట అది కళ్యాణి
తెలుగుమాటే తియ్యని రవళి
తెలుగునుడి తెల్లని జాబిల్లి
తెలుగువారి గుండె చప్పుడు నానుడి
తెలుగు మాండలికాలకేవి సరిసాటి
భాషకు వారధులు భావి పౌరులు
భాషకు వారసత్వం భాషా పదజాలం
తెలుగు ఖ్యాతి చిరకాలం
భాషల కూడలి సాగర సంగమాల ఒడి
'స్వర'లహరుల హారతి...
పాలకడలి - 'అమ్మనుడి'.

**- కె.ఎస్. అన్నపూర్ణా దేవి**
సెల్‌నం. 9703305276

స్మృతి మంజూష

–డా॥ సోమసుందర్ ఆవంత్స

# ఉప్పల లక్ష్మణరావు గారు

*సాహిత్యంలోనూ జీవితంలోనూ కూడా కొన్ని అపురూప విషయాలు సంభవిస్తూంటాయి. ముఖ్యంగా సాహిత్య సాంస్కృతిక విషయాల గురించి సమాచారాలు చదువుతున్నపుడు కొన్ని విషయాలు మన స్మృతిపథంలో మేలుకుంటాయి. అలాంటివాటిని గాలికి వదిలిపెట్టడమే అవి మరొకసారి చదువుకోవడం వల్ల మన సాంస్కృతిక విషయ సామగ్రిలో కొన్ని అమూల్య విషయాలు చేరుతుంటాయి. అలాంటి కృషిని ఈ శీర్షికలో తెలియజేస్తాను. విషయం విపులమైంది కాకపోనూవచ్చు. కానీ వాటి తీక్షణత అవిస్మరణీయత చాలా విలువైనవి. అలాంటి వాటిని విన్నవించి, పాఠకులతో ఆనందం పంచుకుందుకు ఈ శీర్షికను వినియోగిస్తున్నాము. ఇందలి విషయాలు కల్పితమైనవి కావు. సాంస్కృతిక పరమైనవే. సాహిత్యసాంస్కృతిక విషయాలు వ్యక్తుల అవినాభావ సంబంధంతో పెంపొందుతాయి. అట్టివి అటు వ్యక్తి చరిత్రకూ ఇటు సాంస్కృతిక చరిత్రకూ గాఢ సంబంధం కలవే. అట్టివాటినే ప్రతిసంచికలోనూ నివేదించదలిచాను. – రచయిత.*



'**అ**తడు–ఆమె' అనే నవలా గ్రంథకర్త ఉప్పల లక్ష్మణరావుగారు. మన మహావ్యక్తులలో ఆయన ఒకరు. ఆయన స్వీయచరిత్ర కూడారాశారు. దానిపేరు 'బ్రతుకు పుస్తకం'. అతిశయోక్తులు–విపులీకరణలూ లేకుండా చాలా సంగ్రహంగా రాశారు. మనం దాచుకుని చదువుతూ ఉండవలసిన గొప్ప పుస్తకాలలో అది ఒకటి. ఆయనది ఒక విచిత్రమైన వ్యక్తిత్వం. శ్రీమతి మిల్లీ షోలింగర్ అనే జర్మనీ మహిళ ఆయనతో సహజీవనం గడిపింది.

డాక్టర్ ఉప్పల లక్ష్మణరావు తన బ్రతుకు పుస్తకంలో శ్రీమతి మెల్లీ షోలింగర్‌కు భారతదేశ స్థితిగతులను తెలుపుతూ ఇలా అన్నారు. 'పెద్దపెద్ద మేడల పక్కన రొచ్చుబురద ఉన్న మట్టి గుడిసెలతో, గొడ్లతో సహా చాలామంది జీవిస్తూ ఉంటారు. అనారోగ్య పరిస్థితిలో చాలా మంది జీవితాలు వెళ్ళదీస్తున్నారు' అని చాలా విపులంగా మన దేశ స్థితిగతులు తెలియజేశారు. ఆయన జర్మన్‌లో పిహెచ్.డి పూర్తి చేసుకొని, మెల్లీతో సహా 75 ఏళ్ళక్రితం తిరిగి వచ్చారు. ఆమె కేవలం స్నేహితురాలు మాత్రమే. ఒకే ఇంటిలో ఉన్నా ఒకే భావాలూ ఆలోచన ధోరణులూ ఉన్నా వారెప్పుడూ లైంగిక జీవితం గడపలేదు. పైకి వారు దంపతులు లాగ కనిపించినా నిజానికి వారు బ్రహ్మచారులే.

ఆ మహనీయుడు బెజవాడలో కెమిస్టుగా ఉద్యోగం ముగించుకున్నారు. మాస్కోలో అనువాదకులుగా పనిచేశారు. ఆ సమయంలో మెల్లీగారు ఆయనకు భోజనం వడ్డించి, పెరుగుతేవడం మర్చిపోయిన విషయం గుర్తుకొచ్చి, గబగబా వెళ్ళి రోడ్డు దాటారు. పెరుగుతో తిరిగి వస్తూ రోడ్డు ప్రమాదానికి గురై మరణించారు. అసలే ఆమె పిట్టలాంటి మనిషి. పదమూడేళ్ళ పిల్లవాడిలా ఉండేవారు. చిన్న క్రాఫ్‌తో నిక్కరూ షర్టూ వేసుకుని ఉండేవారు.మెల్లీగార్ని మాస్కోలో భూదేవతకి సమర్పించి ఉద్యోగ విరమణ అనంతరం విశ్రాంతి తీసుకునేందుకు స్వస్థలమైన బరంపురం వచ్చారు. జీవితాంతం అక్కడే గడిపారు.

లక్ష్మణరావుగారు నిరంతర ఆలోచనాజీవి. సమాజస్పృహతో, సంస్కారభావాలతో గడిపిన కర్మయోగి. నిర్వ్యాపారికి వలే పూర్ణ విశ్రాంతి అంటూ ఎప్పుడూ లభించలేదు. అందువల్లనే బరంపురంలో ఉన్న యువ మేథావులను ఒక చోట చేర్చారు. సమిష్టి ఆలోచనలకు, చర్చలకు అవకాశం కల్పించారు. అలా రూపొందిందిన సంస్థ 'వికాసం' సభ్యులందరూ యోచనాశీలురు, రచయితలు, కవులు, కథకులు. నిరంతర చైతన్యంతో ఏకోన్ముఖంగా జీవించారు. ఆ వికాసంలో ఎందరో సభ్యులు మంచి రచయితలయ్యారు. అలాంటి గతిశీలత గల రచయితలలో విజయచంద్ర ఒకరు. ఆనాటినుంచి రచిస్తున్న రచయితలతో ఎట్టకేలకు ఆహ్వానం అనే సంపుటం ఆయన ఒక్కరే ప్రచురించారు.

జర్మనీలో ఇరువురూ స్నేహితులుగా బ్రతుకుతున్న రోజులలో లక్ష్మణరావుతో మెల్లీ వివాహం చేసుకుందామని కోరారు. ఆయనతో ఇండియాకు వస్తానని కోరారు. 'అక్కడి మాదేశవాసుల పరిస్థితులు ముందే తెలుసుకోవడం మంచిది...' అని భారతదేశ స్థితిగతులను తెలియజేశారు. ఆ సందర్భంలోనే పై మాటలన్నారు. ఆయన చిత్రించిన సామాన్య మానవుల జీవన స్థితిగతులలో కనీసం 70 ఏళ్ళు గడిచినా ఇప్పటికీ ఎలాంటి మార్పూ రాలేదు. ఆయన ఆనాడు ఎలా వర్ణించారో ఆ యదార్థాలన్నీ నేటికీ శ్రమ జీవనులైన అడుగు ప్రజల నిత్య జీవన సత్యాలే. సమాజంలోని ధనార్జనా వర్గాల నుంచి అడుగు పొరల వరకు వెళ్ళి పరిశీలిస్తే ఈ సత్యాలన్నీ దుస్సహంగా సాక్షాత్కరిస్తాయి. మాలమాదిగలు జీవించే కొంపలు పందుల గూళ్ళ కన్నా గొప్పవికావు. యాభై ఐదేళ్ళ స్వాతంత్ర్యమూ ఇన్ని పంచవర్షప్రణాళికలూ ఏ గాలికి కొట్టుకుపోయాయో గాని, అధిక సంఖ్యాకుల జీవన పరిస్థితులలో మార్పు రాలేదు. విదేశాలనుంచి లక్షల కోట్లుగా తెస్తున్న అప్పులు ఏ బంధువులు దిగమింగుతున్నా ఎవరికీ తెలియదు మరి!

# వైణికుడు బాలచందర్ గారు



'**బొం**బాయినుండి వెలువడే ఆంగ్ల దినపత్రిక ఏప్రిల్ 15 1996 సంచిక మొదటిపుటలో – ప్రఖ్యాత వైణికుడు బాలచందర్ మరణవార్తను ప్రచురించింది. తమ పత్రిక న్యూస్ సర్వీస్ ఆ వార్త పంపినట్లు తెలిపింది. బాలచందర్ ప్రఖ్యాత సంగీత శాస్త్రవేత్త. పరిపూర్ణ కళాకారుడు. 8 సంగీత జంత్ర వాద్యాలలో నిష్ణాతుడు. ముందు రాత్రి భిలాయిలో కచేరి చేస్తున్న సమయంలో గుండెపోటు వచ్చింది. కొద్ది వ్యవధిలోనే చివరి ఊపిరి విడిచాడు. ఆయనకు 63 ఏళ్ళు. మనిషి అందంగా, నిండుగా, పుష్టిగా ఉండేవాడు. తెల్లని దేహచ్ఛాయ, ఒంకులు తిరిగిన శిరోజాలతో ఒత్తైన క్రాప్‌తో ఉండేవాడు. కాని 50 ఏళ్ళు గడవకుండా తలంతా ఊడిపోయి, బోడిగుండు అయిపోయింది. ఆయన సితార్, తబలా, మృదంగం వంటి వాద్యాలన్నీ అవలీలగా వాదనం చేయగలిగేవాడు. వీణా వాదనంలో మాత్రం ఆయనది అనన్య సామాన్యమైన విశిష్టశైలి.

సంగీత నాటక అకాడమీ బహుమానం అందుకున్నాడు. పద్మభూషణ్ బిరుదుతో కేంద్రం ప్రభుత్వం సత్కరించింది. ఆ వారారంభంలోనే ఆయన మద్రాసు భిలాయి వెళ్ళారు. సంగీత కార్యక్రమాలు నిర్వహించారు.

ఆయన భౌతిక దేహం మద్రాసుకు విమానంలో పంపబడింది. 'మీ బాలచందర్ భిలాయిలో కళాకారుడైన ఒక మిత్రుని ఇంట అతిథిగా ఉన్నారు. 14వ తేదీ రాత్రి 11గంటలకు ఛాతిలో పోటు ప్రారంభమయింది. వైద్య సహాయం లభించే లోపలే ఆయన కన్నుమూశారు' అని వర్తమానం వచ్చింది.

భారత ప్రధాని ప్రొ. వి.పి.సింగ్ తమ తీవ్ర సంతాపం తెలియజేశారు. 'బాలచందర్ అనన్య సామాన్య విద్యాసంపదను కర్ణాటక సంగీతానికి సమర్పించారు. స్వయం సమృద్ధమైన ప్రతిభకు ఆయన నిజంగా నిరుపమానవ్యక్తి. వీణావాదనం ఆయనకు అనర్గళమై అమేయకీర్తిని అందించింది. వాదనా నైపుణిలో, కొత్త లోతులు, కొత్త ఎత్తులు, వినూత్న శైలి సౌందర్యాలు ఆయన సాధించారు' అని విశ్వనాథ్ ప్రతాప్ సింగ్ జోహారులు అర్పించారు. అదే రోజు టైమ్స్ ఆఫ్ ఇండియా ఆరవ పుటలో బాలచందర్ పటంతో సహా స్మృత్యంజలి ఘటించింది. ఆయన జీవితాన్ని సమీక్షిస్తూ 'ఎన్నో బహుమతులు, బిరుదులూ పొందిన బాలచందర్ అంతర్జాతీయ కీర్తిమంతుడు, వీణావాదనలో అనన్య సామాన్యుడిగా గుర్తింపబడ్డాడు. స్వాతి తిరునాళ్ సంగీతకృతులు, కర్తృత్వం గురించి ఆయన వివాదం లేవనెత్తాడు. 19వ శతాబ్దానికి చెందిన తిరువాన్‌కూరు మహారాజా శ్రీ స్వాతి తిరునాళ్ బహుభాషా కోవిదుడు, సంస్కృతంలో కవి, విద్వాంసుడు, వాగ్గేయకారునిగా విశ్వసనీయ ప్రఖ్యాతి పొందారు. స్వాతి తిరునాళ్ రచించినట్లు సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్ నిర్ణయించినది అసత్యమని బాలచందర్ ఖండించారు. అదంతా ఆయన పేర చలామణీ చేసినట్లు బాలచందర్ ఎంతో లోతుకు దిగి పరిశోధించి, బయట పెట్టారు' అని ఆ పత్రిక వ్రాసింది. పైగా స్వాతి తిరునాళ్ తిరువాన్కూరు రాజుగా జీవించనే లేదని ఆ పేరుతో సహా ఆ చరిత్ర యావత్తూ కూట సాక్షుల కల్పనయే అని వెల్లడి చేశాడు. సంగీతలోకంలో ఇదొక బాంబులా పేలింది. కొందరు స్వార్థపరశక్తుల ముఠా తిరువాన్‌కూరు రాజకుటుంబానికి సాంస్కృతిక జ్యోతిర్మండలాన్ని అంటగట్టింది అని బాలచందర్ ఖండించాడు. ఆయన చివరి వత్సరాలలో అధికకాలం ఈ పరిశోధన కోసమే వెచ్చించాడు. తన వాదాన్ని బలపరిచే అనేక సాక్ష్యాధారాలను వెలుగులోకి తెచ్చాడు.

ఈ వివాదంలో చివరి పోరాట ప్రకరణ మద్రాసు హైకోర్టులో బాలచందర్ పిటిషన్ దాఖలు చేయటమే బుక్‌ట్రస్టువారు 1958లో ప్రచురించిన స్వాతి తిరునాళ్ అనే గ్రంథాన్ని ఉపసంహరించాలని, రెడ్ పిటీషన్‌లో బాలచందర్ పోరాడేరు. ఆ గ్రంథాన్ని సుప్రసిద్ధ కర్ణాటక సంగీత విద్వాంసుడు శ్రీ సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్ రచించారు. ఆయన90 ఏళ్ళ వయసులో ఇటీవలనే (2003) లో మరణించారు.

స్వయంకృషితో వీణావాదనా నిష్ణాతుడైన బాలచందర్ సకల దేశాల ముఖ్య పట్టణాలలోను ఎన్నో కచేరీలు జరిపారు. చైనా దేశంలో సుదీర్ఘకాలం పర్యటించారు. చిత్ర జగత్తులో కూడా బాలచందర్ ప్రముఖ పాత్ర వహించారు. ఎన్నో తమిళ చిత్రాలకు సంగీత దర్శకత్వం చేశారు. ఆయన నిర్మించిన అంతరాళ్ అనే చిత్రం – ఒక పాటకూడా లేకుండా, విజయం సాధించింది. విశిష్ట చిత్రంగా కీర్తి పొందింది. ఆ చిత్రంలో డాన్స్ సీక్వెన్స్‌లుగాని, సెక్స్ అప్పీల్‌గానీ లేవు. ఆ నాటికే కాదు. నేటికి కూడా ఆ చిత్రం ఒక ఉత్తమ ప్రయోగమే.

స్వాతి తిరునాళ్ సమస్యను 1985లో స్వీకరించి, లోతుకు దిగి, పరిశోధించనారంభించారు. ఒకవేళ అలాంటి వ్యక్తి అంటూ ఒకరు ఉంటే, ఆయన పేరు మీద చలామణి అవుతున్న 300 సంగీత కృతులలో మూడో, నాలుగో కూడా ఆయన రచించి ఉండడని బాలచందర్ నిష్కర్ష.

కర్ణాటక సంగీత లోకంలో బాలచందర్ స్థానం సమున్నతమైనదే. సందేహంలేదు. కాని, ఇలా పిల్ల సమేరీలకి చొరబడే ఆయన మనస్తత్వం గురించి సమకాలిక, సంగీత వేత్తలకు, ప్రియులకు ఎంత మాత్రం హితవు

*తరువాయి 34వ పేజీలో....*

- శ్రీ వావిలాల సుబ్బారావు

# మాది మతంకాదు... ధర్మం?!

ఈమధ్య మతం అనే మాట దాదాపు నిరర్థకమయింది. మాది 'మతం' కాదు– 'ధర్మం' అంటున్నారు కొందరు. 'మీది ఏమతం'? అంటే ఉలిక్కిపడుతున్నారు మరికొందరు. 'వాడు మతవాదిరా' అని వేలెత్తి చూపుతున్నారు గిట్టనివాణ్ణి. 'మతం' అనే మంచి మాటమీద ఎక్కడివీ నీలినీడలు?

మతం అనే మాటకు భారతీయ భాషలలో సిద్ధాంతమని, అభిప్రాయమని అర్థం. ఇంగ్లీషులో School of thoughts అనే పలుకుబడికి సమానార్థకం 'మత'మనేమాట. భాట్ట మతం – క్షేమేంద్ర మతం – ఆనందవర్ధన మతం – ఆలంకారిక మతం... ఇట్లా సిద్ధాంతకర్తల పేర్లమీదుగా సాహిత్యశాస్త్రంలో శాంకర మతం – మాధ్వ మతం – రామానుజ మతం... త్రిమతాలు... ఇట్లా తత్త్వశాస్త్రంలో వాడుక. మతం అనేమాటను ఇంగ్లీషులో 'రెలీజియన్' (Religion) కు సమానార్థకంగా వాడటంతో అసలు అర్థం అధ్వాన్నమయింది. 'రెలీజియన్' అంటే 'దైవభావనకు నిబద్ధమయిన ఆచరణ' అని అర్థం. – భారతీయ అర్థంలో మతం అనే మాటకు 'దైవనిబద్ధత' అనివార్యంకాదు. అందుకనే 'నాస్తిక మతాలు' అనే పదప్రయోగం కూడా ఉంది.

ఈమధ్య కాలంలో 'మతం' అనే మాటకు గౌరవం తగ్గినట్లుంది. 'మాది మతం కాదు – ధర్మం' అని క్రైస్తవులు చర్చిగోడల మీద రాస్తున్నారు. 'బౌద్ధం మతం కాదు – ధర్మం' అని బౌద్ధం గురించి వక్తలు అంటున్నారు. గతంలో గూడ 'వైదిక ధర్మం', 'సనాతన ధర్మం' అనే మాటలున్నాయి. –'ధర్మ' శబ్దానికి విస్తృతార్థాలున్నాయి. వైదిక ధర్మంలోనే షణ్మతాలు (సిద్ధాంతాలు) ఉన్నాయి.

ఏది మతం? ఏది ధర్మం? తెలియక గందరగోళపడి ఆలోచించుకుంటుంటే– బహుశ – ఇట్లాయేమో అనిపించింది.

'ధర్మం' అనే మాటకు సందర్భానుసారంగా అనేకార్థాలున్నాయి. 'ధరించేది ధర్మం' అన్నారు శబ్ద పండితులు. దేనివలన – (ఏ తత్త్వం– సూత్రం–ఏ నియమం– ఏ సత్యం మొ॥). మన ప్రవర్తనలోని రీతి, మనఃప్రవృత్తి– ఇంకా ఇంకా ముందుకు సాగితే – విశ్వ నిర్వహణ మొదలయినవి గతిక్రమం తప్పకుండా వ్యవస్థాబద్ధం అవుతున్నవో (ధరించబడుతున్నవో) అది ధర్మం. ఈ ధర్మాన్ని – ఈ తత్త్వ విషయాన్ని – ఒక్కొక్కరు ఒక్కొక్కరీతిగ దర్శించి సిద్ధాంతపరచారు. అవే దర్శనాలు. సామాజిక నిర్వహణ విషయంలో కొన్ని కొన్ని సమాజాలు కొన్ని కొన్ని మూల స్తంభాలను నిర్ధారించుకున్నాయి. అవి వారి సమాజ ధర్మాలు. ఆధిదైవిక కేంద్రం నుండి – వ్యవస్థా నిర్వహణ వరకు– భిన్న వర్గాలు భిన్న దర్శనాలు ఆధారంగా భిన్న ధర్మాలను నిర్ధారించుకున్నారు. అందువల్లనే ధర్మ వైవిధ్యం కలిగింది. అవన్నీ కొంత విశ్వాసము– కొంత హేతు నిరూపణ – కొంత తార్కిక సంబద్ధత కలిగే ఉంటాయి.

అయితే మధ్యలో మతం అనే ఒక మాట ప్రవేశించింది. మతం అంటే భావాలకు మాత్రమే కాకుండా వాటి ఆచరణ ప్రణాళికకు, సిద్ధాంత నిబద్ధతకు, ప్రశ్నించరాని విశ్వాసానికి అర్థం వ్యాపించింది. పూజలు చేయటం– మంత్రాలు చదవటం – నిత్యానుష్ఠానంతో ప్రతి చర్యను ఆ సిద్ధాంతానికి ముడివేయటం– వీటన్నింటికి మూలకర్త అయిన ప్రవక్త పైకి ఆ విశ్వాసం వ్యాపించటం గూడ మతంలో భాగమయింది. మంది ఎక్కువ అయితే మజ్జిగ పలుచన అయినట్లు – ఈ ఆచరణ మనల్ని తరింపజేస్తుంది అన్న విశ్వాసం ప్రబలితే సారం విడచి– రూపానికి ప్రాధాన్యం వస్తుంది. తత్త్వం జారిపోయి అంధాచరణ స్థిరపడి పోతుంది. 'నేను నిష్ఠాపరుణ్ణి సుమా' – అనే అహంకారం పెరుగుతుంది. (దీన్ని బుద్ధుడు గట్టిగా హెచ్చరించాడు 'శీల వ్రత పరామాస' – అనే పేరున.

ఇవన్నీ చూచి ఇదే మతమనుకొని – 'ఛీఛీ మాది మతంకాదు ధర్మం' – అని సవరించుకుంటున్నారనుకుంటా. ఇట్లాంటి తత్త్వరహిత– యాంత్రిక ఆచరణను సర్వకాలపండితులు గట్టిగా మందలిస్తూనే వచ్చారు. స్వలాభాలకోసం, స్వీయఖ్యాతికోసం వీటిని పెంచి పోషించి అమాయకులను ఆకర్షించే కుహనా మతవేత్తలు ఎప్పుడూ ఉంటూనే ఉంటారు. వీరిని చూచి 'మత'మనే మంచి మాటను దూరం చేసుకోవటం భాషాపచారం అవుతుంది గూడాను. సమాజానికి పట్టే దుమ్మును దులుపుకొనటం ఎంత అవసరమో భాషకు పట్టే దుమ్మును దులుపుకోవటంగూడ అంతే అవసరం.

'మాది ధర్మమేగాని మతం కాదు' – అని ఎవరూ భుజాలు తడుముకోవద్దు. మతం లేని ధర్మం– ఒక విశ్లేషణాత్మక దర్శనం. ఆ ధర్మమే – ఆదర్శనమే – ఆచరణ రూపంలోకి వచ్చిన తర్వాత సాధన సౌకర్యాలకోసం కల్పించుకొనే అనేక ఉపాయాలు, నియమాలు – శిక్షణలు అన్నీ కలిసి మతంగా ఏర్పడతాయి. వాటిచుట్టు కొంత బూజు గూడ అనివార్యంగా అల్లుకుంటుంది. అప్పుడు అసలు సిద్ధాంతానికి అప్రతిష్ఠ కలగనూవచ్చు.

ఇంతకూ ఈ చింతన సారాంశం ఏమంటే మతం అనే మాటను చిన్నపుచ్చవద్దు. మతం రెలీజియన్‌కు సమానార్థకంకాదు. 'ధర్మం శిరస్సు అయితే మతం దాని కర్మేంద్రియాలు'.

అయితే రెలీజియన్‌కు సమానమయిన తెలుగు పదం ఏమిటి? అంటే... నాకు తెలియదు. ఆ మాటే వాడితేసరి!!

రచయిత ఫోన్. 9866402973.

**అమ్మనుడిని ప్రేమించలేనివాడు, అమ్మనూ దేశాన్ని ప్రేమించలేడు.**

# కడలి కేక

సమాజ పరిణామం ఉపరితలంలోనే జరుగుతోంది.
మత్స్యకారులు వేటకువెళ్లి మరణించడాన్ని
అమాత్యులు సహజ ప్రకటన చేయడం ఓ ఆశ్చర్యం
ప్రతి సముద్రం అలా ఒక పడవ ప్రయాణ కథనాన్ని వర్ణిస్తుంది.
జంతుజాతులు వృక్షజాతులు ప్రకృతినుంచి జనించి,
ప్రకృతిలో మమేకమయ్యాయి
నాలుగువందల ఏభైఏళ్ళనాడు  భూమి అగ్నిగోళంగా వుంది
అనేక పరిణామాల్లోను జీవజాతులు ఏర్పడ్డాయి
అన్ని జీవులకు జీవించే హక్కు సమతుల్యం
అనేక ప్రశ్నలకు సమాధానంగా ఈ దేవుడు ఆవిర్భవించాడు.
మానవుడు ఈదేవుణ్ణి తన చెప్పుచేతుల్లోనే పెట్టుకొన్నాడు
బహురూపాల్లో చేసుకొన్నాడు అనేక ఆహారాలు వడ్డించాడు.
బలులు చేశాడు, యజ్ఞాలు, కర్మకాండలు నిర్వహించాడు.
చివరకు మనిషి తగ్గిపోయి దేవుడు ఆధిపత్యంలోకి వచ్చాడు.
నగలు, వస్త్రాలు, ఆభరణాలు,
భూములు, కానుకలు, పూజలు, సంతర్పణలు
ఒకటేమిటి?
చివరకు మెదడు కూడా దేవునికి అధీనమైంది.
ఏ రాయినో, రప్పనో నమ్ముకొన్న వాడికి
ఇక ఆలోచన అక్కరలేదు. ఎందుకని?
అన్నీ వాడే చూసుకొంటాడు
అంతటా వాడే వున్నాడు
ఒకనాడు నాలుగు కాళ్ల మనిషినుండి
రెండు కాళ్ల మనిషయ్యాడు
ఇప్పుడు రెండు కాళ్ళనుండి
ఎనిమిది కాళ్ల జంతువయ్యాడు
మరణం అంటే చార్వాకులు నిర్వచనం చెప్పారు
ఆ తరువాత ఏమీ లేదని.
కాని మరణాంతర జీవితం కోసమే వీడు బ్రతుకుతున్నాడు
దెయ్యాలను, భూతాలను, భయాలను సృష్టించుకొన్నాడు.
ప్రేమని, కరుణని, ఆత్మీయతను తునుమాడుతున్నాడు.
ఆలోచనకీ అస్తిత్వానికి మధ్య వున్న
తర్కాన్ని విడనాడాడు.
తత్వశాస్త్రం కాదు మనిషికి కావలసింది
భ్రమ, మాయ అని
అందులో కొట్టుమిట్టాడుతున్నాడు
సముద్రం ఎందుకు పొంగుతుందో తెలియదు
తుఫాన్ ఎందుకు వస్తుందో తెలియదు
మరొకడేమో, ఈ దేశమే నాదికాదంటున్నాడు!
దేశాని కొక దేవుడా! దేవుళ్ళకు జాతీయతా!
హద్దులా! విద్వేషాలా! ఆయుధ సంపత్తా! క్రూరచర్యలా!
మనిషి సౌమనస్యం ఎక్కడ?
ఎక్కడ క్రీస్తు! ఎక్కడ కబీర్! ఎక్కడ మానవత్వం?
మళ్ళీ మానవుడు నిద్రలేవాలి
మతాల కతీతమైన పరిణామ వాదాన్ని
అధ్యయనం చేయాలి.
జ్ఞాన ప్రపంచాన్ని సృష్టించాలి
'బెస్తవాడి మరణం సహజం కాదని
రాజ్య అలసత్వంలో భాగమని
పుట్టిన ప్రతి మనిషికి జీవించే హక్కు కావాలనే
ఉద్యమ ఉజ్వలనం కావాలి!'
వైజ్ఞానిక యుగం ఆవిర్భావానికి నడుం కడదాం రండి!
జీవన సౌందర్యాన్ని వికసింప చేద్దాం
అప్పుడే 'జీవించే హక్కు'కు జీవం వస్తుంది
జీవపరిణామ వాదం పునరుజ్జీవనం అవుతుంది.

**- డా॥ కత్తి పద్మారావు**
సెల్‌నం. 9849741695

*32వ పేజీ తరువాయి...*

లేదు. విగ్రహ విచ్ఛేదనం అతని కీర్తి గోపుర నిర్మాణంలో ప్రధానభాగం ఎలా కాగలదని వారి వాదన. తన వాదాన్ని అంగీకరించని వాళ్ళంతా, తిరువాన్‌కూరు సంస్థాన వారసుల చేత సన్మానాలను అందుకుంటున్న స్వార్థపరులే తప్ప, విచారణ శీలురు కారంటూ బాలచందర్ ఆరోపణ. ఏమైనా బాలచందర్ సాధించిన మహత్తర వైణిక కళాజీవితానికి ఈ వివాదం వల్ల ఏమీ ఘనత చేకూరలేదు. మీదు మిక్కిలి ఆయన జీవిత చరిత్రకు కళంకంగానే మిగిలిపోయింది.

భవిష్యత్తులో పరిశోధకులు  నిరహంకార నిర్మమత్వాలతో స్వాతి తిరునాళ్ సంగీత సాహిత్య ప్రజ్ఞా విశేషాల గురించి నిష్పక్షపాతంగా లోతైన పరిశోధన చేయవలసి ఉంది. అప్పటికి గాని ఈ రెండు వాదాలలో ఏది సత్యమో తేలడం కష్టమే...

**రచయిత ఫోన్ నం. 93478 48905**

తెలుగు చదువులు

- శ్రీ బి.ఎస్.రాములు

# తెలంగాణ తెలుగు వాచకాల విశిష్టత

**రా**ష్ట్ర ప్రభుత్వం సూచించిన లక్ష్యాలతో పాటు, తెలంగాణ రాష్ట్ర విద్యాపరిశోధన సంస్థ సూచించిన అంశాలను, ప్రాధాన్యతలను అనుసరించి ముప్పైమందికి పైగా ప్రొఫెసర్లు, విద్యావేత్తలు, విషయ నిపుణులు, క్షేత్రస్థాయి ఉపాధ్యాయులు కలిసి ఈ పాఠ్యపుస్తకాలకు రూపకల్పన చేశారు. వాచకాల ముందుమాటలో ఇలా పేర్కొన్నారు.

"ఎన్నో పోరాటాల ఫలితంగా మనం కోరుకున్న తెలంగాణ రాష్ట్రం జూన్ 2, 2014 రోజున ఆవిర్భవించింది. మన రాష్ట్రంలో మన భాషతో కూడిన పాఠ్యపుస్తకాల ఆధారంగా పిల్లలు భాషను నేర్చుకోవాలి. తెలంగాణ సంస్కృతి, భాష, చరిత్ర మొదలైనవి పిల్లలు తెలుసుకోవాల్సిన అవసరం ఉన్నది. ఇందుకోసం తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం పాఠ్యాంశాలను నిర్ణయించడానికి కమిటీని నియమించింది. కమిటీ సభ్యులు ప్రస్తుతం అమల్లో ఉన్న వాచకాలను సమీక్షించి తెలంగాణ ముద్ర ఉండేలా వాచకాలను రూపొందించడానికి కృషి చేశారు. తెలంగాణ రాష్ట్రంలో మన పిల్లల కోసం రూపొందిన తొలి వాచకాలు ఇవి".

ఈ పాఠ్య పుస్తకానికి తెలంగాణ రాష్ట్ర విద్యా పరిశోధన సంస్థ తన ముందుమాటలో లక్ష్యాలను ఇలా పేర్కొన్నారు. "ఉచిత నిర్బంధ విద్యాహక్కు చట్టం -2009 అమలులోకి వచ్చినందున పిల్లలందరు నాణ్యమైన విద్యను పొందే హక్కును కల్గి ఉన్నారు. ప్రాథమిక స్థాయి పూర్తయ్యేసరికి పిల్లలందరూ చదవడం, అర్థం చేసుకోవడం, సొంతంగా రాయడం వంటి కనీస సామర్థ్యాలను కల్గి ఉండాలి. వీటిని సాధించిన పిల్లలకు ప్రాథమికోన్నత స్థాయిలో వివిధ విషయాల అభ్యసనం సులువౌతుంది. ప్రాథమిక స్థాయిలో మాతృభాషపైన పట్టుకల్గి ఉన్న పిల్లలు ఇతర భాషలను కూడా సులువుగా నేర్చుకోగల్గుతారు. వీటిని దృష్టిలో ఉంచుకొని పిల్లలందరు పొందాల్సిన సామర్థ్యాలను విద్యా ప్రమాణాలుగా నిర్ధారించారు. ఈ నూతన పాఠ్యపుస్తకం వీటిని సాధించడానికి వీలుగా వినడం - ఆలోచించి మాట్లాడడం, చదివి అర్థం చేసుకోవడం, స్వీయరచన, సృజనాత్మకత, పదజాలాన్ని వినియోగించడం, భాషను గురించి తెలుసుకొనడం, ఉన్నతమైన వైఖరులను కల్గి ఉండడం వంటి సామర్థ్యాల ఆధారంగా రూపొందించారు.




**ఈ వాచకాలు భారతదేశంలోని ఇతర భాషా వాచకాలకు మార్గదర్శకంగా నిలిచేవిధంగా ఉన్నాయని రేడియోలో, టీవీల్లో అనేక భాషా వాచకాలు చూసిన విద్యావేత్తలు ప్రశంసించారు. వచ్చే ముద్రణకోసం ఈ వాచకాలపై విద్యార్థులనుండి, తల్లిదండ్రులనుండి, ఉపాధ్యాయులనుండి, సామాజిక శాస్త్రవేత్తలనుండి మరిన్ని సూచనలు, అనుభవాలు సేకరించడం అవసరం.**

పిల్లల్లో అంతర్లీనంగా ఉన్న సృజనాత్మకతను వెలికితీయుటకు పిల్లలే కథలు, కవితలు, సంభాషణలు వంటివి రాయడాన్ని ప్రోత్సహించేలా అభ్యాసాలు చేర్చారు. చదువడం, రాయడం నేర్చుకొన్న పిల్లలు మరింత మెరుగ్గా క్రమపద్ధతిలో భావవ్యక్తీకరణ చేసుటకు వీలుగా అభ్యాసాలు ఉన్నాయి. వీటితో పాటు భాషకు సంబంధించిన ప్రాథమిక పరిజ్ఞానం పిల్లలు పొందేలా 'భాషను గురించి తెలుసుకొందాం' అనే శీర్షికతో అభ్యాసాలు ఉన్నాయి. పిల్లలను ఆలోచింపజేయుటకు, మాట్లాడించుటకు, పాఠంలోని విషయాన్ని ఊహించుటకు, విషయాన్ని అర్థం చేసుకొనుటకు వీటిలో బొమ్మలు కూడా ఉన్నాయి.

పిల్లలు తమను తాము అంచనా వేసుకోవడానికి వీలుగా 'నేనివి చేయగలనా'? అనే స్వీయ మూల్యాంకన కృత్యాన్ని చేర్చారు. పిల్లల్లో నిఘంటువును చూసే అలవాటును పెంపొందించడానికి వీలుగా పాఠ్యపుస్తకం చివర 'పదాలు-అర్థాలు' జాబితాను చేర్చారు. అట్లే పఠనాభిలాషను, భావ ప్రసార నైపుణ్యాలను పెంపొందించడానికి 'ప్రాజెక్టు పనులను' పొందుపర్చారు. ప్రాథమిక స్థాయి పూర్తయ్యేసరికి పిల్లలందరు తప్పనిసరిగ చదువడం, రాయడం చేయగల్గాలి. దీన్ని దృష్టిలో పెట్టుకొని వాచక ప్రారంభంలో చదువడం, రాయడం నేర్పడానికి సంసిద్ధత పాఠాలు చేర్చారు. తెలంగాణ రాష్ట్రంలో వచ్చిన తొలి వాచకం ఇది. కాబట్టి భాషాపరంగ లేదా ఇతర అంశాల గురించి విజ్ఞులు ఇచ్చే సలహాలు, సూచనలు ఎస్.సి.ఇ.ఆర్.టి. స్వీకరించి తగు చర్యలు చేపడుతుంది. ఈ వాచకం పిల్లల్లో భాషాభిరుచిని పెంచి ప్రాథమికోన్నతస్థాయికి అవసరమైన భాషా సామర్థ్యాల సాధనకు తోడ్పడుతుందని ఆశిస్తున్నాం'' అని తెలుగువాచకాల ముందుమాటలో పేర్కొన్నారు.

ఈ పాఠ్యపుస్తకాల ద్వారా పిల్లలు వినడం - ఆలోచించి మాట్లాడడం ధారాళంగా రావాలి. గేయాలు, పాటలు, కథలు, సంభాషణలు మొదలయిన వాటిని విని అర్థం చేసుకోవాలి. సారాంశాలను క్రమపద్ధతిలో సొంత మాటల్లో చెప్పగలగాలి. చర్చల్లో పాల్గొనగలగాలి. అభిప్రాయాలు చెప్పగలగాలి. చిన్న చిన్న ప్రసంగాలు ఇవ్వాలి. తెలిసిన వాటి గురించి చెప్పగలగాలి. కారణాలు వివరించగలగాలి. సమర్థిస్తూ విభేదిస్తూ మాట్లాడగలగాలి. బాల సాహిత్యం, వార్తా పత్రికలు, మేగజైన్‌లు, అపరిచిత అంశాలు చదువగలగాలి, అర్థం చేసుకోవాలి. భాషాభాగాలు, కాలాలు, విరామ చిహ్నాలు ఉపయోగించగలగాలి, కాలాలకు అనుగుణంగా క్రియలు ఉపయోగించగలగాలి. సమాపక, అసమాపక క్రియలను గుర్తించి ఉపయోగించగలగాలి.

ఈ దృష్టితో ఇటీవల ప్రచురించిన తెలంగాణ తెలుగు నూతన వాచకాలలోను అనేక ప్రత్యేకతలున్నాయి. పాఠ్యపుస్తకాల స్వభావంలో మౌలిక మార్పు కనపడుతున్నది. పాఠ్యాంశాలను ప్రధానంగా ఐదు అంశాలను దృష్టిలో ఉంచుకొని ఎంపిక చేశారు. అవి: 1 దేశభక్తి విలువలు, మానవ సంబంధాలు, 2. పిల్లల స్వభావం, శక్తి సామర్థ్యాలు, ఆసక్తులు, 3. పర్యావరణం, ప్రకృతి,




సమాజం, 4. సంస్కృతి, సంప్రదాయాలు, భాషాభిరుచి, 5. హాస్యం, కాల్పనికత, సృజనాత్మకత. వీటికి సంబంధించిన వివిధ ప్రక్రియల్లోని పాఠాలు పొందుపర్చారు. కథలు, కథనాలు, పద్యాలు, సంభాషణలు, వ్యాసాలు, గేయకథలు, పాఠాలుగా ఉన్నాయి. ప్రతి పాఠం కూడా పిల్లల్లో ఆసక్తిని రేకెత్తించడానికి చిత్రంతో ప్రారంభం అవుతుంది. సొంతంగా చదువుకొని అర్థం చేసుకొనేలా సరళమైన భాష ఉన్నది.

ఉపాధ్యాయులు ఈ పాఠ్యపుస్తకాన్ని భాగస్వామ్య పద్ధతుల్లో పిల్లలందరూ పాల్గొనేలా బోధనాభ్యసన ప్రక్రియలు నిర్వహించాలి. పిల్లలందరూ స్వేచ్ఛగా మాట్లాడేలా, ప్రశ్నించేలా చక్కటి వాతావరణాన్ని కల్పించాలి. బాల సాహిత్యం, కథల పుస్తకాలు, మేగజైన్ల వంటివి తరగతిలోనే అందుబాటులో ఉంచాలి...

వచ్చే ముద్రణలో కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. ఉదాహరణకు 'మా అమ్మ గుమ్మడికాయ కూర వండింది' అని చూచిరాతకు ఇచ్చారు. గుమ్మడికాయ కూర కొందరే వండుకుంటారు. అందువల్ల అందరూ వండుకునే కూరగాయను సూచిస్తే బాగుంటుంది. వచ్చే ముద్రణలో ఈ మార్పు చేయాలి. దానికి బదులుగా 'మా అమ్మ చిక్కుడుకాయ కూర వండింది' అని రాయవచ్చు. వచ్చే ముద్రణలో ఈ పని చేయడం అవసరం. అంతేకాకుండా తెలుగుమీడియంలో చదువుకునే ముస్లిం, క్రైస్తవ, సిక్కు, బౌద్ధ మతాల పిల్లలు శ్రీకృష్ణుడ్ని పతిగా భావించే పాఠాలు ఉంటే చాలా ఇబ్బంది. ఇలాంటి పాఠాల వల్ల వారు, వారితోపాటు పేద విద్యార్థులు చదువులో వెనుకబడిపోయే అవకాశం ఉంటుంది. అనగా ఇలాంటి పాఠాల వల్ల ప్రత్యక్షంగా, పరోక్షంగా కొన్ని సామాజిక వర్గాలను విద్యలో ముందుకు రాకుండా వెనక్కినెట్టే ప్రయత్నం కనపడుతుంది. పూర్వం ఈ ప్రయత్నం వాచకం మొత్తం నిండా ఉండేది. ఇప్పుడు చాలా తగ్గడం సంతోషకరమైన విషయం. ముస్లింల, క్రైస్తవుల పండుగలు, సంస్కృతి గురించి కూడా ఆయా తరగతి వాచకాల్లో చక్కగా పరిచయం చేయడం అభినందనీయం.

ప్రాథమిక వాచకాల్లో స్థానిక తెలంగాణ భాషలోనే వాక్య నిర్మాణం ఉండడం అవసరం. వాడుకలో లేని సంస్కృత పదాలను తగ్గించి, వాడుకలో గల తెలుగు, హిందీ, ఇంగ్లీషు, ఉర్దూ, మరాఠీ, గోండి, లంబాడీ, కోయ భాషా పదాలను స్వీకరించాలి. సంస్కృత పదాలను భారతదేశ వ్యాప్తంగా అన్ని భాషల్లో ఒకే అర్థంలో వాడేవిధంగా జాతీయస్థాయిలో ప్రెస్‌గిల్డు వలే ఒక ప్రత్యేక కమిటీని ఏర్పాటు చేసి నిర్ధారించి సూచించాలి.

తెలంగాణ రాష్ట్రంలోని మహనీయుల గురించి, కళల గురించి, హిందూ, ముస్లిం, క్రిస్టియన్, మార్వాడి, గుజరాతీ, సిక్కులు, తమిళులు కలిసి జీవిస్తున్న పేరాను ఇచ్చి వాటి గురించి భాషాంశాలను అభ్యాసం కింద ఇచ్చారు. ప్రాజెక్టుపనిలో వేములవాడ, భద్రాచలం, మెదక్, జాన్‌పహాడ్ వంటివి మన తెలంగాణ రాష్ట్రం గొప్పతనాన్ని తెలిపేవి. అలాంటివి ఇంకేమి ఉన్నాయో వాటిని తెలుసుకొని రాయండి అని కోరారు. కథల ద్వారా హాస్యరసాన్ని పిల్లలకు అందించి, ఆనందింపజేయడం కోసం 'పరమానందయ్య శిష్యులు' కథను చేర్చారు. గాడిదమీద కూర్చున్న మనిషి తన నెత్తిమీద మూట పెట్టుకోవడం చూసి పిల్లలు నవ్వుతున్న బొమ్మను వేశారు. ఆ బొమ్మ గురించి కొన్ని ప్రశ్నలు ఇచ్చి పిల్లల్లో ఆలోచనా శక్తిని, పరిశీలనా శక్తిని పెంచడానికి అవకాశం కల్పించారు. పరమానందయ్య శిష్యుల గురించిన చక్కని సుప్రసిద్ధ కథలను, మరింత చక్కని బొమ్మలు వేసి అందించిన తీరు ప్రశంసనీయం.

'దేశమును ప్రేమించుమన్నా' పాఠంలో పాఠశాలలో ప్రార్థన చేసే విద్యార్థుల ఫోటోను ప్రచురించారు. గురజాడ రాసిన 'దేశమును ప్రేమించుమన్నా, మంచి అన్నది పెంచుమన్నా...' అనే సుప్రసిద్ధ గేయాన్ని ఇచ్చారు. తెలంగాణ ప్రభుత్వ రాజముద్ర ఇచ్చి దానిలోని విశేషాలను పేర్కొన్నారు. చార్మినార్, కాకతీయ కళా తోరణం నిర్మించిన సందర్భాలను గురించిన పేరా ఇచ్చి చరిత్రను పరిచయం చేశారు. పాఠం చివర మహా రచయిత మున్షీ ప్రేంచంద్ చెప్పిన 'నిండు మనసుతో సమాజసేవ చేసేవారికి గౌరవ ప్రతిష్టలు దాసోహమంటాయి' అనే సూక్తిని చేర్చడం పాఠం యొక్క సారాంశాన్ని ఒక్కమాటలో చెప్పినట్టుగా ఉంది.

సుమతీ శతకంలోని 'ఊరికి ఉపకారము, చీమలు పెట్టిన పుట్టలు, తన కోపమె తనకు శత్రువు, ఎప్పుడు సంపద కలిగిన, వినదగునెవ్వరు చెప్పిన, బలవంతుడ నాకేమని, కూరిమిగల దినములలో, లావు గలవానికంటెను అనే 8 పద్యాలు, వాటి తాత్పర్యం, వాటికి సంబంధించిన

బొమ్మలు ఇచ్చారు. ఈ పద్యాలు జీవితమంతా ఉపయోగపడతాయి. పిల్లల్లో ఆధునిక అంశాలను పరిచయం చేసే విధంగా కపిల్‌దేవ్ వేగంగా బౌలింగ్ చేసేవాడు వంటి వాక్యాలు చేర్చడం చాలా బాగుంది. విశేషణాలను మరింత వివరంగా తెలుసుకోవడానికి ఇక్కడ విశేషణాలను తారుమారుగా ఇచ్చి పరిశీలనా శక్తికి పదును పెట్టే కృషి చేశారు. 'నీతి మాటలు వినడం ఎంతో ముఖ్యం వాటి ఆచరణ అంతకంటే ముఖ్యం' అనే గొప్ప సూక్తిని పాఠం చివర చేర్చి ఆచరణ ప్రాధాన్యతను నొక్కి చెప్పారు.

'చదువు – చదివించు'లో రంజాన్ గురించి అనేక వివరాలు, పండుగ జరుపుకునే తీరు వివరించారు. ఈ పండుగలో మహమ్మదీయ సోదరులతో పాటు, ఇతర మతాలవారు కూడా భాగస్వాములవుతారు. ఈద్, 'ఈద్–ఉల్–ఫితర్', ఈద్ ముబారక్, ఈద్గా, ఖురాన్, షవ్వాల్ నెల, ఫసలీ కాలమానం ప్రకారం జకాత్ మహ్మద్ ప్రవక్త, నమాజ్, మసీదు, 'తరావిహ్', ఇఫ్తార్ విందు మొదలైన పదాలను, వాటి విశేషాలను పరిచయం చేసి పిల్లల్లో పరస్పర అవగాహన పెరగడానికి వాచక రూపకర్తలు చక్కని కృషి చేశారు.

తెలంగాణ రాష్ట్రంలో ఊరి చెరువుల ప్రాధాన్యత గురించి చక్కని పాఠాలు ఉన్నాయి. 'చెరువు... ఊరి చెరువు, ప్రజల బతుకుల గుండె దరువు, పంట గుండు మునిగి అలుగు పారిందంటె, ఏడాది పొడుగూత ఉండదిక కరువు', 'చెరువు నిండిందంటే ఊరంత సంబురం, కట్టమైసమ్మకు కనువిందు బోనం, ఈ చెరువు దుంకితే ఆ వూరు మురిసేది, గొలుసు చెరువుల కట్ట గొప్పకనికట్టు', 'చెరువుల్ల నీళ్ళుంటె బాయి ఊటలు మెండు...', 'కల్లంల జానపద కళలకే మురిపెం, బంతి తిరుగుత వుంటె బతుకల్ల ధైర్నం, అడుగు నూకేతల్లి ఆశ బంగారం, చెమట చుక్కే మెతుకు చెరువు చుట్టే బతుకు' అని తెలంగాణ భాష, నుడికారంతో చెరువు పాట సాగుతుంది.

ప్రతి వాచకంలో, ప్రతి పాఠం చివర చాలా జాగ్రత్తగా, సులువుగా అర్థమయ్యేవిధంగా వ్యాకరణాంశాలు చేర్చారు. ద్విత్వాక్షరాలు, సంయుక్త అక్షరాలు, జంట పదాలు, సమాసాలు, సంధులు, విభక్తి ప్రక్రియలు, వాక్య నిర్మాణంలోని శైలి, వైవిధ్యం, భాషా భాగాలు, అలంకారాలు, ప్రకృతి వికృతులు, పదాలను వాక్యాల్లో రాయడం, ఒక కొత్త అంశంపై ఐదు, పది వాక్యాల్లో రాసి ప్రదర్శింపజేయడం మొదలైనవి ఎన్నో స్వయంగా విద్యార్థులే అర్థం చేసుకునేవిధంగా వివరించడం ప్రశంసనీయం. క్రియాపదాల్లో వాక్యం పూర్తయిన క్రియ, వాక్యం పూర్తికాని క్రియలు ఎలా ఉంటాయో, ఎలా మారుతుంటాయో చూపించారు. పూర్తయిన క్రియను సమాపక క్రియ అని, వాక్యం పూర్తికాని క్రియను అసమాపక క్రియ అని సులభంగా అర్థం అయ్యేట్టే చెప్పారు. ప్రాజెక్టు పనిగా మీ ఊరి చుట్టుపక్కల ఉన్న చెరువుల వివరాలను మీకు తెలిసిన పెద్దవారి సహాయంతో సేకరించి రాయండి, తరగతి గదిలో ప్రదర్శించండి అని కోరారు.

పాఠం తర్వాత మనిషికి ఆహారం, సహపంక్తి భోజనాలు మొదలైన వాటిని గురించిన పేరా ఇచ్చి ఒక్కొక్క వాక్యంలో ప్రశ్నలకు జవాబులు రాయిమని కోరారు. సూర్పిడి, కలుపు, నాటు, బియ్యం, వడ్లు, బువ్వ, మిల్లు, ప్రయాణం, టిక్కెట్టు, బస్సు, బస్స్టాండు, ఇల్లు, పునాది, కప్పు, గోడ, నీరు, తాడు, బావి, బక్కెట్టు వంటి పదాలను వరుసక్రమం నుంచి రాయిమని సూచించారు. తద్వారా వాక్య నిర్మాణం రూపొందే క్రమాన్ని అర్థమయ్యే విధంగా పేర్కొనడం బాగుంది. భాష గురించి అంశాల్లో జిత్తుల, తెల్లని, పచ్చటి వంటి పదాలను ఇచ్చి భాషాభాగాల్లోని విశేషణాలను పరిచయం చేసినారు. ప్రాజెక్టు పనిలో చుట్టుపక్కల ఆహార పదార్థాలు ఏవిధంగా వృథా అవుతున్నాయో వాటిగురించి నివేదిక రాసి ప్రదర్శించమని కోరారు. 'అన్నం పరబ్రహ్మ స్వరూపం, ఆహారాన్ని వృథా చేయకూడదు' అనే ఉపనిషత్తు సూక్తితో పాఠం ముగించడం సందర్భోచితంగా ఉంది.

పదజాలం శీర్షికలో ఆయా పదాలతో వాక్యాల నిర్మాణం చేయడాన్ని సూచించారు. ఒక పదం నుంచి మరొక పదం తయారుచేసే విధానాన్ని, రామాపురం, కాపురం అని పరిచయం చేశారు. రకరకాల వాయిద్యాల బొమ్మలు సేకరించాలని ప్రాజెక్టు వర్కు ఇచ్చారు. 'పరోపకారంకు మించిన గుణం లేదని' సూక్తి పొందుపరిచారు. 6వ తరగతి పాఠ్య పుస్తకం నుండి 8వ తరగతి వరకు 'నవవసంతం' అనే ఉప శీర్షిక చేర్చారు. తొమ్మిది, పది తరగతి వాచకాలకు 'సింగిడి' అని ఉపశీర్షిక ఉంచారు.

పాఠశాలలో అది ప్రాథమిక పాఠశాల అయినా, యుపిఎస్ అయినా, హైస్కూల్ అయినా ప్రతి స్థాయిలో విద్యార్థినీ విద్యార్థులను చక్కని ఆటపాటల్లో పూర్తిగా పాల్గొనేటట్లు చేయాలి. చురుకైన విద్యార్థులుగా మలచాలి. ప్రతి క్లాసులో, అలాగే ప్రజల్లో, ఉద్యోగుల్లో, ఉపాధ్యాయుల్లో, నాయకుల్లో మూడు దశల, మూడు స్థాయిల వారుంటారు. కొందరు అందరికన్నా హుషారుగా, చురుకుగా చెప్పగానే అర్థం చేసుకుంటారు. వీరు అన్నిట్లో ముందుంటారు. కొందరు పాఠాల్లో ముందుంటారు. మరికొందరు ఆటపాటల్లో ముందుంటారు. మరికొందరు సగటుగా ఉంటారు. ఒకటిరెండు సార్లకు వారు అర్థం చేసుకుంటారు. చురుకైన వారితో పోటీపడి ముందుకు సాగుతారు. మరికొందరు వెనుకబడిపోతారు. వీరికి ఎంతో శ్రద్ధతో అనేకసార్లు ఎంతో ప్రేమగా, ఆత్మీయంగా చెప్తే తప్ప ముందుకు సాగలేరు. వాళ్ళు అలా ఉండడానికి అనేక కారణాలు ఉంటాయి. పేదరికం కావచ్చు. ఇంట్లో అవకాశాలు లేకపోవడం కావచ్చు. తల్లిదండ్రులు నిరక్షరాస్యులవడం కావచ్చు. ఇంటిపనిలో, తల్లిదండ్రుల పనిలో కొంత పాల్గొని, ఆర్థికంగా ఆదుకొనే క్రమంలో ఉండాల్సి రావచ్చు. అంగవైకల్యం కావచ్చు. మానసికంగా ఎదుగుదల లేకపోవచ్చు. పోషక ఆహారం లేక నీరసించి పోవచ్చు. జ్ఞాపకశక్తి తక్కువ కావచ్చు. ఇలా అనేక కారణాల రీత్యా మూడింట ఒక వంతు ఏ రంగంలోనైనా సరే వెనుకబడి సాగుతుంటారు. విద్యార్థుల్లో ఇలాంటివారు బాధపడేవిధంగా, మరింత వెనుకబడేవిధంగా తోటి విద్యార్థులు, ఉపాధ్యాయులు ప్రవర్తించడం వల్ల వాళ్ళు ఇంకా వెనుకబడిపోతారు. అల్పత్వ భావనకు గురవుతారు. వారిలో కూడా అనేక సృజనాత్మక శక్తులు ఉంటాయి. వాటిని వెలికి తీయడం ద్వారా తోటి పిల్లల్లో తాను కూడా సగర్వంగా తలెత్తుకొనే అవకాశం ఉంటుంది. అందువల్ల ఆటపాటలు, సాంస్కృతిక కార్యక్రమాలు, రకరకాల పోటీలు ఎంతో అవసరం. ఈ విషయాన్ని గమనించి టోటోచాన్, 'రైలుబడి' అనే పుస్తకంలో తమ అనుభవాలను చక్కగా వివరించారు. కుంటివాళ్ళు మాత్రమే గెలుపొందే విధంగా ఆటలు రూపొందించి వారిలో ఆత్మవిశ్వాసం పెంచారు. ఇలా ఉపాధ్యాయులు సృజనాత్మకంగా ఆలోచించినపుడే పిల్లలందరు ఎదిగే అవకాశం ఉంటుంది.

ఎనిమిదో తరగతి వాచకంలో చదవండి – తెలుసుకోండి శీర్షికలో ఉద్యమ దీపిక టి.ఎన్. సదాలక్ష్మి గురించి సంక్షిప్తంగా పరిచయం చేశారు. ఆమె సామాజిక ఉద్యమకారిణిగా, రాజకీయ నాయకురాలిగా, తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమానికి నాయకురాలిగా చేసిన కృషిని ఇందులో పరిచయం చేశారు. 'సింగరేణి' పాఠం ప్రారంభంలో బొగ్గుగని కార్మికుల ఫోటోను ప్రచురించారు. ఈ పాఠం వ్యాస ప్రక్రియకు చెందినది. సింగరేణి బొగ్గుగనులు, బొగ్గు ఉత్పత్తి గురించి సమాచారాన్ని తెలుపుతుంది ఈ వ్యాసం. సింగరేణి గనుల పుట్టుక, పనివిధానం, అందులో పని చేసేవారి పదవులు, హోదాల పేర్లు వివరించి చక్కని అవగాహన కలిగించారు.

ఉపవాచకంలో 1. చిత్రగ్రీవం, 2. షోయబుల్లాఖాన్, 3. చిందు ఎల్లమ్మ, 4. ఇల్లు – ఆనందహరివిల్లు, 5. జానపద కళలు, 6. పి.వి. నరసింహారావు

పాఠాలు చేర్చారు. ఉపవాచకంలో తెలంగాణ సమాజంలో ఎదిగివచ్చిన ఉద్యమకారులైన షోయబుల్లాఖాన్, గొప్ప కళాకారిణి ఐన సింధు ఎల్లమ్మ, దేశానికి ప్రధానమంత్రిగా పనిచేసి దేశాభివృద్ధి మలుపు తిరగడంలో కీలక పాత్ర వహించిన పి.వి. నరసింహారావు గురించి, అలాగే జానపద కళల గురించి వివరించడం విద్యార్థుల్లో ఒక ఉదాత్త వ్యక్తిత్వ వికాసానికి బీజం వేస్తుంది.

ఒక్కొక్క పాఠం ఒక్కొక్క చరిత్రను, సామాజిక అంశాలను, చరిత్రను, మానవీయ విలువలను, మానవ సంబంధాలను, కర్తవ్యాలను తెలుపుతాయి. చివరి అట్ట పైన పాఠాల్లోని మహనీయుల ఫోటోలు ప్రచురించడం బాగుంది. ఇంగ్లాండు ప్రయాణం గురించిన ఓడను కూడా వెనుక అట్టపై చిత్రించారు. ఈ ఎనిమిదో తరగతి వాచకంలో విద్యార్థులకు అనేక సూచనలు చేశారు. ఈ సూచనలు విద్యార్థుల పఠనాసక్తిని, అభిరుచిని, సృజనాత్మక శక్తిని ఎంతగానో పెంపొందిస్తాయి.

సాధారణంగా నేటి పిల్లలు ఐదో తరగతి నుండి సొంతంగా కథలు, కవితలు, పాటలు మొదలైనవి రాస్తున్నారు. ఇంగ్లీషు మీడియంలో కూడా ఇలా కథలు, కవితలు, పాటలు, వ్యాసాలు, లేఖలు సొంతంగా రాస్తున్నారు. మునుపటి కన్నా, మా కాలం కన్నా, ఈనాటి పిల్లలకు ఎన్నోరెట్ల శక్తి సామర్థ్యాలు, సృజనాత్మక శక్తి పెరిగాయి. పరిసరాలే ఆ అవకాశాన్ని ఇస్తున్నాయి. అందువల్ల వారిని చక్కగా ప్రోత్సహించాలి. ప్రతి రెండు నెలలకు ఒకసారి స్కూలులో, క్లాసు వారీగా లిఖిత పత్రిక తీసుకురావడం అవసరం.

ఉన్నత పాఠశాలలో ఈ మధ్య ఆట, పాటలు బాగా తగ్గిపోయాయి. పదో తరగతి, ఇంటర్‌మీడియట్‌కు, ఆ తర్వాత చదవాల్సిన ఇంజనీరింగ్, మెడిసిన్ ఆప్షనల్ కోర్సులకు అనువుగా ప్రైవేట్ పాఠశాలల్లో విద్యార్థులపై రుద్దుడు కార్యక్రమం, విద్యార్థులను రుబ్బుడు కార్యక్రమం చేస్తున్నారు. దీన్ని అరికట్టకపోతే విద్యార్థుల్లో ఆలోచన, వివేచన, పరిశీలన, ఊహాశక్తి, సృజనాత్మకత, ఉత్సాహం, ఆసక్తి నశిస్తుంది. పిల్లలు ఏ రంగంలో ఎదిగినప్పటికీ, యంత్రాల్లా తయారవుతారు. స్వంత వ్యక్తిత్వం, సమాజంపట్ల అవగాహన, కుటుంబ సంబంధాల్లో, ఇరుగుపొరుగు సంబంధాల్లో, ఆటపాటల్లో వెనుకబడిపోతారు. తద్వారా శారీరక, మానసిక ఎదుగుదలలో అడ్డంకులు ఏర్పడతాయి. అలా కాకుండా విద్యార్థుల మానసిక వికాసానికి, శారీరక వికాసానికి ఆటపాటలు, సాంస్కృతిక కార్యక్రమాలు, పాఠశాల సంచికల ప్రచురణ మొదలైన అన్ని ప్రక్రియలకు ప్రాధాన్యత యివ్వడం అవసరం.

పాఠశాల అనేది కేవలం పాఠాలు చెప్పడానికి పరిమితం కాకూడదు. పాఠశాలలో, పాఠశాలల మధ్య ఆటల పోటీలు, టోర్నమెంట్స్ ప్రతి మూడు నెలలకోసారి నిర్వహించడంవల్లనే విద్యార్థుల్లో అనేక సామర్థ్యాలు వెలికివస్తాయి. మేము ముద్దు రామకృష్ణయ్య ప్రధానోపాధ్యాయులుగా ఉన్నప్పుడు జగిత్యాలలో 1960-65లలో ఇవన్నీ చేసినవారమే. ముద్దు రామకృష్ణయ్య గురించి ఈ వాచకాల్లో ఒక పాఠం ఉంది. మాకు ఇలాంటి అవకాశాలు ఆనాడే కల్పించబడ్డాయి. నేడు గదుల్లో కుక్కి చదువు చెప్తున్న తీరును పూర్తిగా మార్చివేయాలి. అప్పుడే మన రేపటి సమాజంలో గొప్ప గొప్ప కళాకారులు, రచయితలు, శాస్త్రవేత్తలు, నాయకులు, అనేక రంగాల నిపుణులు ఎదుగుతారు.

బ్రిటన్‌లో, అమెరికాలో శిక్షణ పొందినవారికే ఉపాధ్యాయులుగా పనిచేయడానికి అనుమతి ఉంటుంది. ఒకటో తరగతి నుండి పన్నెండో తరగతి వరకు బ్రిటన్, అమెరికాల్లో ఉచిత విద్య అందిస్తూ ప్రభుత్వ, మున్సిపాలిటీ సంస్థల ఆధ్వర్యంలో నడుస్తాయి. ప్రైవేటు పాఠశాలలు చాలా తక్కువ. అవి లెక్కించదగినంత లేవు. ఈ రెండు దేశాలను భారతదేశం అనేక రంగాల్లో ఆదర్శంగా తీసుకుంటున్నది. అలాగే విద్యలో, విద్యా బడ్జెట్‌లో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఈ ఆదర్శానికి ప్రాధాన్యత ఇస్తే దేశం నూరు శాతం అక్షరాస్యత సాధించడం ఎంతో దూరంలో ఉండదు. మిజోరాంలో అన్నింటికన్నా విద్యకు ప్రాధాన్యత ఇవ్వడం వల్ల కొన్ని సంవత్సరాల్లోనే దేశంలో నూరు శాతం అక్షరాస్యత సాధించిన రాష్ట్రంగా అభివృద్ధిని సాధించింది.

విద్య ద్వారానే ఆధునిక అభివృద్ధి, ఆధునిక ఉపాధి, ఉద్యోగాలు లభిస్తాయి. విద్య ద్వారానే సమాజం ముందుకు సాగుతుంది. విద్య అంటే మానవ సమాజం ఇంతదాకా ప్రపంచవ్యాప్తంగా సాధించిన విజ్ఞానాన్ని, అనుభవాలను, గుణపాఠాలను, సంస్కృతిని, భాషను, సంస్కారాన్ని, మానవీయ విలువలను, చరిత్రను తెలుసుకోవడం. స్వేచ్ఛ, సమానత్వం, ఆత్మగౌరవం, మనుషులందరూ ఒక్కటే అనే చైతన్యంతోపాటు సమాజ అభివృద్ధికి విద్య మౌలికమైన అవసరం. మన దేశంలో ఒకటో తరగతిలో 100 మంది చేరితే పదో తరగతికి వచ్చేసరికి 8 మంది మాత్రమే మిగులుతున్నారు. కెజి నుంచి పిజి దాకా ఉచిత విద్య, సింగిల్ విండో విధానంతో అందిస్తే ఈ డ్రాపవుట్స్ ఉండవు. తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఈ విషయంలో లోతుగా ఆలోచించి అనేక కోణాల్లో విశ్లేషించి కెజి నుంచి పిజి రెసిడెన్షియల్, ఉచిత విద్య అందించే ప్రణాళిక ప్రకటించింది.

ఒకటో తరగతి నుండి పదో తరగతి వరకు అన్ని పుస్తకాలను తల్లిదండ్రులు, విద్యావేత్తలు, సామాజిక శాస్త్రవేత్తలు, ఉద్యోగులు అందరూ ఒక్కసారి చదవాల్సిన అవసరం ఉంది. తద్వారా తాము చదివిన కాలం నాటి వాచకాలకు, నేటి వాచకాలకు మధ్య ఎంత తేడా ఉందో తెలుస్తుంది. ఇది తొలి ప్రయత్నం. ఈ వాచకాలు భారతదేశంలోని ఇతర భాషా వాచకాలకు మార్గదర్శకంగా నిలిచేవిధంగా ఉన్నాయని రేడియోలో, టీవీల్లో అనేక భాషా వాచకాలు చూసిన విద్యావేత్తలు ప్రశంసించారు. వచ్చే ముద్రణకోసం ఈ వాచకాలపై విద్యార్థులనుండి, తల్లిదండ్రులనుండి, ఉపాధ్యాయులనుండి, సామాజిక శాస్త్రవేత్తలనుండి మరిన్ని సూచనలు, అనుభవాలు సేకరించడం అవసరం.

**రచయిత ఫోన్ : 8331966987**

పద్యం

# మేలుకొలుపు

సీ॥ **వే**మన పద్యాలు వినరావా! చదువవా!
బ్రతుకు దీర్చెడి మైలురాళ్లు-నిజము;
సుమతి శతకరీతి చూడవో! తెలుగు మా
కందాలె - కందాలె- అందుకొనుము!
భాస్కర శతకాన పద్యదృష్టాంతాలు
కనరమ్ము - లోకజ్ఞ ఘనత గొనుము!
శక్తిప్రదాలు-సద్భక్తి పూర్వకములౌ
శతకాలు పఠియించి శాంతిగనుము!

మహితహితమును గూర్చెడి మనదు మాతృ
భాషపై పట్టు కోల్పోవ భావ్యమగునె?
నేడు లెమ్మిదే! నిద్దుర వీడిరమ్ము!
'అమ్మనుడి' పిలుచుచున్నది అందుకొనుము!!!

*- డా॥ రామడుగు వేంకటేశ్వర శర్మ*
సెల్‌నం. 9866944287

వ్యక్తిత్వం

- శ్రీ దివికుమార్

# నిప్పుకు నివురు తొలగుతున్న వేళ...



**గత** జూన్ నెల ఆఖరి ఆదివారంనాడు విజయవాడ నగరంలో చారిత్రాత్మకమైన సాహిత్య సంఘటన ఒకటి జరిగింది. 86 ఏళ్ళ చిత్తజల్లు వరహాలరావు (సి.వి)గారికి వెయ్యిమందికిపైగా హాజరయిన ప్రజాసాహితీ సాంస్కృతికోద్యమ రచయితలు, దళిత, హేతువాద సంఘాల, వామపక్ష రాజకీయాభిమానుల సమక్షంలో 28-6-2015న ఉదయం 10 గంటలనుండి సాయంత్రం 7గంటలదాకా ఆత్మీయ అభినందన పురస్కారం జరిగింది. పాలక పార్టీల రాజకీయ నాయకులూ, మంత్రులూ ఎం.ఎల్.ఏ.లు, ప్రభుత్వ ఉన్నతాధికారులూ ఒక్కరూ కూడా ఆహ్వానితులు కాకపోవడం ఆ సభకున్న మరొక ప్రత్యేకత. సి.వి. సాహిత్యంతో ప్రేరితులైన పాఠకుల, అభిమానులతో వెల్లివిరిసిన ప్రజా సత్కార సభ అది. కవి జీవించి వుండగానే యింతటి ప్రజా పురస్కారాన్ని గౌరవాన్ని పొందిన వారిలో పేర్కొనదగినవాడు ఇంతవరకు మహాకవి శ్రీశ్రీ ఒక్కడే.

సుమారు 45 ఏళ్ళ క్రితం ప్రొద్దుటూరునుండి వెలువడిన 'ప్రభంజనం' పత్రికలో వరవరరావు ఒక వ్యాసం రాస్తూ యిలా అన్నారు. 'కాలమానానికి నిలిచే అభ్యుదయకవి శ్రీశ్రీ తరువాత సి.వి.మాత్రమే'. పై కావ్యాలకు ('త్వమేవాహం', 'వజ్రాయుధం', 'తెలంగాణా', 'ఉదయిని') వస్తువు తెలంగాణకే పరిమితమైతే 'మహాప్రస్థానాని'ది విప్లవ విహంగ దృష్టి అయితే, ప్రజాసమస్యల గర్భంలోకే చొచ్చుకొనిపోయిన నిశితదృష్టి సి.వి.ది. 'విషాద భారతం' ఈ 20 సంవత్సరాల భారత విషాదాన్ని కళ్ళముందు నగ్నంగా చూపుతుంది. 'కారుచీకటిలో కాంతిరేఖ' క్షీణించిపోతున్న అభ్యుదయ కవితాయుగంలో వెలిగొచ్చిన ఆశారేఖ. 1950 తర్వాత కాలంలో సి.వి. కావ్యాలు మినహా అభ్యుదయాంశం వున్న కావ్యాలు రాలేదు'. అభ్యుదయ సాహిత్యోద్యమకారునిగా ప్రజా పురస్కారాన్ని శ్రీశ్రీ తర్వాత అందుకున్న ఘనతకూడా సి.వి.దే.

అప్పటికొక ఆరునెలలకు ముందు 2015 జనవరి 14నాడు సి.వి. 86వ పుట్టినరోజు సందర్భంగా 'విస్మరణకు గురయిన చారిత్రాత్మక కవి, రచయిత సి.వి' అని ఆంధ్రజ్యోతిలో నేనొక వ్యాసం రాశాను. దానికి 15రోజుల ముందు 'ప్రజాసాహితి' పత్రికలో 125 మందికి పైగా రచయితలు 'ఆంధ్రప్రదేశ్ కొత్త రాజధాని ప్రక్రియను ఖండిస్తున్నాం' అంటూ విడుదల చేసిన ప్రకటనలో సి.వి. పేరు ప్రముఖంగా వుంది. దానితో ఆయన యింకా జీవించే వున్నారా? అంటూ మాకు ఫోన్ల మీద ఫోన్లు వెల్లువెత్తాయి. 45 సంవత్సరాలపాటు విభిన్న ప్రక్రియలలో 28 పుస్తకాలు రాసిన సి.వి.ని పాఠకుల హృదయాలలో అంతగా స్థానం సంపాదించుకున్న రచయితను తెలుగు సాహిత్యం తగువిధంగా గుర్తించి గౌరవించలేదంటూ నేను ఆంధ్రజ్యోతిలో రాసిన వ్యాసం కూడా కొంత సంచలనాన్ని కలిగించిందనే చెప్పాలి.

సి.వి. రాసిన 500 పేజీల 'పారిస్‌కమ్యూన్' మహాకావ్యం మినహా దానికంటె ముందు ప్రచురణ అయిన 'విషాదభారతం' 'నరమేధం' 'సత్యకామ జాబాలి' అనే కావ్యాలూ, 'కారుచీకటిలో కాంతిరేఖ' 'ఊళ్ళోకి స్వాములవారు వేంచేశారు' అనే కవితా సంకలనాలూ, 'ఏడుకొండలవాడా గోవిందా! గోవిందా!!' అనే దీర్ఘకవితా, అనేకానేక ముద్రణలైనాయి. ఇంకా శ్రీశ్రీ రాసిన కవితల సంకలనం ఖడ్గసృష్టి 1966లో మొదటిసారి విడుదలకాగానే కొందరు విమర్శకులు శ్రీశ్రీ కవిత్వంలో పస, బిగి చచ్చిపోయిందంటూ చప్పరించే సమీక్షలు రాసినప్పుడు, అదే సంవత్సరం 'జనశక్తి' దినపత్రికలో 'శ్రీశ్రీ ఖడ్గసృష్టి కావ్య పరామర్శ' అనే 60 పుటల పుస్తకమంత పెద్ద వ్యాసాన్ని సి.వి. రాశాడు. దాన్ని 1974లో సి.వి.నే ప్రచురించుకున్నారు. 1970లో గురజాడ శ్రీశ్రీలపై సోమసుందర్ దాడి'కి ఖండనను పెద్దవ్యాసంగా, రాసి సి.వి.నే ప్రచురించుకున్నారు. ఈ రెండింటినీ తర్వాత శ్రీశ్రీ సాహిత్య నిధి పునర్ముద్రించింది.

1975 మేలో ప్రచురితమైన 'పారిస్ కమ్యూన్' మహాకావ్యం తర్వాత సి.వి. కవిత్వ రచనను ఆపేసి, హేతువాద నాస్తికవాదాల గురించీ వర్ణ-కుల వ్యవస్థలపైనా సంఘసంస్కరణోద్యమాల చరిత్రనూ, 'బాబ్రీ మసీదు-రామజన్మభూమి' వివాదంపైనా చివరగా 2000వ సంవత్సరంలో 'దళిత ఉద్యమ వైతాళికుడు- కుసుమ ధర్మన కవీంద్రుడు' రాశారు. వీటి నడుమ మరికొన్ని చరిత్ర సంబంధ గ్రంథాలను ('సింధు నాగరికత' 'కౌటిల్యుని అర్థశాస్త్రం పుట్టుపూర్వోత్తరాలు' 'స్వయం సంపూర్ణ గ్రామీణ వ్యవస్థ - కారల్‌మార్క్స్' అనే గ్రంథాలతోపాటు శాస్త్రవిజ్ఞాన ప్రధానమైన, మతవాద చారిత్రక దృక్పథానికి చరమగీతం పాడిన 'డార్విన్ పరిణామవాదం' రాశారు. అనువాద గ్రంథమైన 'హోచిమిన్'తో సహా చిన్నవీ పెద్దవీ 28 పుస్తకాలు విడుదలైనాయి.

♦♦♦

1930 జనవరి 14న గుంటూరు పట్టణంలో పుట్టిన చిత్తజల్లు వెంకట చలపతి, విజయలక్ష్మి దేవమ్మల పెద్దకుమారుడు సి.వి. వీరు గుంటూరు ఎ.సి. కాలేజీలోనే ఎఫ్.ఎ(ఇంటర్మీడియట్), బి.ఎ. డిగ్రీ చదివారు. కవి శివసాగర్‌గా ప్రసిద్ధుడయిన కె.జి. సత్యమూర్తి సి.వి.తో కలిసి చదివిన ప్రముఖులలో ఒకరు. మద్రాసు క్రిస్టియన్ కళాశాలలో ఎం.ఎ. చదివారు. గుంటూరులో చదివే రోజులకే శ్రీశ్రీ 'మహాప్రస్థానం' (మొదటి ముద్రణ 1950) చదివి ఎంతో భావోద్విగ్నతకు గురయినవారిలో సి.వి. ఒకరు. అయితే ఆయన ఒక ఆర్థిక-రాజకీయ తత్త్వశాస్త్రంగా మార్క్సిజాన్ని గురించి తెలుసుకున్నదీ, అధ్యయనం చేసినదీ మాత్రం మద్రాసులోనే. మార్క్సిజం గురించి ఆయనకు ప్రత్యక్షంగా

పాఠాలు బోధించినది సింహళజాతీయుడైన ప్రొఫెసర్ చంద్రన్ దేశనేశన్. 1954-55 ప్రాంతాల్లో నిరుద్యోగిగా మచిలీపట్నంలో (వారి నాన్నగారి ఉద్యోగ బదిలీ రీత్యా) వున్నారు. తర్వాత విజయవాడలోని సహకారశాఖ'లో ఇన్‌స్పెక్టర్‌గా చేరి ఆడిటర్‌గా వుండగా స్వచ్ఛంద పదవీ విరమణ చేశారు. ప్రధానోపాధ్యాయురాలుగా పదవీ విరమణ చేసిన గోపిశెట్టి స్వతంత్ర భారతిగారు. వీరికి కుమారుడు ఉదయభాస్కర్.

♦♦♦

ఇంకా పుస్తకరూపం పొందని అనేక వ్యాసాలు కూడా సి.వి రాశారు. వాటిల్లో ఆయన మరచిపోయినవి కూడా వున్నాయి. 1955లో భారతదేశంలోనే తొలిసారిగా ఆంధ్రరాష్ట్రంలో జరిగిన ఉప ఎన్నికలలో కమ్యూనిస్టు-కాంగ్రెసు పార్టీల నడుమ హోరాహోరీగా, 'నువ్వా-నేనా' అన్నట్లు పోటీ సాగింది. ఆ సందర్భంగా శ్రీశ్రీ బహిరంగంగా కమ్యూనిస్టులను సమర్థిస్తూ రాయటమే కాక, ఎన్నికల ప్రచారంలో కూడా వేదికలెక్కి ప్రసంగించాడు. కాంగ్రెసువాదులు కమ్యూనిస్టు వ్యతిరేకులనూ మాజీ అభ్యుదయవాదులైన రచయితలను కూడా కొందరిని కూడగట్టి శ్రీశ్రీ కేంద్రంగా కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారానికి పూనుకున్నారు. ఆరోజుల్లో ప్రసిద్ధ రచయితలుగా ప్రాచుర్యం వున్నవారంతా కమ్యూనిస్టు వ్యతిరేక శిబిరంలో వున్నారు. అప్పుడే సి.వి. తొలిసారిగా కలం ఎక్కుపెట్టి శ్రీశ్రీని, కమ్యూనిస్టులను సమర్థిస్తూ విశాలాంధ్రలో రెండు వ్యాసాలు రాశారు. ఆ రెండింటినీ ప్రజాసాహితిలో 2007వ సంవత్సరంలో పునర్ముద్రించాము. 'కీలుబొమ్మలు' నవలా రచయిత ప్రఖ్యాత సాహిత్యకారుడు జి.వి. కృష్ణారావు వాదనలను ఖండిస్తూ సి.వి. రాసిన రెండవ వ్యాసం ఆనాటికే సి.వి.కి గల స్పష్టమైన మార్క్సిస్టు పరిజ్ఞానానికి చక్కని నిదర్శనంగా నిలుస్తుంది. నిజానికీ వ్యాసాన్ని 'ప్రజాసాహితి'లోచూసి సి.వి.నే ఆశ్చర్యపోయారు. అది రాసినట్లు తానే మరచిపోయానని అన్నారు. అలాంటిదే ఆయన రాసిన మరొక వ్యాసాన్ని కూడా మేము 2007లో పునర్ముద్రించాము. సిపాయిల తిరుగుబాటుగా బ్రిటీషువాళ్ళు పేరిడిన 'భారత స్వాతంత్ర్య మహాసంగ్రామం-1857' జరిగిన నూరేళ్ళకు సందేశం' అనే మార్క్సిస్టు సిద్ధాంత పత్రిక ప్రత్యేక సంచికలో తిరుగుబాటుకు కారణాల'ను 'చిత్తజల్లు' పేరుతో ఆయన రాసిన వ్యాసాన్ని ఆ పోరాటపు 150 ఏళ్ళ సందర్భంగా మేము పునర్ముద్రించాము. ఇదికూడా సి.వి. తాను రాసినట్లు మరచిపోయిన వాటిలో ఒకటి. ఆ వ్యాసంకూడా సి.వి.కి ఆనాటికే చరిత్రపట్ల ఎంతలోతైన అవగాహన వున్నదో తెలియపరుస్తుంది.

సి.వి. విజయవాడకు వచ్చేనాటికి (1955 తర్వాత) అభ్యుదయ రచయితల సంఘం నిర్మాణ, ఉద్యమపరంగా బలహీనపడే క్రమం ఆరంభమైంది. 'అభ్యుదయ' పత్రిక మళ్ళీ ఆగిపోయింది. తుమ్మల వెంకట్రామయ్యగారూ, కె.వి. రమణారెడ్డీ దాన్ని కొనసాగించాలని ప్రయత్నాలైతే చేశారుకానీ సాధ్యపడలేదే. కాలక్రమంలో పూర్తిగా నీరసపడటమే కాక, కమ్యూనిస్టు ఉద్యమంలో పొడసూపిన భేదాభిప్రాయాలు సంస్థాగతంగా అరసంను కోలుకోనివ్వలేదు. ఈ సందర్భంగా సంస్కరణవాద ధోరణికి వ్యతిరేకంగా సి.వి. సమరశీలవాదాన్ని స్వీకరించాడు. దానికి ప్రతినిధిగా నిలబడ్డాడు. కాంగ్రెసు పాలకవర్గాల అభివృద్ధి నిరోధక తత్త్వాన్ని తన కవితల ద్వారా తుత్తునియలు చేయసాగాడు. స్వయంగా సినిమా రంగంలో కూరుకుపోయిన శ్రీశ్రీని ఏకలవ్యుని బహిరంగలేఖ' అంటూ నిద్రలేపాడు. 'విషాద భారతం' కావ్యం ద్వారా భారత పార్లమెంటరీ వ్యవస్థలోని డొల్లతనాన్ని బట్టబయలు చేసి పోరాట ఉద్యమం ద్వారానే పీడిత ప్రజలు విప్లవాన్ని సాధ్యం చేసుకోగలుగుతారనే స్పష్టమైన అవగాహనను అందించాడు.

'అరుణా! ఓ అరుణ పతాకమా!' అనే సి.వి. రాసిన కవిత శ్రీశ్రీ రాసిన 'కవితా ఓ కవితా'కు అనుకరణ. అయినా శ్రీశ్రీని మరిపించి, తనదైన సమరశీలతను చాటుతూ ఎర్రజెండా రెపరెపల వెనుక ఎంత త్యాగపూరిత చరిత్ర వుందో, లొంగుబాటుదారులను ఎదిరించి అది ఎలా నిలిచిందో... గొప్ప ఉద్వేగంతో, అవగాహనతో సి.వి. రాసిన కవిత అది.

'కాళియై ప్రళయాగ్నికీలయై బెంగాల్' అనే కవిత పశ్చిమ బెంగాల్‌లో రాష్ట్రం 1967లో సంభవించిన నక్సల్‌బరీ తిరుగుబాటుకు ముందు ఎంత కళపెళలాడుతోందో స్పష్టంగా మనకళ్ళముందు దృశ్యమానం చేసే కవిత. ఒక సందర్భంలో సి.వి. భారత సామాజిక దురవస్థలనుచిత్రించి, వీటినుండి దేశం బయటపడాలంటే 'దారుణమైన శస్త్రచికిత్స జరగాలి' అంటాడు. నిజానికి నాటికీ నేటికీ పరిస్థితులలో ఎంత మార్పువచ్చింది? సాంస్కృతిక సంక్షోభం ఇంకా ఇంకా పెరుగుతోందా? తరుగుతోందా అని వివేచన చేస్తే ఒక విప్లవాత్మక మార్పు - ఆర్థిక - సాంఘిక - సాంస్కృతిక వ్యవస్థలలో - రావాల్సి వుండగా దానికిభిన్నంగా ఆలస్యమవుతుంటే అది ఇంకెంత భరించశక్యం కానిదిగా కుళ్ళి, కంపుకొడుతుందో... ఇవాళ్టి సమాజ పరిస్థితులు అలా వున్నాయి.

తరతరాలుగా దేవునిపేరిట, కర్మ, పునర్జన్మల పేరిట మతాన్ని అడ్డుపెట్టుకుని పాలకవర్గాలు, ప్రజల్ని ఎంతగా సాంస్కృతిక అణచివేతకు గురిచేస్తున్నారో చెప్పే రచనలు 'నరబలి', సత్యకామ జాబాలి' కావ్యాలు. అలాగే సాంస్కృతికోద్యమ రంగం హేతువాద, శాస్త్రీయ, లౌకికవాదభావ విప్లవాన్ని పెద్ద ఎత్తున సాగించాల్సిన ఆవశ్యకతను 'రంగనాయకమ్మకు సమాధానంగా రాసిన పుస్తకాలలో సి.వి. బలంగా ప్రతిపాదించారు. భావజాలపరంగా వారివురూ వేర్వేరు శిబిరాలవారు కాకపోయినా చర్చను తార్కికంగా సాగలాగి కేంద్రకంనుండి పక్కకు వెళ్ళినట్లు భావించిన వారు కూడా ఆ శిబిరంలో వున్నారు.

కులవ్యవస్థకు వ్యతిరేకంగా సి.వి. రాసిన పుస్తకాలు యివీ. 1. వర్ణవ్యవస్థ, 2. మధ్య యుగాలలో కులవ్యవస్థ, 3. ఆధునిక యుగంలో కులవ్యవస్థ, 4. మనుధర్మశాస్త్రం శూద్ర దళిత బానిసత్వం. ఇంకా సింధునాగరికతలోనూ, స్వయం సంపూర్ణగ్రామీణ వ్యవస్థ పుస్తకాల్లోనూ కుల వ్యవస్థను గురించి చర్చిస్తారు. ఒక్క మాటలో చెప్పాలంటే తన ప్రతి రచనలోనూ నిచ్చెనమెట్ల బ్రాహ్మణీయ కులవ్యవస్థపై ఆయనకున్న ఆగ్రహాన్ని ఎంతో ఆవేశపూరితంగా వ్యక్తీకరించారు. ఆయనంతగా కులవ్యవస్థపై భావ విప్లవ రంగంలో కత్తికట్టిన వారు మరొకరు లేరంటే అతిశయోక్తి కాబోదు.

కులవ్యవస్థకు వ్యతిరేకంగా కమ్యూనిస్టులు తగినంత పోరాటం సాగించటం లేదనే ఆగ్రహం కూడా ఆయనలో వుంది.

మితవాద, అతివాదాలలో కూరుకుని చీలికలయిన కమ్యూనిస్టు ఉద్యమం, వర్గపోరాట ప్రజాపంథానుండి దూరం పోయిన ప్రతిసారీ అవకాశవాదానికి చేరువవుతూ వచ్చింది. ఈ కీలకాంశాన్ని అర్థం చేసుకోలేకపోతే, కుహనా ఆత్మవిమర్శలతో తనను నమ్ముకున్న ప్రజలను మళ్ళీ మళ్ళీ అది భ్రమలపాలుచేయగలదన్న విషయాన్ని కమ్యూనిస్టు అభిమానులందరూ తెలుసుకోనంతకాలం వారికి ఆవేదన తప్ప ఆశకు ఆస్కారం లభించదు. అగ్రకుల ఆధిపత్య శక్తులకు వ్యతిరేకంగా జరిగే పోరాటం, వర్గపోరాటంలో, మరీ ముఖ్యంగా వ్యావసాయక విప్లవ పోరాటంలో అంతర్భాగంగా సాగించిన ఒకనాటి కమ్యూనిస్టు ఉద్యమ పోరాట చేవ నుండి పునరుత్తేజం పొందితేగాని అది తిరిగి పుంజుకోలేదు.

సి.వి.కి స్థూలంగా ఈ అవగాహన వుంది. అయితే నిరాశా పూరిత వర్తమాన వాస్తవం సహజంగా ఆగ్రహం కలిగిస్తుంది కదా! కులసమస్యపై జరుగుతున్న చర్చలలో కొన్ని రకాల అస్తిత్వవాద ధోరణులను సి.వి. సమర్థించలేదు. ఎవరి సమస్యను వారే కులాలు, ఉపకులాలుగా, మతాలు, మతశాఖలుగా, జెండర్లు, ప్రాంతాలుగా పరిష్కరించుకోగలరనే ఆధునికాంతర ఆలోచనకు ఆయన దూరంగా వున్నారు. పీడిత ప్రజలందరూ, ఏ కులాలు, మతాలు, ప్రాంతాలలో వున్నా ఐక్యంగా సంఘటితంగా దోపిడీవర్గ అగ్రకులాధిపత్య శక్తులపై, వారిని కాపాడే రాజ్యానికి వ్యతిరేకంగా పోరాడకుండా నిజమైన విముక్తిని సాధించలేరనేదే ఆయన అవగాహన. 'కులసంఘాలు' ఎత్తుగడల పేరుతో పాలక రాజకీయ ముఠాలకు ఓట్లు సీట్లు సాధించి పెట్టేవిగా మారిపోతుండటం పట్ల ఆయన అసహనంగా వున్నారు. భారతీయ ఎన్నికల వ్యవస్థ, భూస్వామ్య కులవ్యవస్థతో జతకట్టి అగ్రకుల ధనస్వామ్యానికి ఎలా ఊడిగం చేస్తోందో 50 ఏళ్ళ క్రితమే బహిర్గత పరిచివాడు సి.వి. 'ఊసుపోని కబుర్ల కేంద్రాలు'గావున్న పార్లమెంటును 'టాకింగు షాపుల్లాంటి అసెంబ్లీలు'ను 40 ఏళ్ళ క్రితమే 'పారిస్ కమ్యూన్' మహాకావ్యంలో (30వ అధ్యాయం) నిర్ద్వందంగా రాసిన సి.వి. పీడిత ప్రజలను ఎన్నికల భ్రమలలో సంస్కరణవాదంలో ముంచెత్తుతున్న కమ్యూనిస్టులకూ, దళితవాదులకూ కొరుకుడు పడకపోవటంలో ఆశ్చర్యంలేదు.

♦♦♦

1970 అక్టోబరు నెలలో మొదటిసారి విజయవాడ రైల్వేస్టేషన్ ప్లాట్‌ఫారమ్ మీద సి.వి.ని నేను కలిసాను. విప్లవ రచయితల సంఘం మొదటి మహాసభకు బెజవాడనుండి ఖమ్మంకు కలిసే వెళ్లాము. బెజవాడదాకా తిరిగి కలిసే వచ్చాము. ఆ సభలలో కొడవటిగంటి కుటుంబరావుగారు ఒక సందర్భంలో కవిత్వం రాయటంకంటే కథలు రాయటం కష్టమని వ్యాఖ్యానిస్తే వెంటనే సి.వి. లేచి 'కవిత్వం రాయటమంటే 105 డిగ్రీల టైఫాయిడ్ తెచ్చుకోవటమని' ఆవేశంతో జవాబు చెప్పారు. అలాగే సభకు హాజరయిన వారందరూ ఫోటోలు దిగుతుంటే, అది పోలీసులకు సాక్ష్యాధారాలతో దొరికిపోవట మవుతుందనీ, విప్లవ శక్తులు అలాంటి తొందరపాటు పనులు చేయకూడదని చెప్పి, తాను ఫోటోకు దూరంగా వుండిపోయారు. ఆ సభల సందర్భంగానే కొడవటిగంటి కుటుంబరావుగారు ఆనాటి విప్లవ ఉద్రేకాల్ని చూసి 'Exaggerated readyness for revolution'అని వ్యాఖ్యానించినపుడు మామిత్రబృందంతోనే కలిసి వున్న సి.వి. ఆముక్కను తర్వాత పదేపదే గుర్తు చేస్తుండేవారు. అప్పటికి కాకినాడలో వుండిన నేను తర్వాత 1971 నడిమధ్యన కృష్ణాజిల్లా అవనిగడ్డను రావటంతో, తరచుగా బెజవాడకు వస్తూ సి.వి.ని కలుస్తుండే అవకాశం కలిగింది. తర్వాత కాలంలో నేను 20 ఏళ్ళపాటు ఉయ్యూరులో వుండిన సుమారు 7, 8 సంవత్సరాలు వారి కుటుంబం అక్కడికి దగ్గరగా వుండిన పెదఓగిరాలలో (భారతిగారు ప్రధానోపాధ్యాయినిగా బదిలీ అయి రావటం వల్ల)లో వుండేవారు. అపుడు తరచుగా కలుసుకునే వారం. 2000లో నేను బెజవాడ వచ్చేనాటికి ఆయన చివరి రచన 'కుసుమ ధర్మన్న' పూర్తి చేశారు.

1975 ఎమర్జెన్సీలో తరిమెల నాగిరెడ్డి గారి సూచనలతో 'ఆంధ్రలో సంజయ్‌గాంధీ పర్యటన' కరపత్రాన్ని సి.వి. రాసినదని తెలిసి దాన్ని 1987లో ప్రజాసాహితిలో పునర్ముద్రించాము. ఆయన రచనలపై ఎన్నో పరిచయాలు, సమీక్షలు, విశ్లేషణలు అందిస్తూ వచ్చాము. మిగిలిన అభ్యుదయ సంస్థలూ, సాహిత్య పత్రికలూ సి.వి.ని పట్టించుకోవలసిన రీతిలో పట్టించుకోకపోయినా 'ప్రజాసాహితి' ఆయన 9 రచనలనూ, ఆయన రచనలపై 14 దాకా సమీక్షలనూ వెలువరించింది. నేను 1971లోనే 'సి.వి.ని మరచిన జ్వాలాముఖి' అనే వ్యాసం రాసి దిగంబర కవులకంటె సామాజిక అవగాహనపరంగా, నిర్మాణయుత ఉద్యమ ప్రభావశీలంగా సి.వి. కవిత్వం విశిష్టమయినదని రాశాను.

2006 అక్టోబరులో 'నడుస్తున్న చరిత్ర'లో కత్తి పద్మారావు రాసిన ఒకానొక వ్యాసంలో సి.వి.ని కులం కారణంగా కమ్యూనిస్టులు పట్టించుకోలేదని వ్యాఖ్యానిస్తే... విస్మరణ వాస్తవమేనని, అయితే రాజకీయ కారణాలవల్లనూ సి.వి. వ్యక్తిగత తత్త్వంవల్లనూ విస్మరణకు గురియైనాడే తప్ప, అందుకు కులం కారణం కాదని అదే పత్రికలో మరుసటి నెలలో నేను తిరుగు జవాబురాసిన సంగతి పాఠకులకు గుర్తుండే ఉంటుంది.

ఒక రచయిత జీవించి ఉండగానే ఆయన రచనలన్నీ సంపుటాలుగా ఒకేసారి పునర్ముద్రణ అయి, ఆయన సమక్షంలోనే వాటి విశిష్టతలను విశ్లేషిస్తూ రోజంతా ఒక సభ జరగటం, అందుకు 28 సంస్థలు ఒకే వేదికపై ప్రజాశక్తి బుక్‌హౌస్‌వారి చొరవతో పాల్గొనటం, ఒక సుదీర్ఘ విరామానికి సెలవు ప్రకటించి సి.వి. గురించి మళ్ళీ మళ్ళీ చర్చించుకునే సందర్భాన్ని కల్పించటాన్ని తప్పనిసరిగా అభినందించి తీరాలి. విప్లవజ్వాల సి.వి. సాహిత్యాన్ని 'ప్రజాసాహితి' ఆరనివ్వకుండా కాపాడుతున్నట్లే, ప్రజాశక్తి ప్రచురణలు లాంటి సంస్థలు నిప్పులాంటి సి.వి. కవిత్వానికి విస్మరణ అనే నివురుకప్పివున్న కాలంలో, వాటిని పునర్ముద్రించినందుకు ప్రజాశక్తి బుక్‌హౌస్ వారిని తప్పకుండా అభినందించి తీరాలి.

♦♦♦

**రచయిత ఫోన్ : 9440167891**

పిట్టచూపు

- శ్రీ చలసాని నరేంద్ర

# రెండు తెలుగు రాష్ట్ర ప్రభుత్వాలు

# పాలనలో కనిపించని పారదర్శకత, జవాబుదారితనం

ప్రజాస్వామ్యంలో ప్రధాన అంశాలు పాలనలో పారదర్శకత, జవాబుదారీతనం. పాలకులు ప్రజలకు జవాబుదారీ వహించాలి. వారు చేసే అన్ని పనుల్లో పారదర్శకత ఉండాలి. నిర్ణయాలు తీసుకోబోయే ముందు వివిధ స్థాయిల్లో సమాలోచనలు జరిపి, వీలయినంత వరకు ఏకాభిప్రాయాన్ని సాధించే కృషి జరగాలి. కేవలం అధికార పక్షంలోని వారినే కాకుండా అన్ని పక్షాల వారిని విశ్వాసంలోకి తీసుకోవాలి.

ఈ విషయాల్లో అటు ఆంధ్రప్రదేశ్‌లో, ఇటు తెలంగాణలో పాలక పక్షాలు నిరుత్సాహకరంగా ఉన్నాయి. కనీసం మంత్రివర్గాల్లో సహితం సంపూర్ణంగా సమాలోచనలు జరగడంలేదు. రెండు ప్రభుత్వాలలో కొద్ది మంది మాత్రమే విధాన నిర్ణయాలలో కీలకపాత్ర వహిస్తున్నారు. కుటుంబ పాలన అనే ఆరోపణలు వినవస్తున్నాయి.

ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరం అమరావతి నిర్మాణం కోసం ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రత్యేక శ్రద్ధ తీసుకొని సింగపూర్ ప్రభుత్వం వారితో భారీ డిజైన్‌లను రూపొందింపచేసి దేశం అంతా సంచలనం కలిగించారు. రాష్ట్ర ప్రజల్లో ఎన్నో ఆశలు రగిలించారు. ప్రపంచవ్యాప్తంగా సంచలనం సృష్టించిన తెలుగు సినిమా బాహుబలిని తలపించే రీతిలో అద్భుతమైన సెట్టింగులతో కూడిన డిజైన్‌లను విడుదల చేసి ప్రపంచంలోనే ఆకర్షణీయమైన రాజధాని నగరం నిర్మించబోతున్నట్లు ప్రజల్లో ఆకర్షణలు కలిగించగలిగారు.

అయితే నిర్మాణ ప్రక్రియ సందర్భంగా అనుసరిస్తున్న విధానంలో తొలినుండి పారదర్శకత లోపిస్తున్నది. అమరావతి నిర్మాణానికి సంబంధించిన మాస్టర్‌ప్లాన్ తయారీ దగ్గరనుండి సీడ్‌క్యాపిటల్ మాస్టర్‌ప్లాన్ తయారు చేసేంతవరకూ ప్రతి విషయాన్నీ ప్రభుత్వం గోప్యంగానే ఉంచడం విస్మయం కలిగిస్తున్నది. ముఖ్యమంత్రి అమరావతిని 'ప్రజారాజధాని'గా నిర్మిస్తున్నట్లు మాటవరుసకు అన్నా ఆచరణలో గతంలో ఎన్నడూ లేనంతటి గోప్యతను ప్రభుత్వంవారు పాటిస్తున్నారు.

ఎటువంటి సమాలోచనలు, నిపుణుల అభిప్రాయాలు తీసుకోకుండా ఏకపక్షంగా సింగపూర్ ప్రభుత్వానికి మాస్టర్‌ప్లాన్ బాధ్యతను అప్పగించడం, రాజధాని నిర్మాణం సహితం ఆ ప్రభుత్వం సూచించిన కంపెనీలకే అప్పచెప్పే ప్రయత్నం చేస్తూ ఉండడం గమనార్హం. రాజధాని నిర్మాణానికి సంబంధించిన ఏ దశలో కూడా ప్రజల భాగస్వామ్యం కనిపించడం లేదు.

మాస్టర్‌ప్లాన్ తయారీకోసం సింగపూర్‌నుండి పలువురు నిపుణులు పలుసార్లు ఇక్కడకు వచ్చినా ఒక్కసారి కూడా వారినెవ్వరినీ ఇక్కడి మీడియాతో కానీ, భూములిస్తున్న ప్రాంతంలోని రైతులతో గానీ, ప్రజా ప్రతినిధులతోగానీ మాట్లాడనీయలేదు. నిపుణులు వచ్చిన ప్రతిసారీ వారిని భారీ భద్రత మధ్య రాజధాని ప్రాంతానికి తీసుకుపోవటం లేదా హైదరాబాద్‌నుండి హెలికాప్టర్‌లో తిప్పటం జరుగుతున్నది. దాంతో ఎవరికీ కూడా నిపుణులతో మాట్లాడే అవకాశం లభించలేదు.

ప్లాన్ తయారుచేసి ఇస్తున్నందుకు సింగపూర్ నిపుణులకు ప్రభుత్వం ఎంత చెల్లిస్తున్నదంటే ఎవరూ సరైన సమాధానం చెప్పటం లేదు. పైపెచ్చు, ముఖ్యమంత్రితో సింగపూర్ ప్రభుత్వానికి ఉన్న అనుబంధం దృష్ట్యా ప్లాన్ తయారీ మొత్తాన్ని ఉచితంగా చేస్తున్నారని చెబుతున్నారు. ఈ విషయాన్ని ఎవరూ నమ్మకపోయినా చేసేదిలేక మౌనంగా వుంటున్నారు. క్యాపిటల్ రీజియన్ ప్లాన్ తయారీ సందర్భంలోనే సింగపూర్ నిపుణులకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి మధ్య కుదిరిన ఒప్పందం ఏమిటని ఎంత తెలుసుకునేందుకు ప్రయత్నించినా సాధ్యం కాలేదు.

ఒప్పందం వివరాలు తెలపాల్సిందిగా కోరుతూ పదవీ విరమణ చేసిన ఐఎఎస్ అధికారి ఎఎస్ శర్మ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి దరఖాస్తు చేసుకుంటే, దానిని ప్రభుత్వం తిరస్కరించింది. అయితే, ఆయన సమాచారహక్కు చట్టం క్రింద దరఖాస్తు చేసుకుంటే ఆయన అడిగిన వివరాలు యావత్తు ప్రభుత్వం గోప్యంగా భావిస్తున్నది కాబట్టి వివరాలను బహిర్గత పరిచేందుకు అవకాశం లేదని ప్రభుత్వం మళ్ళీ సమాధానం చెప్పింది. సీడ్ క్యాపిటల్ ప్లాన్ తయారీలోనే ఇంత గోప్యత పాటించిన ప్రభుత్వం ఇక రాజధాని నిర్మాణానికి అనుసరించబోయే విధివిధానాల్లో ఇంకెంత గోప్యత పాటిస్తుందో చూడాల్సిందే.

ఈ మొత్తం ప్రక్రియలో అక్రమార్కులు ఆధిపత్యం వహించారని తెలుస్తున్నది. కేవలం ఒకరిద్దరు ప్రముఖుల కేంద్రంగా 'అమరావతి' గోల్‌మాల్ సాగుతున్నట్లు చెప్పుకొంటున్నారు. ఈ అక్రమార్కుల ప్రయత్నాలను అడ్డుకోలేకనే మొత్తం రాజధాని రూపకల్పన వ్యవహారాల్లో కీలకపాత్ర వహించిన మునిసిపల్ శాఖ అధిపతి గిరిధర్ సెలవుపై వెళ్లి తనను ఆ శాఖ నుండి తప్పిస్తేకాని విధులలో చేరననే సంకేతం ఇచ్చారని తెలుస్తున్నది.

విశ్వసనీయ వర్గాల కథనం ప్రకారం ఈ వ్యవహారంలో అంతా

తానై వ్యవహరిస్తున్న ప్రముఖుడు గిరిధర్‌ను సింగపూర్ వెళ్లి మాస్టర్‌ప్లాన్‌లో తగు మార్పులు చేయించమని కోరారు. తాము బినామి పేర్లతో భూములు సమకూర్చుకున్న ప్రదేశాల్లో ఐ.టి.హబ్, వాణిజ్యకేంద్రాలు వంటివి వచ్చి, తమ భూముల విలువ అనేక రెట్లు పెరిగేవిధంగా చేయమని ఆదేశించారు. అందుకు ఆయన తిరస్కరించడంతో ఒక జూనియర్ అధికారిని పంపి తమకు ఇష్టం వచ్చినట్లు మార్పులు చేయించుకున్నారు.

ఈ ప్రముఖుడు ప్రభుత్వంలో కీలకవ్యక్తితో కలిసి వందల ఎకరాల భూములను ఇక్కడ సమకూర్చుకోగా, ఆ జూనియర్ అధికారి సన్నిహిత బంధువు సహితం వందల ఎకరాలు కొనుగోలు చేసారని తెలుస్తున్నది. పేరుకు సింగపూర్ ప్రభుత్వం మాస్టర్ ప్లాన్‌ను తయారుచేసినా ఈ వర్గాలే వ్యూహాత్మకంగా చేయించారని చెబుతున్నారు.

ఇక తెలంగాణలో పరిస్థితులు భిన్నంగా లేవు. జాతీయ ప్రాజెక్టుగా పరిగణించి నిర్మించాలని కేంద్రాన్ని కోరుతున్న ప్రాణహిత ప్రాజెక్టుకు మంగళం పాడే దిశలో ప్రత్యామ్నాయ ప్రాజెక్టులను తెరపైకి తీసుకురావడం, పెండింగ్‌లో వున్న, అసంపూర్తిగా వున్న ప్రాజెక్టులను పూర్తిచేయడం పట్ల శ్రద్ధ చూపకుండా ఆచరణ సాధ్యత పట్ల అనుమానాలు వ్యక్తమౌతున్న కొత్త ప్రాజెక్టులపై దృష్టి సారించడం పలు అనుమానాలకు తావిస్తున్నది.

రు.35 వేల కోట్ల వ్యయంతో పాలమూరు ఎత్తిపోతల పథకం ఆకస్మాత్తుగా ప్రాధాన్యతను సంతరించుకున్నది. ఎకరంకు రు.25వేలు విద్యుత్ చార్జీలు భరిస్తేగాని అమలు సాధ్యంకాని, అంత ఖర్చుకు సిద్ధపడినా సంవత్సరంలో రెండు, మూడు నెలలకు మించి నీరు లభ్యంకాని ఇటువంటి ప్రాజెక్టుల విషయంలో తగు సంప్రదింపులు, నిపుణుల మదింపు జరగలేదని విమర్శలు చెలరేగుతున్నాయి.

రెండు ప్రభుత్వాలు ఎన్నికల సమయంలో ప్రజలకు ఇచ్చిన హామీల అమలును తుంగలో తొక్కివేసి, సరికొత్త కార్యక్రమాలు, పథకాలను తెరపైకి తీసుకువచ్చి కలల ప్రపంచాలను ప్రజల ముందు ఉంచే ప్రయత్నం చేస్తున్నాయి. ఇటువంటి కొత్త పథకాలు కొందరు కాంట్రాక్టర్లు తమ ప్రయోజనాలకోసం చేయిస్తున్నవనే గుసగుసలు అధికార వర్గాల్లో కొనసాగుతున్నాయి.

మరో వంక రాష్ట్ర విభజన జరిగి 14 నెలలు అయినా రెండు రాష్ట్రాల మధ్య జరగాల్సిన రాష్ట్రస్థాయి ఉద్యోగుల విభజన ఇంకా పూర్తికాకపోవడం, ఇప్పట్లో అయ్యే అవకాశాలు కనిపించకపోవడంతో పరిపాలనలో అనిశ్చితి కొనసాగుతున్నది. ఉద్యోగుల విభజనకు సంబంధించి కేంద్ర ప్రభుత్వం ఏర్పాటు చేసిన కమలనాథన్ కమిటీ శక్తివంచన లేకుండా కృషి చేస్తున్నా ఈ ప్రక్రియల చిక్కుముడిగానే మిగిలి పోతున్నది. ఇరు రాష్ట్రాల మధ్య సుమారు 152 విభాగాల్లో 50 వేల మందికి పైగా ఉద్యోగుల విభజన జరగవలసి ఉంది. ఇప్పటివరకు 86 విభాగాల్లో పూర్తి అయినా కీలకమైన రెవెన్యూ, పోలీస్ విభాగాల్లో ఇంకా ప్రారంభం కాకపోవడంతో అత్యధిక భాగం అసంపూర్తిగానే ఉన్నట్లు స్పష్టమవుతున్నది. ప్రస్తుతం ఉన్న ఉద్యోగులకు సంబంధించిన సమాచారం అందించడంలో పలు విభాగాధిపతులనుండి తగు సహకారం లేకపోవడం ఈ జాప్యానికి ప్రధాన కారణంగా కనిపిస్తున్నది. ఈ విషయమై రెండు ప్రభుత్వాలలో చురుకుతనం లోపిస్తున్నది.

ఈ ప్రక్రియ జాప్యం అయినకొలది మరిన్ని చిక్కు సమస్యలు తలెత్తే అవకాశాలున్నాయి. కీలకమైన రెవెన్యూ, పోలీస్ శాఖల్లో అసలు విభజన ప్రక్రియను ప్రారంభించకుండా ఇతర విభాగాల్లో పూర్తి అయినా పెద్దగా ఉపయోగం ఉండదు. ముఖ్యంగా రెవెన్యూ విభాగంలో డెప్యూటి కలెక్టర్ల సీనియారిటీ వివాదంవల్ల కమలనాథన్ కమిటీ ఆ శాఖ జోలికి వెళ్ళడంలేదు. ఇక, పోలీసు విభాగంలో దాదాపు 30 అంతర్ విభాగాలున్నాయి. వీటి నుండి కమిటీకి ఇంతవరకూ క్షేత్రస్థాయి వివరాలే అందలేదని తెలుస్తున్నది. సాధారణ పరిపాలన అంశాలపట్ల రెండు ప్రభుత్వాల నిర్లక్ష్య ధోరణికి ఉద్యోగుల విభజనే ప్రత్యక్ష ఉదాహరణ అని చెప్పవచ్చు.

**రచయిత ఫోన్ : 9849569050**

**కవిత**

# పుడిసెడు నీళ్ళు!

**ఆ**యువును తోడేసేది
ప్రాణవాయువెలా అవుతుంది
మొక్కల్ని మృత్యులోగిలికి పంపేది
అమృతమెలా అవుతుంది
మనలో మనమాట
గంజాయివనంలో తులసిమొక్క
ఒక్కటి పెరిగినంత మాత్రాన
గంజాయిగుణం మారదుకదా
విత్తును నాటింది మొదలు
పాలు పంచదార పోసి పెంచినా
వేప చేదు ఒదులుకోదుకదా
పుట్టిన నాటినుండీ ఫ్యాక్టరీలు
అమృతాన్ని కాదు
విష రసాయనాల్నే వదులుతున్నాయి
గాలి పీల్చే దీపాలను ఆర్పడానికి
విషాలని పొగలా వదిలేస్తున్నారు
చనిపోవడమే తప్ప మరో మార్గం లేదా?!
ప్రతి పుట్టినరోజుకి ఒక మొక్కను నాటి
పుడిసెడు నీళ్ళు పోయండి చాలు...
బతుకు నూరుపూలు నూటపదహారు కాయలే!

**- గుర్రాల రమణయ్య, నెల్లూరు**
సెల్‌నం. 9963921943

గోదావరి లోయలో కొండరెడ్ల బతుకు కతలు - 6

# ఈగలు తేనె తయారుచేయుట

- శ్రీ పల్లాల బొర్రంరెడ్డి

**తేనెల రకాలు:** పెద్దతేనె, దొర్రతేనె, కర్రతేనె, వగ్గెరితేనె, మొసరుతేనె.

**పెద్దతేనె:** చాలా పెద్ద కుటుంబం. ఒక చెట్టులో 60-70 పట్లు కట్టును. పెద్దతేనెఈగ నేలచిక్కుడుగింజ అంత ఉంటది. ముడ్డిభాగంలో మేడి అనే గోరుపువ్వు అంత సన్నటి మొనగల్గిన కొయ్య ఉంటది. సూదిమందు ఇచ్చినట్లు గుచ్చుతది, శరీరం కన్నం పడుతది. రక్తం వస్తది. 10దెబ్బలు కరిస్తే మనిషి వాసిపోతడు. కొండ శిఖరంలో ఉన్న బండరాయి అంచులలో, కట్టువలలో కట్టుతవి. అట్టలుమైనం అనికూడ అంటరు.

మొక్కెముమానుచెక్క బంక, కోడిపుర్రుమాను బంక, రెల్లమాను బంక, కాలువలో ఊట కలిపి బట్టరాలలో, పెద్దచెట్లకొమ్మలలో అట్టలు కట్టుతవి. అట్టలమధ్య గదులు తయారుచేసి, ఆ గదులమధ్యలో చిన్నటిఈపులను, గుడ్లను పెట్టుతవి. అవి 15 రోజులలో చీడపురుగు ఆకారంలో నేలచిక్కుడుగింజ అంత ఎదిగిన తరువాత ఆ గదులకు డిమ్మలు వేస్తవి. 25 రోజులలో తేనెఈగలుగ మారుతవి. తరువాత ఆ గదులలో పువ్వుల పొడివేసి నీరుతేమలు నింపును.

**దొర్రతేనె:** ఈ ఈగ వరిగింజ అంతలావు ఉంటది. పుట్టబొక్క కన్నంలో దూరి లోపలపుట్టమట్టి ఆధారంతో ఆ మట్టమీద తేనెఅట్టలు కట్టుతవి. అట్ట నిర్మాణంలో పెద్దతేనెతో సమానం. మానుతొర్రలలో కట్టుతవి. ముడ్డిలోని మేడి అనే కరిచే సాధనం ఉంటది. మేనెలలో అధికంగ కరుస్తది. కానుగుపువ్వు పుప్పం(మకరందం), నేరేడు, మామిడి, మొక్కజొన్న, అడుసులు, సామ, చోడి, గంటి ఎన్నులభాగంలోని పువ్వులనుండి పుప్పం తీయును. నీటి ఒడ్డు ఊట, బొక్కలలో చెమ్మ(తేమ) తెచ్చి అట్టల గదులలో ఈ తేమలు కలుపును. అవి తీయటి రుచి. మంచుతేమకూడ నింపుతవి.

అట్టలోని గొట్టంగదులలో మొదట తేనెఈగలు చిన్నటి గుడ్లను పెట్టుతవి. వీటిని ఈపులు అంటరు. ఇవి పెద్దవై పురుగులుగ మారుతవి. పురుగులు ఉన్న ప్రతి గొట్టంకు దగ్గుడు(మూత) వేస్తవి. 15రోజులలో తేనెటీగలుగ మారుతవి. ఈగలుగ మారిన తరువాత గొట్టలను విడిచి బయటి అట్టమీద వాలుతవి. అట్ట డొల్లగా ఉంటది. దీనిని వర్ధిది అంటరు. మానుతొర్ర, పుట్టమట్లకి అనుకొని ఉన్న తేనె అట్ట 2 అంగులాల పొడవున నూనె, పుప్పం కలిసి ఉంటది. దిగువభాగంలో తేనెటీగలు ఉంటవి. ఈ తేనె పుప్పంను చేదు, వగరు, తీపి ఉన్న చెట్లనుండి తీస్తవి. ఈ తేనె నూనెను అన్నంలో కలిపి తినవచ్చు. తేనె కాయకుండ తింటె మంచిది. అక్టోబరు, జూన్, జనవరినెలలలో తేనెలు అట్టలు కట్టుతవి. తేనె అధికవేడికి పనిచేస్తది. 5, 6 అట్టలు కట్టుతవి. తేనె ఉన్న భాగం తేనెబుగ్గ అంటరు. అది దూదివలె ఉంటది.

**కర్రతేనె:** చాలా చిన్న కుటుంబం. జూన్, అక్టోబరునెలలలో చెట్టుకొమ్మలలో మన అరిచేయి వెడల్పు అట్టలు కట్టుతవి. కరవడంలో నెమ్మది. లేతఅడవి, చిడిగభూమిడొంకలో ఉంటది. పెద్దవృక్షాలమీద కొమ్మలలో అట్టలు కట్టుతవి. కర్రలో కట్టుతది కాబట్టి కర్రతేనె అంటరు.

**వగ్గెరి:** డిశంబరునెలలో తేనెఅట్టలు కట్టుతవి. కర్రదుంగలు, ఎండిన తొక్కలకి కర్రకి మధ్యలో కట్టుతవి. తేనెఅట్టలు గురగేదె నాళిక ఆకారంలో ఉంటవి. ఇది అడ్డాకుచెరక అనగ ఒక భాగం అంతా ఉంటది. దీనిలో పుప్పం ఉండది. మనుషులను ముఖంమీద అధికంగ కరుస్తవి. ఇది విర్రు(మందఈగలు) ఒకేసారి మనిషిమీద పడి కరుస్తవి.

**మొసరుతేనె:** ఆవగింజ అంత ఉంటది. ఈగ నలుపు. దీనికి ముడ్డిలో మేడి లేదు. నోటితో కరుస్తవి. మానుతొర్రలో, పెద్దచెట్ల తొర్రలలో, రాతిపెటికలలో అట్టలు కట్టుతవి. గునపంలావు, 1/2 మూర పొడవు. రుచి పులుపు. పుప్పం అధికం. మోదువలె ఊబిగ ఉంటది అందుకే మొసరు అని పేరు. కంటిరెప్పలమీద కరుస్తవి. దీని మైనం వింటిబద్ద, నారుగొళ్ళెం నర్ములకి, బాణంకర్రకు వాడుతరు.

☞ నవంబర్ డిసెంబర్ కాటు ఎక్కువ - చుమ్మ గడ్డి పొగ - నూనె ఎక్కువ.

☞ వైశాగి తట్ట, పిల్లలు బాగా కుడుతుంది - గుడ్డపొగ.

☞ ఆషాడి బందపూని కుట్టదు - చమురు ఎక్కువ.

☞ దశమి అడుసుపంట మంచిది. తట్టంతా చమురే. పిల్లఉండదు.

☞ పలకం - సంకురాత్రి, సంగోరుతేనె. చలికి బయటకు రాలేక సగం ఈగలే తాగేస్తాయి. సంకురాత్రి శివరాత్రి పూలులేవు - ఉట్టి తట్టలు.

☞ వైశాగి విటింనెలకు బాగా పిల్లలు, తొర్రలోది చిక్కన, తెరలది పల్చన. తొర్రల్లో జమురునూనె తీపి-పులుపు.

☞ మంచిమంచి తట్టలన్నీ మనం తిందరి కన్నమా - ఒప్పనొప్పని తట్టలన్నీ ఒకరికిద్దాం కన్నమా

## అడవులు, చెట్లు, జీవాలు

**అడవి:** తారటడివి, చిడిగ, వేనం, మందం, కోరెం, కొపిరెం, మెట్టగొంది, లొంపోది, ఒడిదిడుకు, జౌక, ఉరుకు, సాలు, దిగురుజర్రి, గండి, మెట్ట, గొమ్ము, వర్రె, బంద, చెలక, డొంక, లంక, తోకచెలక, కట్టువ, తరుగు, ఊబు, బావిబొక్క, నూతిబొక్క, కరిగినవగ్గ, లాగబొక్క, నేదిబొక్క, చవుడుబొక్క, మంటిబొక్క, తేనెబొక్క, పాముబొక్క, పుట్టబొక్క, దుంపలబొక్క, ఎకురుగొండ, దిగురుగొండ, సున్నపుబొక్క, బోదెగట్టు, చేనిగట్టు, పొలంగట్టు, రేవుగట్టు, చేనుగట్టు, కల్లెంగట్టు, పొలిగట్టు.

**దార్లు:** ఊరిదారి, చేండ్లదారి, చెట్టుదారి, నాండ్లదారి, దొడ్లదారి, గొడ్లదారి, వేంటలదారి, పాయదారి, నూతిదారి, సిల్పదారి, పెద్దరేవుదారి, గొందిదారి, మెట్టదారి, దిగురుదారి, ఎక్కురుదారి, సంగువదారి, వేనందారి, చెడిగదారి, చెంటబసదారి, చేవడిబసదారి, పందుగుబసదారి, నీండ్లపొంతబనదారి, రోతిపొయ్యులదారి, అడ్డమట్టిదారి, పాముబొక్కదారి.

**డొంకలు:** చీంపురుడొంక, దేవగన్నెరిడొంక, తేనెకూరడొంక, తిత్తిరెడొంక, చీకటికూరడొంక, గలగడ్డిడొంక, కొపిరిగడ్డిడొంక, గాలిగోపురండొంక,

పేంపాడొంక, గన్నెలికూరడొంక, బోడపిట్టడొంక, గండముర్గుడుడొంక, ఎర్రపేముడొంక, కళ్ళకూరడొంక, పిండికూరడొంక, చెడిపికూరడొంక, బజనికెడొంక, గురుకూరడొంక, ముల్లుదొంటకూరడొంక, గడ్డికూరడొంక, బొరగకూరడొంక, దబ్బగడ్డిడొంక.

**ఖీలె(అడుగుపెట్టలేనిది):** గర్సగారఖీలె, తిత్తిరెఖీలె, నారదుంపఖీలె, పుల్లబర్మిఖీలె, పేంపాఖీలె, కటారికూరఖీలె.

**తుట్టి:** నారదుంపతుట్టి, షికుమతుట్టి, అడ్డతుట్టి, పిప్పిడితుట్టి, లొల్లొడితుట్టి, తేగదుంపతుట్టి.

**తీగలు:** అడ్డతీగ, లొల్లొడితీగ, నల్లతీగ, తామరతీగ, పిప్పిడితీగ, పాలతీగ, పేంపతీగ, బూదరితీగ, గండుగారతీగ, సప్పిగారతీగ, పుల్లగుమ్మడితీగ, జెర్రికూరతీగ, నేలమందుతీగ, పాలదొండతీగ, కారుచిక్కుడుతీగ, పర్మితీగ, పాలబొదితీగ, గిల్లతీగ.

**ఊడలు:** మర్రిఊడ, జువ్విఊడ, సిప్పరిఊడ, మానుదెంకొడిఊడ, ఆకాశపందిరిఊడ, చిత్రికెఊడ, జీలికఊడ.

**రుప్పలు:** పిండిదికెరుప్ప, అడ్డరుప్ప, బజినికెరుప్ప, తేనెకూరరుప్ప, తుమ్మికూరరుప్ప, పొత్తడిరుప్ప, తడెబరుప్ప, తంగుదరుప్ప, తొందిరుప్ప, వడగరుప్ప.

**పొదలు:** అడ్డపొద, పొత్తడిపొద, బొకిడెపొద, చండికూరపొద, మురికిటిపొద, పండికెపొద, తేనెకూరపొద, గుమ్ముదుపొద, గొట్టెపొద, మంగపొద, పూసిగురపొద, కొండమాటుపొద.

**చెట్టు:** మాను, జెడ్డ, కొమ్మ, జాగ, కద, మొదలు.

**చిడిగ:** చెట్టునరికి చేనుచేసి విడిచినది.

**పీదపిడెం:** ప్రతి సంవత్సరం వెదురుకొమ్ములు విరిచి తరిగిన వెదురుపుంతలు(చిన్నకొమ్ములు మొలచి బలం తగ్గుట).

**పందులు:** అడవిపంది, సెకట్లు(రెండుపందులు), ఒంటరిపంది, మందపందులు.

**జంతువులు తినేవి:** లాంగుకడుసు, గొట్టెకడుసు, దుప్పి(మచ్చలుంటవి), చిడిగగొట్టె, వేనుపుగొగ్గడి, నేది, వెదురెలుక (ఉడుతచారలు), కురిదేపిల్లి, పండుపిల్లి, పూతపిల్లి(బొక్కుకంపు), సీపురుబెంతు, ముంగిస, చెవులపిల్లి(కొక్కిపిల్లి), ఉడుము, ఆలుగు, రాచెలక.

**క్రూరజంతువులు:** కారాగేదె, పెద్దపులి, సవరలమెకం, చిరుతపులి, రెంచువేపి(కుక్క), ఎలుగు, అడ్డనక్క, చెలకనక్క, బట్టికెపులి.

**పాములు:** నాగుపాము, త్రాసుపాము, కొండచిలువ, పెనుపాము, మొండిపాము, విల్లార్కి(వింటినారు), పసిరికపాము, వానపాము, వాపురుడొళ్ళి, చింతమిరుగుడు, జెర్రి, మాలజెర్రి.

**తేళ్ళు:** ఎంద్రికపొట్టె, గుమ్మడిగింజ.

**కరిచే ఈగలు, విష ఈగలు:** కదుదురు, పులికదుదురు, గుంటకదుదురు, సారకదుదురు, ఆకుకదుదురు, పెద్దతేనె, దొర్రతేనె, కర్రతేనె, వగ్గెరి, పసిరీగ, కలపొట్ట, మొసరు, పసి, కమ్మరి, కలపొట్టు, ఎర్రతుమ్మెద, నల్లతుమ్మెద, జోరిగ.

**దోమలు:** గేడిదోమ, నుసిఈగదోమ.

**పురుగులుపెట్టు ఈగలు:** గాజుఈగ, పాలఈగ.

**వాలే ఈగలు:** టంకఈగ, తుండిఈగ, నుసిగ.

**కొరికె ఈగలు:** సున్నుఈగ, నతిఈగ, గుమ్మడీగ,కొమ్మిఈగ

**బరువుమోయు ఈగలు:** పీతిఈగ, కొరికెఈగ.

**పురుగులు:** పెంకు, పెండ, నేల, మిట్టలు, పెండ్లు, అండెలు, ఈడ్లు, ముక్కుపురుగు. ఈగ పెట్టే గుడ్లను ఈంపులు అంటరు.

**నూగుపురుగులు(అంటుకుంటె దురద):** కత్తులపురుగు, నూగుపురుగు, గొంగలిపురుగు, రాతికత్తెలి పురుగు.

**అపాయం లేని పురుగులు:** నల్లగర్బ, తెల్లగర్బ, ఎలుగుతింద్రాయి, రోకలిబంద, నమిలికొండి, నల్లబల్ల, తెల్లిబల్ల, గెడిఈగ, ముండబొళ్ళ, జీడె.

**మిడతలు:** గొనె(గొళింత)మిడత, వసమిడత, పొంగురుమిడత, బొకకుమిడత, పచ్చమిడత, బొద్దికె, దుంబమిడత.

**బల్లులు:** పెతరిబల్లి, పులిబల్లి (అపాయం), నూకబల్లి.

**తెరలు:** మేగంతెర(గాందు), చిల్లితెర, దేవతలతెర.

**మిడతలను తినే జీవులు:** డొక్కి, మిందె, ఊసరవిల్లి, ఉడుం, ఆలుగు.

**మట్టితినే పురుగులు:** పాము, బొళ్ళ, బోడపిట్ట, గురగేదె, చిడిగగొర్రె, వెదురెలుక.

**ఎలుకలు:** మూర్థ(పందికొక్కు), పొదిరెబంద, పెద్దెలుక, చిట్టెలుక, తాటిబుచ్చి, జీర్మగొడ్డు(చుంచు), డొంకె, ఉరిటెలుక(ఉడుత), కల్లెలుక.

**కప్పలు:** చిట్టికప్ప, కన్నెలకప్ప, బొంకురుకప్ప, పెద్దకప్ప.

**అడవి కోళ్ళు:** కారుకోడి(పెద్దకోడి), తొగరుకోడి, డొక్కలకోడి, రాతికోడి.

**పిట్టలు:** నమిలిపిట్ట, తోకపిట్ట, దిమ్మరిపిట్ట (నమిలి), వంకాయపండు, ఎంద్రిత, బండపిక్కొడి, పిక్కొడి, గీసపిట్ట, గడ్డిపిట్ట, బొక్కు చెరికెలిపిట్ట, పితిపొన్నెంగి, బొర్రజక్కి సీమజక్కి రోతిపోయి, దొర్రచారి, నూలుపిక్కొడి, కందికొల్లెం, బొబ్బరిగువ్వ, కవుట, కూకెలిజమ్మి, మానుదెంకోడి, ఇదుతురుడబ్బి, ఆముదంబోడ, బోడపిట్ట(గువ్వ), పొట్టిపిట్ట(పొట్టొడి), చేపకన్నుపిట్ట, వానకొవ్వెలి, బొళ్ళికోడి, చికుపిట్ట, సిర్వపిట్ట, గంటెకొరప, టంకబొర్ష, కున్నెలు, చీమరాచకోడి, కుద్రెకు, నూలుపిక్కొడి(తోక పొడవు), డొంకచొచ్చోరి, కన్నె, బెంబరిగూకి, పచ్చబొలుగు, గుడ్డగుంజి, గుమ్మ, కొమ్ములగుంజి, అడ్డగుంజి, రాచకోడి, కీలిగిద్ద, తుప్పపిట్ట, అలసందకోడి.

**తినే పిట్టలు కావు:** కంచరిపిట్ట, మైనగొరెపిట్ట, పేండబట్టిపిట్ట.

**వేటపక్షులు:** కొప్పుగిద్ద, జాలరిగిద్ద, డేగ, చిరపగిద్ద.

**పూరోడిపిట్టలు:** గుడ్డుపూరోడి, కెర్గెపూరోడి, గొంగుపూరోడి.

**అడవికూరలు:** గొడ్డుకూర, దబ్బచారికూర, కొండమాటిపూలుకూర(చిగుర్లు), సప్పికూర, పుల్లగుమ్మడికూర, రాతిగొంగూరకూర, ఊబుచారికూర, కొప్పుకూర, గాజుకూర, గొర్రెదెక్కకూర, కాయకూర, కొండ్లెపుకూర, గర్బగూరకూర, దూళికూర, పొర్షగుమ్మడికూర, పిండికూర, గురుకూర, గుడ్డికూర, ముల్లుదొంటకూర,

చిలికదొంటకూర.

**చిన్నఅడవిపండ్లు:** మొళ్ళికె, జారికె, పోల, తుమ్మికె, మారోడి, పర్కి, పుల్లపర్కి, గూదపర్కి, బూసి, కొరుకుబూసి, బొడ్డ, చిట్టిఈత, మామిడి, పట్టెడికూర, పెద్దఈత.

**తినే అడవిగింజలు:** అడ్డగింజ, తంగుడుఅడ్డగింజ, తాండిగింజ, చీడిగింజ, పిండి గుదిలెంగింజ, చూరుదూదిగింజ, లొల్లొడిగింజ.

**అడవిదుంపలు:** పిడి, గింటుగ, ఊర్దు, చవిడె, తేగ, వైము, నూలె, చెదదుంప, వెర్రిచేదదుంప, మెట్టతామెరి, సింగురం, పన్నెకట్టు, తేనెగురిడె.

**అడవిలో దొరుకు గుడ్లు:** నెమలిపిట్ట, కారుకోడి, తొగరుకోడి, గువ్వపిట్ట, పురోడిపిట్ట.

**అడవిలో దొరుకు తేనెలు:** పెద్దతేనె, దొర్రతేనె(తొర్రతేనె), కర్రతేనె, వగ్గెరతేనె, మొసరుతేనె.

**తేనెపుప్పం(మకరందం):** దొరతేనె, పెద్దతేనె, కర్రతేనె, వగ్గెరితేనె, మొసరితేనె.

**అడవిలో దొరుకు తినే కొమ్ములు:** వెదురుకొమ్ములు (ఉడికించి), చిట్టిఈతకొమ్ములు (పచ్చిది), తాటుమొక్కమొవ్వు (దుంప), జారెవెదురు కొమ్ములు.

**జంతువుల కొమ్ములు:** కణుసు, దుప్పి, గొర్రె, పందివాయు, గుట్టిగేదె.

**అడవినుంచి వచ్చు కల్లు:** మామిడి, జాలిక, జీరిక, పొక్క, తాటి, పనసపండు(సార), చింతపండు(సార), కొబ్బరికల్లు, అంటుపండ్లసార.

**అడవి చీమలు:** చలిచీమలు, నూనెచీమలు, పిల్లిచీమలు, కండచీమలు, గూంటరిచీమలు, వెర్రిచీమలు, చెదచీమలు, పుల్లచీమలు, ఎర్రచీమలు, ఇదుతురుచీమలు.

**నీటిలో దొరుకు చేపలు:** రెక్కచేప, మొట్ట, మలుగు, గర్రెలు, ఎండ్రికలు, జాజులు, తురుగుగ్గెలు, చీలెండ్రుకలు, రెయ్యలు.

**తినే కొక్కులు:** మామిడి, పుట్ట, చిరిపుట్ట, వెదురు, వేనంపిల్లెండ్లు, అముదంకర్ర, అడ్డకర్ర, పందిమూతరి, తాడి, ఇసిక, గడ్డిగరుపులు, గదుతురు, వేపిచెవులు, డొక్కి, రాచెలక, మసి.

**తినే అడవిపువ్వులు:** కొండమాటి, కుచ్చెం, గొడ్డుగూర, జనుప, కారంటి, కస్సుమంటి, చిల్లి.

**పండించి తినే పువ్వులు:** గుమ్మడి

**తినే ఆకుకూరలు:** గుమ్మడి, దిప్ప, పిరిచారి, రామచారి, గురిడెచారి, దిప్పపొట్టు(ముదిరిన కాయ లోపలి భాగం), గొంగూర.

**తినే వెదురుకూర కొమ్ములు:** కొండవెదురు కొమ్ములు, జారెవెదురు కొమ్ములు.

**తినే దుంపలు:** పిరిచారి, గురిడె, పాలచారి, రామచారి, తియ్యచారి.

**పండించే దుంపలు(తినేవి):** నరకమాటుగు, మద్దిమాటుగు, చెందమాటుగు, సిడుగురుమాటుగు, నాగెలిమాటుగు, జిబ్బి(కర్రదుంప).

**చేదుదుంపలు:** తియచేద, వెర్రిచేద.

**తినే పచ్చిదుంపలు:** కప్పదుంప (చిలకడ) ఎర్రది, చెల్లికప్పదుంప.

**దప్పికి తినే దోసకాయలు:** మద్దిదోసకాయ, వెన్నెలిదోసకాయ, ఆకుదోసకాయ, కుల్మదోసకాయ(ఆకలికి).

**తినే పండ్లు:** పనస, పప్పారిపనస, అనాసిపనస, రామఫలం, సీతఫలం, మదనం.

**రసం కాయలు:** బత్తాయి, కొమర(కమల), నారింజ, జమ్మ, లిమ్మ(నిమ్మ), ఈడెకాయ, మాలకాయ.

**గుమ్మడికాయలు:** పిల్లిగుమ్మడి, పెండగుమ్మడి, దొనగుమ్మడి, బూడిదగుమ్మడి.

**చిక్కుడు రకాలు:** రాగి చిక్కుడు, వెన్నెల చిక్కుడు, గుంపు చిక్కుడు, కణుసుపోస చిక్కుడు, బెల్లం చిక్కుడు, ఏనుగుమొరక చిక్కుడు, నెలసి చిక్కుడు, సంబ చిక్కుడు.

**అపరాలు:** తీగమినుము, దుంపమినుము (రుప్ప), నల్లఅలసందలు (బొబ్బర్లు), కుమ్మరి అలసందలు (బొబ్బర్లు), పోలీసు అలసందలు.

**బబ్బీరలు:** బీరకాయలు, నూనెబీర

**కందులు:** పునసికంది, కొనకంది, కారుకంది.

**తివిరెలు:** బొండతివిరెలు, ఎర్రతివిరెలు.

**మిరప – ఒర్రకాయలు:** బొండొర్రకాయలు, తీగొర్రకాయలు, ఒర్రకాయలు, సీమెర్రకాయలు, మిల్లికాయలు.

**వంకాయలు:** ముంతవంకాయ, దొనవంకాయ, చిట్రవంకాయ, గెంజివంకాయ.

**ములికాయలు:** చిన్నములికాయలు (టమోటాలు).

**నువ్వులు:** చంకెనువ్వులు, నల్లనువ్వులు, తెల్లనువ్వులు, అడుసులు.

**ఉలవలు:** నల్లఉలవలు, తెల్లఉలవలు.

**అనుములు:** తెల్లఅనుములు, పెంక అనుములు.

**ధాన్యం (వడ్లు):** బుడమలు, ఏసలువ, బచ్చిలిగండెలు, చిన్నమైపలు, చెలకపయిరెలు, తోకవడ్లు.

**జొన్న:** గడజొన్న, ముంగరిజొన్న, పిట్టజొన్న, పొట్టజొన్న, కొర్రజొన్న.

**గంటెలు:** పెద్దగంటె, పిట్టగంటె.

**సామలు:** నల్లజామ, తెల్లజామ, దసరగొర్క, కన్నెసామ, కర్రిసామ.

**కొర్రలు:** నల్లకొర్ర, పచ్చకొర్ర, నక్కొర.

**బొంతలు:** బొంతలు, ఆల్లు(ఆరికెలు).

**గడ్డిధాన్యాలు (సిప్పలు):** పెద్దసిప్ప, గడ్డిసిప్ప.

**చోళ్ళు:** బూడెచోళ్ళు, తోరపుచోళ్ళు.

**కాకరి:** పొట్టుకాకరి(కారుది), నూనెకాకరి, ఆ కాకరి.

**పసుపు:** కోడిపసుపు, పందిపసుపు, సుంతపసుపు.

*(తరువాయి వచ్చే సంచికలో...)*

**రచయిత ఫోన్లు : 08864244873, 8500935424**

# కనులు చెమ్మగిల్లే కతలు




**ఏడు** వన్నెలతో వానవిల్లు మెరిసినట్లు 'కతలగంప'లో పలు వన్నెల కతలు. ఐనా వీటిలో ఎక్కువ కతలు ఆడవాళ్ళ కన్నీటి వెతలే మగ సమాజపు పెత్తనంలో కునారిల్లిన బతుకులే. రెండు రీతులనీతుల పాము పడగనీడలో ఇడుములను తప్పించుకోలేని మగువల బ్రతుకులలోని ఒడిదుడుకులే. తరతరాల అణచివేతల ఉక్కుకౌగిలిలో ఊపిరాడని వేదనలే.

పాంచాలమ్మపాట, రయికముడి ఎరగని బతుకు, సిడి మొయిలు, కతల గంప, ఒంటి నిట్టాడి గుడిసె, మొయిలునొగులు మాదిగ పుటక కాదు. కథలన్నీ మగ దౌష్ట్యం కింద నలిగిన బతుకులే. ఈ కథలన్నీచదువుతుంటే తరాలు మారినా, యుగాలు గడిచినా మహిళల బ్రతుకులు కొంచెం కూడా మారలేదనిపిస్తుంది.

'పాంచాలమ్మపాట'లో సునందత్త ఒక గాయపడిన గేయం. ఆమె భర్త ముద్దురెడ్డి చీట్లాటలో ఐదెకరాల పొలాన్ని ఓడిపోతాడు. ఆ పొలాన్ని గెలుచుకోడానికి ఆలిని ఒడ్డి ఓడిపోతాడు. పందెంలో గెలిచిన నాయుడు మూడురాత్రులు సునందమ్మ తనతోగడిపితే చాలు పొలాన్ని ఇచ్చేస్తానని అంటాడు. నాయుడు ముద్దురెడ్డి ఇంటికి వెళ్ళి సునందమ్మమీద తన ప్రతాపం చూపబోతే ఆమె కత్తి తీసుకొని ఎదురు తిరుగుతుంది. ఆ తర్వాత కొన్ని రోజులకు ఆమెను అనుభవిస్తాడు. అసలు కథ మొదలవుతుంది. ఊరందరిముందు 'ఈరోజుతో ముద్దు రెడ్డి మొగుడుతనం పోయింది. ఇప్పటినుంచి నేను ముండమోపిని' అని రయిక విప్పి ఇంట్లోకి వెళ్ళిపోతుంది.

'ఒంటినిట్టాడి గుడిసె'లో బూరగవ్వకూడ అంతే. భర్త బాలిరెడ్డి తను బతికుండగానే సవతిని ఇంటికి తెస్తాడు. ఆమె కూతుర్నికని చనిపోతుంది. తన కొడుకుతోపాటు సవతి కూతుర్ని కూడా పెంచి పెద్దచేస్తుంది. చివరికి మొగుడు, కొడుకు ఆ అమ్మాయిపై అఘాయిత్యం చేయబోతే ఇద్దర్నీ వదిలేసి ఇల్లువదిలి కూతుర్ని తీసుకొని బయటికి వెళ్ళిపోతుంది. ఆ అమ్మాయికి పెళ్ళి చేసి బతుకంతా ఒంటరిగానే బతుకుతుంది.

'సిడిమొయిలు'లో సిరివన్నె మీద కన్నేసిన నాగరాజును తన సావాసగత్తెలు ఓబమ్మ, మద్దూరమ్మ, కెంపమ్మలతో కలిసి తుదముట్టిస్తుంది. ఈ కథల్లో నాయికల జీవితాల్లో ఘోరమైన దుర్ఘటనలుజరిగినా ఏడుస్తూ కూర్చోలేదు. భర్త బతికుండగానే చచ్చినవాళ్ళలో జమచేసి ఆనాటి పాంచాలికంటే నాలుగాకులు ఎక్కువే చదివింది సునందత్త. తన సవతి కూతురిపై అఘాయిత్యం చేసినపుడు, సమాజం గీసిన లక్ష్మణ రేఖలను ఉల్లంఘించి, భర్తని, కొడుకుని ధిక్కరిస్తుంది బూరగవ్వ. అలాగే సిరివన్నె కూడా తెలివిగా సమస్యను పరిష్కరించుకొంటుంది.

బళ్ళో తెలుగు పిల్లలు 120 మంది వున్నారు కాబట్టి, కొత్తగా కట్టిన అర తెలుగు విద్యార్థులకే ఇవ్వాలని ఒప్పించి, సాధించి ఆ బళ్ళో హీరోలా వెలిగిపోతాడు తెలుగు సిన్నోడు తిమ్మరాయప్ప, తెలుగు మాట్లాడే ఊరిలో అరవబడి వద్దని తెలుగుబడి కావాలని పోరాడి గెలిచిన కథ 'మీసరవాన'.

'రయికముడి ఎరగని బతుకు'లో కన్నెమ్మది కష్టాలకథ. 'మొయిలునొగులు'లో చిన్నారవ్వ, 'కతలగంప'లో రుప్పిణవ్వ, 'మాదిగపుటక కాదు'లో కెంచక్కలవి కష్టాల కడగండ్ల బతుకులు.

ఏ కథనైనా రచయిత చెప్తాడు. కానీ ఈ సంపుటిలో పాంచాలమ్మ కథను దోవమ్మ చెప్పింది. రయికముడి ఎరగని బతుకు కథను తిరగలి, అంబటితెడ్డు, నిప్పట్ల పలక, చేట, ఇత్తడి బిందె చెప్తాయి. తెలుగు భాషాభిమానులమంటూ మనం మాట్లాడే భాషలో సగం సంస్కృతం పదాలుంటాయి. స.వెం. రమేశ్‌గారు ఎక్కడా సంస్కృతం. ఆంగ్లం మాటలు వాడకుండా అచ్చతెలుగులో కతలల్లి మనముందుంచారు. ఈ కతలను చదువుతుంటే మన తెలుగు బాస ఇంత సొగసైనదా అని మురిసిపోతాం. అప్పుడే తీసిన గుమ్మపాలు తాగినట్లు, తేనెపట్టులోనుంచి తీసిన తేనెను ఆస్వాదించినట్లు పరవశించిపోతాం. ఇంత చక్కని కతలు రాసి, కతలగంపని మనముందు పెట్టిన రమేశ్‌గార్ని అభినందిస్తూ, తొందర్లో మరో కొత్త కతలగంపతో మన ముందుకు రావాలని ఆశిస్తూ–

కతలగంప: రచయిత: స.వెం. రమేశ్; వెల: రూ.200/–

ప్రతులకు: అన్ని ముఖ్యమైన పుస్తక కేంద్రాలు మరియు మల్లవరపు వెలువరింతలు, 1–2–740, హనుమాన్ మందిరం దగ్గర, రాకాసిపేట, బోధన్–503 180, నిజామాబాద్ జిల్లా, తెలంగాణ, ఫోన్: 9010153505.

**– మందరపు హైమవతి,**
**ఫోన్: 9441062732**

# బాల్య జ్ఞాపకాల తీరంలో...




**పూ**దోట శౌరీలుగారి సిలువగుడి కతలు చదువుతుంటే మన మనసులకి ఒక్కసారిగా రెక్కలు మొలిచి బాల్యవనంలోకి ఎగిరిపోతాం. కనపర్తిలో పుట్టిన రచయిత్రి తన చిన్నప్పటి జ్ఞాపకాలను కమ్మని కతలుగా మలచి మన ముందుంచారు.

చిన్నప్పుడే తల్లిపోయిన తనను వదిన ప్రేమ ఉయ్యాలలో ఊపి పెద్ద చెయ్యడం, వ్యవసాయమే ప్రాణంగా బ్రతికే కన్నతండ్రి, బాల్యంలో పాఠాలు వల్లెవేసిన బడి, ఆ బడిలోని పంతుళ్ళు, అప్పటి తన నేస్తాలు, పండుగలు, పబ్బాలు, పెళ్ళిళ్ళు, పేరంటాలు అన్నిటిని పూసగుచ్చినట్లు చెప్పారు. కథలన్నీ క్రైస్తవ మతనేపథ్యంలో సాగుతాయి.

ఈ సంపుటిలో గంపకింద అంతయ్య పంతులు, జడకుప్పెలబర్రె, వానగుంతలచెక్క, ఐదు పాపాలన్నా చెప్పాల, పూలకోడి–పిచ్చికోడి కథలు మరింత ఆసక్తికరంగా వుంటాయి. సుమారు ఐదు దశాబ్దాలకిందటి జ్ఞాపకాల మాలికలివి. శుభకార్యాలు వచ్చినా, అశుభ కార్యాలు వచ్చినా ఊళ్ళో అందరూ కలిసి పాలుపంచుకోవడం, పల్లెప్రజల ఆత్మీయతలు, అనుబంధాలు, ఆనాటి మానవ సంబంధాలు మనకళ్ళకు కట్టినట్లుగా బొమ్మ కట్టిస్తారు రచయిత్రి.

పెరిగి పెద్దయ్యాక కొన్నేళ్ళ తర్వాత కనపర్తికి వెళ్ళి మారిన ఊరునుచూచి రచయిత్రి బాధపడినట్లు మనమూ బాధపడతాం. రచయిత్రికి ఇది మొదటి పుస్తకమైనా ఎక్కడా అలా అనిపించదు. గుంటూరు మాండలికంలో, చక్కని తెలుగులో వున్న ఈ కథలన్నీ మొదటినుంచి చివరివరకు ఒక్క బిగితో చదివింపచేస్తాయి.

ఒకసారి బాల్యంలోకి వెళ్ళాలనుకొంటే సిలువగుడి కతలు చదవండి. మీకోరిక నెరవేర్చుకోండి.

సిలువగుడి కతలు–రచయిత్రి: పూదోట శౌరీలు: వెల: రూ.150/– ప్రతులకుఅన్నిముఖ్యమైన పుస్తక కేంద్రాలు మరియు మల్లవరపు వెలువరింతలు, 1–2–740, హనుమాన్ మందిరం దగ్గర, రాకాసిపేట, బోధన్–503 180, నిజామాబాద్ జిల్లా, తెలంగాణ, ఫోన్: 9010153505.

వార్త

# రాష్ట్రేతర తెలుగు సమాఖ్య తొలి మహాసభలు




**వివిధ రాష్ట్రాలనుండి విచ్చేసిన సమాఖ్య సంస్థాపక సభ్యులు, నిర్వాహకులు, ముఖ్య అతిథులు**

**తె**లుగు రాష్ట్రాల వెలుపల దేశంలోని ఇతర రాష్ట్రాల్లో నివసిస్తున్న తెలుగువారికి ఒక ప్రత్యేక గుర్తింపు, ప్రతిభాపాటవాలను గుర్తించే ఒక వేదిక కావాలనే సంకల్పంతో రాష్ట్రేతర తెలుగు సమాఖ్య ఏర్పడింది. డిసెంబర్ 2012లో తిరుపతిలో జరిగిన 4వ ప్రపంచ తెలుగు మహాసభ వేదికగా వివిధ రాష్ట్రాలనుంచి వచ్చిన కొందరు కార్యకర్తల నిరంతర చర్చల ఫలితంగా ఈ సమాఖ్య తెలంగాణలోని రంగారెడ్డి జిల్లాలో మే 21, 2015న నమోదు చేయబడింది. సమాఖ్య తొలి సమావేశానికి అహ్మదాబాద్ ఆంధ్ర మహాసభ ఆతిథ్యమివ్వగా పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు, ఆం.ప్ర. ఫిలిం, టివి, నాటక సంస్థ మైసూరులోని భారతీయ భాషా కేంద్రం అన్ని విధాలా సహకరించడంతో ఈ తొలి మహాసభలు 2015 జూన్ 26, 27, 28 తేదీలలో గుజరాత్‌లోని అహ్మదాబాద్‌లో విజయవంతంగా జరిగాయి. మూడు రోజుల కార్యక్రమంలో సుమారుగా గుజరాత్‌నుండి 700 మంది, ఇతర రాష్ట్రాలనుండి 400మంది పాల్గొన్నారు. పండుగ వాతావరణంలో ఎంతో ఉత్సాహవంతంగా జరిగిన ఈ సభల్లో పాల్గొన్నవారిలో సగంమంది మహిళలే ఉన్నారు. రెండు వందలమంది కళాకారులు 40కి పైగా ప్రదర్శనలిచ్చారు. తెలుగు రాష్ట్రాలకు బయట ఉన్న తెలుగు వారిలో కూడా చక్కని ప్రావీణ్యముందని, అవకాశమొస్తే ప్రదర్శించగలమని వారు తెలిపారు. రచయితలు కూడా పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. అందరు కవులు, కళాకారులు, వక్తలు తమ సొంత ఖర్చులతో వచ్చి పాల్గొన్నారు. శ్రీ తనికెళ్ల భరణి, రావికొండలరావు వంటి ప్రముఖ సినీ కళాకారులు రెండు రోజులపాటు సభలో గడిపి ఉత్సాహం రేకెత్తించారు.

సభ తొలిరోజున్న ఠాగూర్ హాలు వరకు వెయ్యిమందితో ఊరేగింపు జరిగింది. విశేష అతిథులుగా ఆంధ్రప్రదేశ్ శాసనమండలి అధ్యక్షులు డాక్టర్ ఎ.చక్రపాణి, ఆం.ప్ర. శాసనసభ ఉపసభాపతి శ్రీ మండలి బుద్ధప్రసాద్ పాల్గొన్నారు. సమాఖ్య స్థాపక అధ్యక్షులైన శ్రీ పి.వి.పి.సి. ప్రసాద్ విశేషంగా శ్రమించి ఇంత కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వహించారు. 'ఆధునిక పరిస్థితుల్లో అనేక మాతృభాషల పరిస్థితి దయనీయంగా ఉందని, యునెస్కో కూడా మాతృభాషల పరిరక్షణకు పూనుకొన్నదని, అందరమూ కలసి తెలుగు భాషను పరిరక్షించుకొందామని శ్రీ మండలి బుద్ధప్రసాద్ పిలుపునిచ్చారు. సమావేశాల ఆహ్వానసంఘ అధ్యక్షులు, గుజరాత్ పూర్వ ముఖ్య కార్యదర్శి శ్రీ జి. సుబ్బారావు, ఆం.ప్ర. క్రీడామండలి అధ్యక్షులు శ్రీ పి.ఆర్. మోహన్, ఆం.ప్ర. ఉభయ సభల కార్యదర్శి శ్రీ కె. సత్యనారాయణరావు, మరికొందరు ప్రముఖులు పాల్గొని ప్రసంగించారు. సాంస్కృతిక కార్యక్రమాల్లో అవధానాలు, భరత నాట్య ప్రదర్శన, కవి సమ్మేళనం, వాద్యగోష్టి, శాస్త్రీయసంగీతం, జానపద నాట్యాలు, పద్యనాటకాలు ఆకర్షణీయంగా జరిగాయి. సభల్లో వివిధ రాష్ట్రాల ప్రతినిధులు మాట్లాడుతూ భాషాపర అల్పసంఖ్యాకులుగా తాము ఆయా రాష్ట్రాల్లో ఎదుర్కొంటున్న ఇబ్బందులను వివరించి తమ ఆందోళనను వెలిబుచ్చారు. పూర్తిగా సహకరిస్తామని ముఖ్య అతిథులిద్దరూ వారికి హామీలనిచ్చారు.

ప్రతి ఏడూ రాష్ట్రేతర తెలుగుసమావేశాలను వివిధ ప్రాంతాల్లో జరపాలని నిర్ణయించారు. ఇందువల్ల ఆయా రాష్ట్రాలలో నివసిస్తున్న తెలుగువారు అందరూ మమేకమై కొత్త ఉత్సాహాన్ని నింపుకుని తెలుగువారి అభివృద్ధికి కృషి జరగగలదనే ఆలోచనను నిర్వాహకులు వెల్లడించారు. తెలుగుతనం క్షీణిస్తున్న ఈ కాలపు యువత మనసంస్కృతి, కళలు అన్ని రాష్ట్రాలలో అలవర్చాలని అన్ని రంగాలలో వారికి తగిన శిక్షణా సంస్థలు నెలకొల్పాలని పలువురు కోరారు. తెలుగు రాష్ట్రేతర రాష్ట్రాలలో తెలుగుభాషను ఒక ఐచ్ఛిక అంశం(ఆప్షనల్ సబ్జెక్ట్)గా పెట్టాలని భాషాపర అల్పసంఖ్యాకులకు ఉద్యోగావకాశాలు కల్పించాలని ఆయా ప్రభుత్వాలపై ఒత్తిడి తేవాలని వక్తలు అన్నారు.

పుస్తక పరిచయం

# రేలపూలు



**ఇది** 17 కథల సంపుటి. దీని రచయిత శ్రీమతి నమ్మెట ఉమాదేవి. ఈమె కథారచయితగా పేరుపొందారు. ఇప్పటికే 'అమ్మకథలు' పేరుతో కథల సంపుటిని ప్రచురించారు. తాను అధ్యాపకురాలుగా పనిచేస్తున్న ప్రాంతంలోని తండావాసుల జీవితాంశాలను కథాంశాలుగా తీసుకొని 'రేలపూలు' కథల సంపుటిని ఇప్పుడు ప్రచురించారు. సమస్యలను కథలుగా మలచడం, కథలోనే సమస్యను చర్చించడం- అనే రెండు పద్ధతులను రచయిత సమర్థవంతంగాపోషించారు.గిరిజన తండాల గుండె సవ్వడే - ఈ రేలపూలు. రేలపూలు: వెల: రూ.120/- లభించుచోటు: అన్ని పుస్తక విక్రయ కేంద్రాలు మరియు బి.డి. నివేదితా దినేష్, ఇంటినెం.3-2-353, 2వ ఫ్లోర్, స్వామి వివేకానంద స్ట్రీట్, ఆర్.పి.రోడ్డు, సికింద్రాబాద్-5000003. ఫోన్: 81006678746.

# C బాచ్ అమ్మాయి



**ఇది** 17 కథల సంపుటి. దీని రచయిత డాక్టర్ కె.ఎన్. మల్లీశ్వరి. ఈమె ఇంతకు పూర్వమే నవలలు, కథా సంపుటాలు, విమర్శ గ్రంథాలు ప్రకటించారు. ఈమె ప్రసిద్ధికెక్కిన రచయిత్రి. ఈ పుస్తకం వెల : రూ.100/-. ప్రతులు దొరుకు చోటు: డాక్టర్ కె.ఎన్. మల్లీశ్వరి, 39-5-11, 2వ లేఅవుట్, మురళీనగర్, విశాఖపట్నం-7, ఫోన్: 9246616788.

# కళ్యాణపురం



**ఇది** 'యానాం'- అనే కేంద్రపాలిత ప్రాంతాన్ని కేంద్రంగా చేసుకొని వ్రాసిన కథల సంపుటి. దీని రచయిత దేవదానం రాజు. ఈయన కవిగా, కథకునిగా ప్రసిద్ధులు. ఇప్పటివి వీరు 14 పుస్తకాలు ప్రచురించారు. కళ్యాణపురం వెల:రూ.100/-. లభించుచోటు: దాట్ల దేవదానంరాజు, 8-1-048, జక్రియానగర్, యానాం-533464. ఫోన్: 9440105987.

# ఆనాటి నెల్లూరోళ్ళు



**నె**ల్లూరు ప్రాంతంలో వివిధ రంగాల్లో ప్రసిద్ధులైన వ్యక్తుల విశేషాలను తెలుపుతూ వెలువడిన గ్రంథం - ఆనాటి నెల్లూరోళ్ళు. రచయిత ఈతకోట సుబ్బారావు. ఈయన కవి, కథారచయిత, సంపాదకుడు. ఇంతకుముందే తొమ్మిది పుస్తకాలను ప్రచురించారు. ఇది తప్పనిసరిగా చదువవలసిన పుస్తకం. ఆనాటి నెల్లూరోళ్ళు: వెల: రూ.250/- లభించుచోటు: ఈతకోట సుబ్బారావు, 24/1697, 2వ వీధి, రవీంద్రనగర్,నెల్లూరు-524 004. ఫోన్: 9440529785

# ఉద్యమ స్వరానికి 100 ప్రశ్నలు



**ఇది** కొత్త ప్రయోగం. ఇందులో ఒకరు పత్రికా సంపాదకులు, సాహితీకారులు. రెండవవారు వైద్యులు, కవి, సామాజిక ఉద్యమనేపథ్యంకలవారు. మొదటివారు నియోగి, రెండవవారు డాక్టర్ దామెర రాములు. దామెర రాములు సాహితీ ప్రస్థానానికి సంబంధించి నియోగి ప్రశ్నలు సంధించి, వచ్చిన సమాచారాన్ని వ్యాసరూపంలో వెలువరించడమే ఈ గ్రంథంలోని విశేషం. ఈ గ్రంథం వెల రూ.120/-. లభించుచోటు: ఇంటినెం.7-01, టి.వి.ఆర్. స్ట్రీట్, సత్తుపల్లి, ఖమ్మం జిల్లా-507 303, ఫోన్: 9553097319.

# కవిరాజు త్రిపురనేని



**'ప్ర**ముఖ రచయిత, విమర్శకుడు శ్రీ ముత్తేవి రవీంద్రనాథ్ రచించిన ఈ చిన్ని పుస్తకం 45 పుటల్లో త్రిపురనేని రామస్వామి చౌదరిగారి జీవితాన్ని, వ్యక్తిత్వాన్ని, ఔన్నత్యాన్ని, సమాజసేవను సంక్షిప్తంగా అందించారు. తెలుగు సమాజంలోహేతువాద ఉద్యమాలగురించి తెలుసుకోగోరేవారు తప్పక చదవాలి. వెల: రు.50లు.ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్. రచయిత ఫోన్: 98491 31029

# మనిషీ మట్టీ



**'జ**నసాహితి' సంస్థనుంచి వచ్చిన కథల సంకలనం. సింగమనేని నారాయణ, సి.హెచ్. మధు, వారాల కృష్ణమూర్తి, కాట్రగడ్డ దయానంద, లియోతోల్‌స్తాయ్, అయినాల కనకరత్నాచారి, డా॥ జి.వి. కృష్ణయ్య, తోలేటి జగన్మోహనరావు, గోపీచంద్, చోడవరం రామకృష్ణ, డా॥ లెనిన్ ధనిశెట్టి గారల రచనలనుండి ఎంపిక చేసిన కథలు ఇవి. కథలెలా ఉండాలి అనే అంశంపై డి. వెంకట్రామయ్య ప్రసంగ వ్యాసాన్ని ఈ కథలకు ముందు ఇచ్చారు. ఇది అందరూ చదవతగిందే. వెల. రూ.50లు, ప్రతులకు :మైత్రీబుక్‌హౌస్, ఏలూరురోడ్డు, విజయవాడ, ఫోన్:98486 3164.

# గుంటూరు జిల్లా స్వాతంత్ర్యానంతర ప్రముఖ రచయిత్రుల కథా రచనల్లో స్త్రీ జీవితం

**పు**స్తకం పేరులోనే ఈ పుస్తకం సారాంశం అర్థమవుతుంది. ఇందులో కనుపర్తి వరలక్ష్మమ్మ, మల్లాది సుబ్బమ్మ, సి. వేదవతి, ఆర్.వసుందరాదేవి, వాసిరెడ్డి



సీతాదేవి, .తేజోవతి, విజయలక్ష్మి, ఓల్గా, పోగుల విజయశ్రీ, చిల్లరభవానీదేవి, చల్లపల్లి స్వరూపరాణిగారల జీవిత విశేషాలను, రచన లక్ష్యాలను, కథల వివరణను, విశ్లేషణలతో పరిచయం చేశారు రచయిత్రి.డా॥ చినలక్ష్మీ కళావతి, 190 పుటలు, రూ. 120/-లు. ప్రతులకు : డా॥ సి.హెచ్. కళావతి, ప్లాట్ నెం.405, లక్ష్మీతులసీ హోమ్, రెడ్డిహోటల్ వద్ద, నగరంపాలెం., తక్ష్మీతులసీ హోమ్, రెడ్డి హాస్టల్ వద్ద, నగరంపాలెం, గుంటూరు-4, ఫోన్:

## కొత్త పుస్తకాలు



### శ్రీమహాభాగవతము (సరళ వ్యవహారికంలో)

రచయిత: **ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు, విద్యావాచస్పతి వక్కపట్ల వృషాద్రిపతి**

వెల: *300/-* ప్రతులకు : 15-35, నిర్మలా సదన్, శ్రీనివాసకాలని, సిరినగర్, కెనడిహైస్కూలు వెనుక, బందరురోడ్డు, విజయవాడ-7. ఫోన్:984894 99169



### శ్రీ నందనందనోపాఖ్యానము

(పద్య కావ్యము)

రచయిత: **ఆలూరు కృష్ణమూర్తి**

పుటలు : *528*, వెల: *300/-*

ప్రచురణ కర్త: విజయలక్ష్మీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, 16-99, స్వామి మేస్త్రి వీధి, చిత్తూరు. ఫోన్: 94931 55331.



### పురి విప్పిన ఊపిరి (కవిత్వం)

రచయిత: **డా. ఎన్. గోపి**

పుటలు : *112* వెల: *150/-*

ప్రతులకు : ఎన్. అరుణ, ఇంటి నెం.13-1/5B, శ్రీనివాసపురం, రామంతపూర్, హైదరాబాద్-500 013. ఫోన్: 9391028496.



### స్వర్గానికి దుప్పట్లు

(శ్రీకృష్ణదేవరాయల గ్రంథమాల)

(పిల్లల్ని పెద్దల్ని చదివించే కథలు)

రచయిత: **కల్లూరు రాఘవేంద్రరావు**

పుటలు: *72*, వెల : *60/-*

ప్రతులకు : 26-4-982, త్యాగరాజనగర్, హిందూపురం-515201. ఫోన్: 94932 71620



### బొమ్మలమ్మ గుట్ట చక్రేశ్వరి దేవి శతకము

(పద్య మాలిక)

రచయిత: **సి. శ్రీనివాసరాజు**

పుటలు : *46* వెల: *99/-*

ప్రతులకు : పి. విజయలక్ష్మి, ఇంటి నెం.7-2-447, మన్‌కమ్మతోట, కరీంనగర్ - 505 001. ఫోన్: 98491 51995.



### జ్ఞాన చంద్రిక

(సామెతల సత్యవేదము)

రచయిత: **మద్దా సత్యనారాయణ**

పుటలు : *120*, వెల: *50/-*

ప్రతులకు : 4-14, ఇ.బి.సి. కాలని, గురజానపల్లి, కాకినాడ రూరల్, తూర్పు గోదావరిజిల్లా. ఫోన్: 98492 57034.



### బతుకుదెరువు (కథలు)

రచయిత: **సంకేపల్లి నాగేంద్రశర్మ**

పుటలు : *124*, వెల: *90/-*

ప్రతులకు : శరత్ సాహితి కళా స్రవంతి ఇంటి నెం.6-6-103111, శివాజి నగర్, కరీంనగర్. ఫోన్: 94417 97650



### తెలుగు ప్రచురణరంగం

(ప్రచురణకర్తల పరిచయం)

కూర్పరి: **మువ్వల సుబ్బరామయ్య**

పుటలు : *175*, వెల: *100/-*

ప్రతులకు : జయంతి పబ్లికేషన్స్, కారల్‌మార్క్సురోడ్డు, విజయవాడ-2. ఫోన్: 89782 61496.



### సాహిత్య డైరీ

(రచయితల పుట్టిన, గిట్టిన తేదీలు)

రచయిత: **మువ్వల సుబ్బరామయ్య**

పుటలు : *176*, వెల: *100/-*

ప్రతులకు : జయంతి పబ్లికేషన్స్, కార్ల్‌మార్క్స్ రోడ్, విజయవాడ - 520 002. ఫోన్: 89782 61496



### నమ్మకాలు వమ్మవుతున్నచోట

(కవిత్వం)

రచయిత: **ఏలేశ్వరం వెంకటేశ్**

పుటలు : *112*, వెల: *100/-*

ప్రతులకు : శ్రీ సత్య జ్యూయలర్స్, 19-7-2/1, లక్ష్మీనగర్, గోదావరి ఖని-505 209. ఫోన్: 98494 87146



### ఎదురుమతం

(ప్రగతిశీల ముస్లిం కవిత్వం)

రచయిత: **షేక్ కరీముల్లా**

ఫోన్: 94415 02990

పుటలు : *86*, వెల: *50/-*

ప్రతులకు : షేక్ మషురున్, 21-55, పెద్దమసీదు బజారు, వినుకొండ-522 647.



### ఆమోద వీచి

(సహ రచయితల గ్రంథాలకు ముందు మాటలు)

రచయిత: **డా. ఆశావాది ప్రకాశరావు**

పుటలు : *102* వెల: *80/-*

ప్రతులకు : డా. ఆశావాది ప్రకాశరావు, 4/292, కుమ్మరదొడ్డి, అనంతపురం జిల్లా, పెనుగొండ-515110 ఫోన్: 9440488600

Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)
RNI-APTEL/2015/62362

## 'తెలుగుకు ఏమీ ధోకా లేదు' –చలసాని ప్రసాద్

# చలసాని ప్రసాద్ మరణం తెలుగు సమాజానికి తీరనిలోటు






ఆయన విప్లవకవి. వ్యక్తిగా సౌమ్యుడు. స్నేహశీలి. నిరంతర అధ్యయనశీలి. అదంతా మార్క్సిస్టు పంథాలోనే. ఆయన ఇల్లు ఒక పెద్ద గ్రంథాలయం. ఎనిమిది గదులూ గ్రంధాలతో నిండి వుంటాయంటారు.

సాహితీవేత్త. శ్రీశ్రీ, కొ.కు రావిశాస్త్రిల రచనలపై సాధికారికంగా మాట్లాడగలరు. ఆయన వద్ద వున్న పుస్తకాల ఆధారంగానే ఏడెనిమిదిమంది పిహెచ్.డి.లు చేశారని అంటారు. 'విరసం'కు మూలస్తంభాల్లో ఒకరు.

ఆయన కుటుంబ నేపథ్యమంతా కమ్యూనిజమే. తెలంగాణా సాయుధపోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొన్నారు. జీవితమంతా మార్క్సిస్టు సైద్ధాంతిక ప్రయాణమే. అంకితమే. ఏమి ఆలోచించినా మాట్లాడినా అంతా ముందుచూపుతో ఉంటుంది. పిరికితనం, వెనకడుగు, తాత్సారం ఆయనలో ఏకోశానాలేవు.

సుమారు పన్నెండేళ్లుగా ఆయన 'నడుస్తున్న చరిత్ర'ను చదువుతున్నారు. చందా కట్టి తెప్పించుకొనేవారు. చందావద్దండీ. మీరు పత్రిక చదవడమే మాకు గౌరవం అంటే అలాంటి మాటలు వద్దు. చందా కట్టి తెప్పించుకొంటేనే నాకు తృప్తిగా ఉంటుంది అన్నారొకసారి. పత్రిక ఆగిపోయి మూడు నెలల తర్వాత ఒకసారి నాకు ఫోన్ చేసేవారు. 'త్వరగా కోలుకొని పత్రికను మళ్లీ తీసుకురండి. తెలుగుకోసం మళ్లీ పత్రిక రావాలి' అన్నారాయన. 'అమ్మనుడి' మార్చి సంచికను అందుకోగానే ఆయన ఎంతో ఆనందించారు. తెలుగు అభివృద్ధి అంటే ఏమిటో సరైన దృక్పధం ఆయనకుంది. తెలుగు భాష, తెలుగు సమాజం ఎలా ఎదిగిందీ చరిత్రలోతుల్లోకి వెళ్లి చర్చించగల అధ్యయనం ఆయనకుంది. ఆయన ఎప్పుడు ఉత్తరం వ్రాసినా అది పోస్టుకార్డే - అయిదారు వాక్యాలు. ఫోన్‌లో ఆయన మాట్లాడింది మనం వినాల్సిందే. ఆయన చెప్పదలచింది చెప్పి ఫోన్ పెట్టేసేవారు. నా అంతట నేను ఫోన్‌చేసి మాట్లాడితే - ఎంత వినిపిస్తుందో తెలియదు. శ్రద్ధగా వినేవారు. తర్వాత ఒక కార్డు వ్రాసేవారు.

కొన్నేళ్ల క్రితం ఒక ఆంగ్లపత్రికలో వచ్చిన ఒక పెద్ద వ్యాసాన్ని 'The efficiency of Languages' ను ఇటీవల నాకు పంపించి దీన్ని అనువాదం చేయించి 'అమ్మనుడి'లో వెయ్యాలి అని చెప్పారు. ఆ వ్యాసం అంతా సాంకేతిక పదజాలంతో కూడి వుంది. భాషల సామర్థ్యం గురించి చర్చిస్తూ తెలుగు ఒక భాషగా అత్యంత శక్తివంతమైనదని నిర్ధారించే వ్యాసం అది. 'సెప్టెంబరు సంచికలో ఆ వ్యాసాన్ని చదవండి). దాని తర్వాత 'ఇంకా రెండు మూడు పుస్తకాలు తీసివుంచాను. వాటిలోని అంశాలు మనం పత్రికలో వెయ్యాలి' అన్నారు. నేను జూన్, జూలై నెలల్లో విశాఖపట్టణం వెళ్లి వారితో వీలైనంతసేపు ఉండి వారి సలహాలు తీసుకుందామనుకున్నాను. అయితే ఆ ప్రయాణం సెప్టెంబరుకు వాయిదా పడింది. ఇప్పుడు ఆ అవకాశం ఇక ఎప్పటికీ రాదు.

నేను చూసిన నిబద్ధతగల కొందరు పెద్దలలో వారొకరు. ఆయన తీవ్రవాదీకాదు, పిడివాదీ కాదు, సైద్ధాంతిక నిబద్ధతకూ అధ్యయనానికీ ప్రతిరూపం. 'తెలుగు ఎన్నటికీ చావదు. సంస్కృతాన్నీ, ఆంగ్లాన్నీ తట్టుకొని నిలిచింది. ఇంకా ఎన్ని ఆటుపోట్లయినా తట్టుకోగల శక్తి తెలుగుకుంది. సెంటిమెంట్‌ను పక్కనపెట్టి శాస్త్రీయంగా మనం ముందుకు సాగితే తెలుగు భవిష్యత్తుకు ధోకా లేదు' అనేవారాయన. ఆయన చిరస్మరణీయులు. ఆయన లేని లోటు తీరదు.

- సంపాదకుడు, **అమ్మనుడి**

